


సంపుటము 25 | ఏప్రెల్, 1948 | సంచిక 4

సర్వజిత్తు ఫాల్గునము

# స్వాగతము

శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి

సహకారశాఖికాస్థానపండితుఁడైన పికరాజు మధురగీతికలఁ బాడ
ప్రసవాసవాత్యంతపాననిర్భరములు భ్రమరముల్ నీలతోరణముఁ గట్ట
నవసౌకుమార్యసుందరమూర్తులౌ లతాకన్యక లారాత్రికముల నొసఁగ
పాటీరసౌరభోద్వహనాలసములైన మలయవాయువులు చెంతలను గొలువ
నవ్యవేషము నవ్యసౌందర్యమమర-భారతీయుల పున్నెముపంటగాగ
వచ్చితివి సర్వధారి సంవత్సరంబ !-స్వాగతము నీకు సర్వదా స్వాగతంబు.

గాంధీదేవుని జంపుకొంటిమి, జగత్కల్యాణనిర్మాణధౌ
రంధర్యమ్మును మంటఁగల్పితిమి, ధర్మద్రోహమాలిన్యముల్
సంధింపం దొరకొంటి మార్యుల కహింసాజ్యోతిఁ జల్లార్చి పా
పాంధభ్రష్టుల మైతి మెల్లరము నూత్నాబ్దంబ! సైరింపుమా.

నీమునుముందె వచ్చి పయనించి గతించిన ప్రాఁతయేండ్లలో
ఏ మొనరింపఁజాలని యకృత్యము లేదు, భరించనట్టి యే
బాములు లేవు, నీదు చలువన్ మఱియిప్పటికైన మానవ
స్సీమల సాటిలేక వికసించునుగావుత ధర్మపుష్పముల్.

# సర్వధారి!

= శ్రీ బులుసు వేంకటేశ్వర్లు =

భరతజనులకు స్వాతంత్ర్యభాగ్య మొసగి
సర్వజిద్వర్ష మమలయశంబు గాంచె
భారతీయుల భాగ్యసర్వస్వ మెడపి
సర్వజిద్వర్ష మతులదుష్టంబు నయ్యె.

సుఖ మొకపాలు కష్టముల
చొప్పది యింకొకపాలు నోచు నీ
సకలజగంబునన్ సుఖవి
చారములే యొకదానివెంట వే
ఱొకటిగ వచ్చుచుంట, యెది
యో యొకటే నిలుపోపకుంట, సృ
ష్టికి సహజంబు నాగుణవి
శేషము తత్త్వరహస్యముం గదా!

పరమపురుషార్థవేదులౌ భారతీయు
లీరహస్యంబు దలపోయనే 'ఉగాది'
నిక్షుఖండాదికంబుతో నింపుమీఱ
వేపపూచేదు దిన ధర్మవిహిత మయ్యె.

తరురాజిన్ లతలందు లేజిగురు ల
త్యంతంబు చెంపొందు నీ
తరుణంబందు, గుహూనినా
దములతో దారుణ్యపుంగోకిలల్
పరివారంబుగ నిన్ను బిల్చు సరసా
లాపంబులం గీరముల్
మరుగీతంబుల బాడు నీకు నరుదె
మ్మా! సర్వధారీ! కృపన్.

సత్వరాంధ్రరాష్ట్రసంసిద్ధి యొనగూర్చి
పోరు బొంది లేక పుడమి మనిచి
సర్వధారి! నీవు చను మంతియేకాని
క్షోభపెట్టవలదు సుమ్ము మమ్ము!

---

# నవయుగ నిర్మాత శ్రీ వీరేశలింగకవి

— శ్రీ నిడుదవోలు వెంకటరావు —

ఆంధ్రుల సాంఘికసారస్వతజీవితము లకు నూతనోత్తేజము గలిగించి, అద్యతనకాలమున నాంధ్రుల సర్వతోముఖాభ్యుదయమునకు తోడ్పడిన మహాపురుషుడు వీరేశలింగము. ఆంధ్ర సారస్వతపథకమున నీతడు త్రొక్కిన నూతనమార్గము లన్నియు నంతకుముందు వెలసినవియే. ఆంధ్రసారస్వతమున క్రీ. శ. ౧౯ వ శతాబ్ది ప్రథమ పాదముననే నవయుగము ప్రారంభమైనది. అయినను వీరేశలింగము వాఙ్మయరంగమున ప్రవేశించునాటికి సాహిత్యపథకము పండితాధీనమై యుండెను. పరవస్తు చిన్నయసూరి, పరవస్తు రంగాచార్యులు, కొక్కొండ వేంకటరత్నము, కోరాడ రామచంద్రశాస్త్రి మున్నగు దిగ్గజములవంటి విద్వన్మహాకవుల నియంతృత్వమున నాంధ్రసాహిత్యము వెలసినది. నవ్యవాఙ్మయప్రపంచమునకు నూతన శోభ నొడగూర్చిన ప్రత్యేక సాహిత్యశాఖ లన్నియు పైవారిచే ప్రాచీనపద్ధతిని క్షుణ్ణము చేయబడినవి. నవయుగముపై నేటికిని తన యనుపమానప్రభావమును చూపుచున్న ముద్రాయంత్రసౌలభ్యము, విశ్వవిద్యాలయ స్థాపనము, ఉన్నతవిద్యయం దుత్తమసాహితీ విశిష్టత—ఈ నవ్యసంస్కృతికి దోహద మొనగినవి. దీనికి చెన్నపురమే కేంద్రస్థానమైనను విశ్వవిద్యాలయమునకు సంబంధించిన కళాశాల లేర్పడుటవలన ఆంధ్ర దేశమున నొండు రెండు పట్టణములనుగూడ నిది వ్యాప్తమైనది. అప్పటికి ప్రాచీనరీతిని సంస్కారము గల పండితులు నీ నూతనమార్గములను గ్రహించి, సంఘమున కేవలము జ్ఞానవంతు లగు కొలదిమంది సాహితీపరులకే దీని నుపాదేయమగునట్లు కావించిరి. ఆనాడు వచన రచన, వ్యాసములు, ఉపన్యాసములు, పత్రికారచనములు, విద్యార్థులకొఱకు వ్రాయబడిన గ్రంథములు, శాస్త్రీయగ్రంథములు—వేయేల, సమస్తవాఙ్మయమును పండితులైన వారు గ్రహింపదగినరీతిలోనే యుండెను. అనగా పండితుల దృష్టిలో ప్రజాసామాన్యము సామాన్యమైనదిగనే పరిగణితము. ఇట్టి సంకుచితమగు పాండిత్యదృక్పథము నుండి సాహిత్యమును తప్పించి, ప్రజానీకము వైపున నీ నవ్యసంస్కారవాహినిని మరల్చిన మహావ్యక్తి వీరేశలింగము. ప్రజలలో గల నిసర్గమగు నఖండశక్తిని గుర్తించి పండితాధీనమున నున్న విజ్ఞానమును పండితులకే కాక పామరులకు, బాలురకేగాక బాలికలకు, అగ్రవర్ణములకేగాక హరిజనులకు, పురుషులకేకాక స్త్రీలకు, సమస్తమైన వారికి, జాతిమతవిచక్షణ ననుసరింపక తమ మాతృభాషలో, అతిసులభగ్రాహ్యమగు రీతి నందించి, వారిని విజ్ఞానవంతులుగ నొనరించి భాషాభివృద్ధి గావించి, తన్మూలమున సంఘసంస్కరణము గావించి, జాతీయాభ్యుదయమునకు, దేశాభ్యుదయమునకును మూలపురుషు డగుటచే వీరేశలింగము నవ్యయుగమునకు శకకర్తయైనాడు.

సాహితీప్రపంచమున వీరేశలింగకవి పురాతనాధునాతన సంప్రదాయములను రెండింటిని సమన్వయించియే అధునాతనాంధ్రవాఙ్మయనిర్మాణము గావించినాడు. ఈ రెండింటిని సమన్వయము చేసిన విధానము గమనించినచో నాతని ప్రత్యేకవిశిష్టత, ప్రతిభ గోచరింపగలవు.

తొలుత నవ్యసంస్కృతికి కేంద్రము చెన్నపురి. దానికి రాజమహేంద్రవరము కేంద్రముగా నిలిపినవాడు వీరేశలింగకవి. ఆదియుగమున నన్నయ, మధ్యయుగమున శ్రీనాథుడు, నవీనయుగమున వీరేశలింగము రాజమహేంద్రము నాంధ్రవాఙ్మయమున చిరస్థాయి గావించినారు. ప్రాచీనాంధ్ర కావ్యస్రవంతికి ప్రథమతీర్థము రాజమహేంద్రము. వీరేశలింగము నవ్యసంస్కారవాహిని నా తీర్థమున సమ్మేళనము చేసినాడు. గంగాయమునాసంగమమువలె ప్రాచ్య, నవీనవాహినులు సమ్మిళితమై వీరేశలింగము నాడు రాజమహేంద్రము పవిత్రసాహితీ క్షేత్రముగా పరిణమించినది.

సారస్వతజీవితములో ప్రథమమున వీరేశలింగము కవిగా పరిగణితుడు. రాజమహేంద్రవరమున భావసంవత్సరమునాటికి (౧౮౭౪) ముగ్గురే కవులు: వీరేశలింగము, వాసుదేవశాస్త్రి, వసురాయడు. వీరినే రాజమహేంద్రకవిత్రయ మని తరువాతివారు పేర్కొనిరి. క్రీ. శ. ౧౯౧౯లో వీరేశలింగ నిర్యాణమునుగూర్చి చెప్పినపుడు వసురాయడు

"ప్రకృతకవిత్రయంబునను
రాజమహేంద్రవరంబునందు నె
న్నిక గనునట్టి వారల క
నిష్ఠిగ నెక్కిన శ్రేష్ఠు..."

అని ప్రశంసించినాడు. ఇది "కనిష్ఠికాధిష్ఠితకాళిదాసః" అను సూక్తిని తలపింపజేయుచు నాంధ్రసాహిత్యమున వీరేశలింగ కవిస్థానమును వ్యక్తము చేయుచున్నది.

అచ్చతెలుగు కవిత

శుద్ధాంధ్ర (అచ్చతెలుగు) వాఙ్మయమున పొన్నిగంటి తెలగన్న, కూచిమంచి తిమ్మన, కందుకూరి లింగన కవిత్రయము. ఈ త్రయమున నీ వాఙ్మయమున వీరేశలింగ కవి యున్నతస్థాన మాక్రమించెను. ఈ వాఙ్మయమున కీత డొనరించిన సేవ మహోత్కృష్టమైనది. ఈ కవితలో నీతడు మూడు తెలుగుల మార్గదర్శకుడై "యచ్చతెనుగు నిర్జీవమై, మెఱుకబాసవలె కొఱుకబడని బాస"యను నభిప్రాయమును పోగొట్టి, సరళమై, సులభగ్రాహ్యమైన రచనము గావించి దానిని సజీవముగా నొనరించినాడు.

(౧) అచ్చతెనుగున నిర్వచనముగ, నిరోష్ఠ్యముగ (పఫబభమ వర్ణములు లేకుండ) కావ్యము రచించుట కీతడే దారిచూపెను. అసలచ్చతెనుగున వ్రాయుటయే కష్టము; అందులో నిట్టి నియమములను సాధించుట కష్టతరము. అయినను వీరేశలింగకవి యీ రచనమున నసమాననైపుణ్యము జూపి, సులభసాధ్యము గావించెను. ఈతని "శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచననైషధము" (౧౮౮౩) తరువాతనే శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన కుశచరిత్ర (మచ్చ వేంకటకవిరచితము, ౧౮౯౩), అచ్చాంధ్రనిర్గద్యనిరోష్ఠ్యసారంగధరచరిత్ర (౧౯౦౧), అచ్చాంధ్రనిర్గద్య నిరోష్ఠ్యదాశరథిచరిత్ర (౧౯౧౩) మున్నగునవి వెలసినవి. (౨) శుద్ధాంధ్రకావ్యములలో నిత్యవ్యవహారమున నుండు మనుష్యుల నామ

ములు, ఊళ్ళపేళ్ళు మున్నగునవి మార్పక, యథాస్థితముగ నుంచుట వీరి యచ్చతెనుగుకవితాగుణములలో నొకటి. కూచిమంచి తిమ్మన కొన్ని పేళ్లు తత్సమము నుండి యాంధ్రీకరించినకతన సుగ్రాహ్యములు కాకపోయినవి. ఇట్టివానివలన కవిత కృతక మగును. వీరేశలింగకవి పైనియమము గలిగిన నైషధమునందేగాక, తన శుద్ధాంధ్ర భారత రామాయణసంగ్రహములలో, రసిక జనమనో రంజనములో నీపద్ధతి యవలంబించినాడు. (3) కవితాశైలిలో సాధ్యమైనంత వఱకు మాఱుమూలపదములు, కల్పితపద ములు వాడక, వాడుకమాటలనే అచ్చ తెలుగుకవిత గూర్చినాడు. ఇది కేవలము వశ్యవాక్కుమాత్రమే నిర్వహింపగలడు.

అచ్చతెనుగున నీతని లోకోత్తర ప్రజ్ఞకు నలరి, సాహితీరంగమున వీరి ప్రతి స్పర్థి కొక్కొండవారు తమ బిల్వేశ్వరీయ ములో వీరి నిట్లు స్తుతించినారు:

"అచ్చతెలుగుగబ్బ మలవరించుట కూచి
మంచి తిమ్మనయును, మంచి తెలగ
నయును, లింగనయు నయమున స్వీయభా
షాభిమానమాన్యు లని నతింతు".

(ప్రతిబింబము ౧౫౬ పద్యము)

తత్సమయుక్తమగు తెనుగుభాషకు మూలకంద మనదగిన యచ్చతెనుగును నవీనకాలములో వ్యాప్తిలోనికి దెచ్చుటకు వీరేశలింగము ప్రధానుడు. వీ రిట్టి రచనమునకు దారిచూపినవెనుక, అచ్చతెనుగున వేదములు, ఉపనిషత్తులు, నాటకములు, శతకములు, వచనకావ్యములు మొదలగునవి వెలసినవి. ఇవి కొలదియేమైనను పూర్తిగ నవ్యభావనాప్రపంచమునవర్తించుచుంటి మని యనుకొనుచున్న నేటి కాలమునగూడ వెలువడుచునేయున్నవి! ప్రాచీన సారస్వతశాఖలయందును, భాషాతత్త్వ శాస్త్రమునందును పర్యాప్తమైన పరిశీలన కవకాశము లేని యీ దినములలో వీరేశలింగకవి యచ్చతెనుగునకు సంపాదించిన విశిష్టత మనము గ్రహింపలేకపోవుటలో నాశ్చర్యము లేదు.

## ప్రాచీనగ్రంథముద్రణము

ప్రాచీనపథకమున వెలసిన ప్రౌఢ కృతుల నెన్నింటినో వీరేశలింగము ముద్రించి, వ్యాప్తిలోనికి దెచ్చినాడు. ఈ విషయకమైన కృషి యమోఘముగ సాగించినాడు. నాచనసోముని హరివంశము, కేతన దశకుమార చరిత్రము, అనంతుని భోజరాజీయము, నందిమల్లయ ఘంటసింగయకవుల వరాహపురాణము, చఱిగొండ ధర్మన చిత్రభారతము మొదట ముద్రించి వ్యాప్తికి దెచ్చినవారు వీరే. ఇవియేకాక చింతామణీపత్రికాముఖమున వీరు ప్రభావతీప్రద్యుమ్నము, నారాయణకవి పంచతంత్రము, కాకమాని మూర్తి పాంచాలీ పరిణయము, మొల్లరామాయణము, ప్రబోధ చంద్రోదయము (నందిమల్లయఘంటసింగయ కవులది), విజ్ఞానేశ్వరము (కేతనది) మొదలగు వానిని ముద్రించి ప్రకటించిరి.

## గ్రాంథికవచనరచన

వచనకావ్యములను ప్రాచీనప్రౌఢ పండితుల రీతిని రచించు సామర్థ్యము తనకు గలదని తెలుపుటకు ఈయన చిన్నయసూరి ననుసరించి నీతిచంద్రిక సంధివిగ్రహములను రచియించెను. ఇవి నేటికిని విద్యార్థిలోకమునకు పఠనీయములై యున్నవి. కాని యిట్టి రచన వీరేశలింగకవికి సహజము కాదు. ప్రాచీన

సంప్రదాయములను నిలువబెట్టు నుద్దేశముతో నిట్టి రచన కావించినాడు. ఇట్టి యభిప్రాయముతో అవధానము చేసినాడు; ఆశుకవి ననిపించుకొన్నాడు. శతకములను రచించినాడు; సాహితీప్రౌఢిమను వెల్లడించినాడు. పైరీతిని ప్రాచీనపథకమును అవిచ్ఛిన్నముగ నిల్పుచు నవీనపద్ధతి నెట్లు సంతరించినాడో తెలిసికొనుట యావశ్యకము.

నవీనపథకమున ప్రధానమైనది గద్యరచన. ఎట్టి సూక్ష్మతరములగు శాస్త్రీయ విజ్ఞానాంశములనేమి, ఎట్టి మహోన్నత భావముల నేమి సర్వజనసులభముగ గ్రహించు వచనరచనకు సృష్టికర్త వీరేశలింగము. ఆ రచన, సంస్కృతసంపర్కమున్నను తెలుగుదనము కలిగియుండుటచే నీతనికి గద్యతిక్కనయను బిరుదము సార్థకము.

"నే నేర్పఱచుకొన్న భాషాభివృద్ధి మార్గము తెలుగుభాషలో మృదువైన, సులభశైలిని, సలక్షణమైన వచన రచన చేయుట" అని వివేకవర్ధనీపత్రికా ముఖమున నాతడే తన రచనాపద్ధతిని తెలిపియున్నాడు.

వీరి గద్యరచనల నీ క్రిందిరీతిని విభజింపనగును: (౧)నవల (౨)కథలు (౩)ప్రసిద్ధస్త్రీపురుషజీవితచరిత్రలు (౪) వ్యాసములు (౫) ప్రహసనములు (౬) గ్రంథవిమర్శనములు (౭) చారిత్రకగ్రంథములు (౮)పత్రికా రచనలు (౯) శాస్త్రగ్రంథములు (౧౦) ఉపన్యాసములు.

పద్యరచన:—(౧) నాటకములు (౨) కావ్యములు (౩)ప్రాస్తావిక రచనములు.

౧. నవల:—ఈ నవీనశాఖ 'రాజశేఖరచరిత్ర'తో ప్రారంభము. ఇది యాంగ్లేయభాషలోనికి భాషాంతరము గావింపబడి ప్రశస్తి కెక్కినది. వీరేశలింగకవి యిట్లు మార్గదర్శకు డగుటయేగాక చింతామణి పత్రికలో నవలలకు బహుమతు లేర్పఱచి, వానిని బరీక్షించి, ప్రకటనార్హమగువానికి బహుమతు లిచ్చి ప్రకటించి, ఆరంభదశలో నీ శాఖావ్యాప్తి కెంతయేని తోడ్పడెను. అట్టి నవలలలో మొదటిది "ధర్మవతీవిలాసము" అనునది. దీనికి వీరేశలింగము పంతులవారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, న్యాపతి సుబ్బారావుగారు పరీక్షకులుగ నుండి తీర్పు చేసినారు. ఆ వెనుక వచ్చినది చిలకమర్తి వారి 'రామచంద్రవిజయము'.

౨. కథలు.—బాలురకు నీతికథలు, ప్రౌఢులకు సత్యరాజాపూర్వదేశయాత్రలు మున్నగు రచనములు వ్యాప్తము లైనవి. ఇవి యనువాదము లైనను స్వతంత్రరచనములై వెలయుచున్నవి. మొదటిది నీతిదాయకము. రెండవది చిత్రకథావిలసితము.

౩. ప్రసిద్ధస్త్రీపురుషజీవితచరిత్రలు:— జీవితచరిత్ర లెట్లు వ్రాయవలెనో, జీవితచరిత్ర రచనమున నేయే విషయములకు ప్రాధాన్య మొసగవలెనో తెలియజేయుచు నివి మార్గదర్శకములై యున్నవి. విక్టోరియా మహారాజ్ఞిచరిత్ర, జీసస్‌చరిత్ర నేటికిని చదువదగినవిగా నున్నవి.

సంఘసంస్కరణమున వితంతువివాహముల గావించి స్త్రీజనోన్నతికై తన జీవితము ధారవోసిన వీరేశలింగకవి స్త్రీలకొఱకు కొంతవచనవాఙ్మయము సృష్టించెను. స్త్రీలకు విజ్ఞానముకొఱకు, సత్ప్రవర్తన నలవఱచుకొనుటకు, ఆరోగ్యము కొఱకు ఉత్తమస్త్రీచరిత్రములు, స్త్రీవిద్య, అతిబాల్యవివాహము మున్నగు వచననాటక

ములు, పత్నీహితసూచని, సతీహితబోధిని అను గ్రంథములను నాతడు రచించెను. నేటికి తెలుగునాటిలో స్త్రీవిద్య యిట్టి యున్నతస్థితియం దుండుటకు వీరేశలింగకవి యమోఘపరిశ్రమయే కారణము.

౪. వ్యాసములు:—ప్రత్యేకప్రత్యేక శీర్షికలతో, వక్తవ్యాంశమును విషయ విభాగము చేసి, అతిదీర్ఘమును, నతిక్షిప్త మునుగాక వివరించు లఘురచనకు వ్యాస మని పేరు. దేశాభిమానము, సత్ప్రివర్తన, నైతికవిషయములు మున్నగువానిని గూర్చి వ్రాసి వ్యాసరచనాపథకమును దిద్ది తీర్చినది వీరేశలింగమే.

౫. ప్రహసనములు :— ఈ రచన మున వీరేశలింగకవి సిద్ధహస్తుడు. సంస్కరణాభిలాషి యగుసీతని కీ రచనము ఇతరు లను నొప్పింపకుండ, సాంఘికలోపములను బహిర్గత మొనర్చి, సంఘమును సరియగు మార్గమున నడిపింపజేయుట కనువైనది. దీనికి తోడు వ్యావహారికభాష ప్రయుక్తమై, సభ్యమగు హాస్యమును గలిగి, పాత్రోచిత మై, స్వభావసిద్ధమగు రచనముతో నుండుట వలన వీరి ప్రహసనములు మిక్కిలి వ్యాప్తము లైనవి. మన భాషలో తిట్టుకవిత్వము లున్నవిగాని ప్రహసనములు లేవు. ప్రహసనము ఆంగ్లేయభాషలో 'ఫార్సు' అయినది. వీరేశలింగకవి చిన్నవి ౩౪, పెద్దవి ౨౪- మొత్తము ౫౮ ప్రహసనములను రచించెను. అపూర్వబ్రహ్మచర్యము, విచిత్ర వివాహము, ఆచారము - హిందూమహా జనుల మతసభ, మహాబధిరప్రహసనము, బలాత్కార గాన వినోద ప్రహసనము మున్నగునవి గణింపదగినవి.

౬. గ్రంథవిమర్శనములు:—ఇందులో ప్రధానమైనది వెంకటరత్నకవి విగ్రహ తంత్రవిమర్శనము. ఇందు గ్రంథము కేవలము వ్యక్తిగతము కాకుండ, సాహిత్యవిమర్శక దృష్టి నె ట్లనుసరింపవలెనో వివరింపబడినది.

౭. చారిత్రక గ్రంథములు :— ఇవి మూడువిధములు: (౧) స్వదేశసంస్థానచరిత్రలు; (౨) స్వీయచరిత్ర; (3) ఆంధ్రకవుల చరిత్రలు. వీనిలో నెల్ల ఆంధ్రకవుల చరిత్రము ప్రధానమైనది. వీరేశలింగకవి మూడుభాగములలో క్రీ.శ. ౧౦ వ శతాబ్దినుండి ౧౯వ శతాబ్దాంతమువఱకు గల ౩౩౦ మంది కవుల చరిత్రమును వ్రాసి ప్రకటించినారు. ఈనాడు వీరేశలింగము గ్రంథములలో నిదియే ప్రచురమై సాహిత్యవిమర్శనమున కాధారమై యున్నది. స్వీయచరిత్రవచనరచనమునను వీరేశలింగము మార్గదర్శియే. అంతకుముం దున్న స్వీయచరిత్రలు పద్యాత్మకములు. వీరేశలింగము తన స్వీయచరిత్రను నిష్పక్షపాతముగ రచించి, రెండు సంపుటములుగా నాంధ్రలోకమున కొసగెను.

౮. పత్రికారచన :— వివేకవర్ధనీ పత్రికను స్థాపించి, దానిమూలమున స్త్రీ పునర్వివాహ విషయములను చర్చించుటయే గాక, 'హాస్యసంజీవని' యందు హాస్యరచనల బ్రకటించి, వీరేశలింగము పత్రికాసారస్వతమునకు నవీన వాఙ్మయమున ప్రథమస్థానము నంపాదించినాడు.

౯. శాస్త్రీయ గ్రంథములు:—ప్రాచ్య పాశ్చాత్యశాస్త్రీయ గ్రంథములను సులభ శైలిలో రచించి యా విజ్ఞానము నందజేసిన వ్యక్తి వీరేశలింగము. దీనికొఱకు సాంకేతిక పదజాలముకూడ నాతడు తనకు ముం దున్న

వారినుండి గ్రహించినాడు. ప్రాచ్యవిజ్ఞానమునకు సంబంధించిన తర్కసంగ్రహము, వ్యాకరణసంగ్రహము, అలంకారసంగ్రహము, కావ్యసంగ్రహము మొదలగునవి గాక జ్యోతిశ్శాస్త్రమును రచించెను. జంతుశాస్త్రము, శారీరకశాస్త్రము (Physiology) మున్నగువానిని తెలుగులోనికి దెచ్చెను.

౧౦. ఉపన్యాసములు :— వీరేశలింగము వివిధ విషయములపై నాయా సందర్భములలో చేసిన ఉపన్యాసములన్నియు సులభగ్రాహ్యములై, చదువుట కనుకూలముగ నున్నవి. రాజకీయవిషయములు, దేశీయమహాజనసభ - దాని యుద్దేశములు' సంఘసంస్కరణమహాసభాధ్యక్షోపన్యాసము మున్నగునవి యీ రచనలలో ప్రసిద్ధములు.

పద్యరచన గద్యరచనయంత విశాలమైనది, విశిష్టమైనది కాదు. వీనిలో నాటకములు రెండువిధములు: ౧. సంస్కృత భాషాంతరీకరణములు; ఆంగ్లభాషాంతరీకరణములు. మొదటివానిలో శాకుంతలము' మాళవికాగ్నిమిత్రము, రత్నావళి, ప్రబోధచంద్రోదయము ; రెండవవానిలో వెనీసువర్తకచరిత్రము(Merchant of Venice) గయ్యాళిని సాధుచేయుట (Taming of the Shrew) మొదలగునవి కలవు. మొదటివానిలో శాకుంతలనాటకము నాతరువాత నెందఱాంధ్రీకరించినను వీరేశలింగముగారిదే వ్యాప్తిలో నున్నది.

స్వతంత్రనాటకములలో హరిశ్చంద్ర, ప్రహ్లాదనాటకములు ప్రసిద్ధికెక్కినవి. కావ్యరచనమున అభాగ్యోపాఖ్యానము అందతెఱిగినదియే. ఆకాలమున నీగ్రంథపు వ్యాప్తి విశేషముగా నున్నదనుటకు కొందఱు దీనిని తాటియాకులమీద గూడ వ్రాసికొనుటయే సాక్షి. వీరేశలింగకవిప్రాస్తావికపద్యావళిలో సంఘసంస్కరణ పంచరత్నములు బ్రహ్మసమాజము మున్నగునవి యెన్నదగినవి.

సంఘసంస్కరణమున,వితంతూద్వాహమూలమున వీరేశలింగకవికీర్తి రాష్ట్రేతర ప్రదేశములయందు వ్యాపించినది. తమిళదేశీయులకు జాతీయకవియైన సుబ్రహ్మణ్యభారతి తన రచనలలో "చంద్రికై "అను ఒక నవలయందు వీరేశలింగముగారి పాత్రను అద్భుతముగ చిత్రించియున్నాడు.

సంఘసంస్కరణమున వీరేశలింగకవి గడించిన కీర్తికంటె సారస్వతప్రపంచమున నాతని యశస్సు స్థిరమయినది. ఆత్మవిశ్వాసము, పరిశుద్ధప్రవర్తన, కార్యదీక్ష, అంతశ్శుద్ధి మొదలగు విశిష్టగుణములచే నవీన వాఙ్మయ ప్రపంచమున విలసిల్లిన వీరేశలింగముగారి శతవార్షికోత్సవమున ఈ క్రింది రెండుకార్యములు నిర్వర్తించినచో మనవ్యక్తిత్వమును నిలువబెట్టుకొన్నవారమగుదుము. —౧. వారు ముద్రింపకవిడిచిన అముద్రిత గ్రంథములను ముద్రించుట; ౨. వారు రచించిన కవిచరిత్రమును తిరిగి నవీనచారిత్రక విషయములతో చేర్చి ప్రకటించుట.

ఈ రెండును నేడత్యావశ్యకములై,మనలను సత్వరకార్యాచరణమునకు ప్రోత్సహించుచున్నవి. ఆంధ్రలోకము దీనిని గుర్తించుగాక!

# రాష్ట్రభాష

= శ్రీ గరికిపాటి కృష్ణమూర్తి =

ఇప్పుడు మన దేశములో స్వాతంత్ర్యము అవతరించినది. ఇక ఆసేతుశీతనగము ఇది మన దేశ మని మనము భావింపవలెను. ఇదివఱకుగూడ దేశము మన దేగాని పరరాజ్య ముండుటచే పాలకులు ఇది వారి దేశ మనుకొనిరి. మన మింగ్లీషు నేర్చుకొని పరిపాలకుల ఆ భావమును బలపఱచి యుంటిమి. వారి పరిపాలనముచే ఏకీభూతమైన దేశములో వారు ఇంగ్లీషుభాషను ప్రవేశపెట్టి దేశమును ఒక్కచేతిమీదుగా పరిపాలించుట కనుకూలముగా చేసిరి. ఈరోజువఱకు ఈ దేశములో పరిపాలనమునకు అనుకూలముగా నున్నది ఇంగ్లీషుభాషయే. ఇంగ్లీషు వారు దేశమునుండి తొలగినందునే ఇక ఇంగ్లీషుభాషకూడ వెంటనే తొలగవలె నని కొందఱు దేశభక్తులు తహతహలాడుచున్నారు. మన ద్వేషము ఇంగ్లీషువారి యందు గాదు, ఇంగ్లీషుభాషయందును గాదు—పరరాజ్యమునందే. అది తొలగిన తరువాత, మన దేశమున పరిపాలనమున కే భాష అనుకూలముగా నుండునో దాని నవలంబింపవలె ననుట న్యాయ్యము. శాసనము లన్నియు ఇంగ్లీషులోనే యున్నవి. అవి అర్థము కావలెనన్న మన మింకకొంతకాలము ఇంగ్లీషు నభ్యసింపవలెను. వీని నన్నిటిని ఇప్పుడే తొందరపడి తర్జుమాచేసి విడచిన అవి, ఇవి గూడ అర్థముకాకుండపోవును. ఇంగ్లీషు వచ్చినవారికి తెలుగు రాదు; తెలుగువచ్చిన వారికి ఇంగ్లీషు చదివినవారిని జూచిన అసహ్యము, హిందీవచ్చినవారిని జూచిన గౌరవము. రెండుమూడు భాషలు సమగ్రముగా వచ్చినగాని తర్జుమాపని నెరవేరదు. రాష్ట్రభాష హిందీ కావలెనని ౩౦ సంవత్సరముల నుండి దేశనాయకులు చెప్పుచున్నప్పటికిని ఈరోజువఱకు ఇంగ్లీషు లేకుండ వ్యవహారము నడచుటలేదు. సంయుక్తరాష్ట్రములలో ఈ మధ్య మంత్రులు హిందీలో వ్యవహరింప మొదలిడిరి గాని దానినుండి అర్థము సరిగా వెల్లగిలిరానందున మఱల ఇంగ్లీషునకే నివర్తించిరని పత్రికలు చెప్పినవి. ఇంగ్లీషు భాష బాగుగా రాని మంత్రులే ఇంగ్లీషును విడచి వ్యవహరింపలేకున్నారని అందఱును చూచుచున్న విషయమే. ఇంగ్లీషుభాష యొక్క వ్యవహారయోగ్యత కింతకంటె మంచి ప్రశంస యుండునా?

ఇప్పటి వ్యాపార మొక దేశమునకు సంబంధించినది గాదు. అనేకదేశములతో కూడియున్నది. వ్యాపారమునకు యోగ్యమైనది ఇంగ్లీషు. వ్యాపారమునకు మంచి భాష అక్కఱలేదు, ఏదో పని గడచిన చాలును, దానికొఱకు అందఱు ఇంగ్లీషు నేర్వనక్కఱలేదు అని చెప్పవచ్చును. కాని,

నేటి కాలపు చదువంతయు ఇంగ్లీషువశమై యున్నది. లెక్కలు, సైన్సు, వైద్యము అన్నియు ఇప్పుడు ఇంగ్లీషు చదివినవానికి అధీనములై యున్నవి. ఇవి లేకుండ మనకు గడవదు. ఇవన్నియు మన భాషలలో ఇంకువఱకు మన మున్నతవిద్యను ఇంగ్లీషులో నేర్వవలయును. అంతర్జాతీయమైన భాష ఇంగ్లీషు. ఇదివఱ కా స్థానములో ఫ్రెంచి భాష యున్నదిగాని ఇప్పు డది ఇంగ్లీషునకు తావిచ్చినది. ఇంగ్లీషువారు మన దేశమును పరిపాలించుచున్నప్పుడు పరిపాలనమునకు ఇంగ్లీషు అనుకూలముగా నున్నది. వారు తొలగినతరువాత మనకు వ్యవహరించుట కనుకూలముగా నుండుటచే ఆ భాష మన కొక జ్ఞాననేత్రముగ పరిణమించినది. వెంటనే దీనిని తీసివేసిన మన కన్నును మన చేతితోనే పొడుచుకొనినవార మగుదుము. మనలో మనము ఎన్నిగొప్పలు చెప్పుకొన్నప్పటికిని, మన కెంత దేశభక్తి యున్నప్పటికిని ఇప్పుడు మన దేశభాష లున్న స్థితిలో నవ్యవైజ్ఞానికసారమును మన కర్థమగునట్లు చెప్పగలుగుదు మనుట సాహస మగును. మన భాషల కలవాటులేని పని ఇది. అలవాటుపఱచిన, కొన్ని సంవత్సరములలో తయారుకాగలవు. ఇప్పటి భావములను, సైన్సును మన భాషలలోనికి తెచ్చుకొనుటకు కొన్ని ఇంగ్లీషుమాటలను గ్రహింపవలసియుండును. సంస్కృతమును శరణుజొచ్చి ఒకవిధమైన పారిభాషికపదములను-ఏ ఒక్కరాష్ట్రమువారుగాక సర్వరాష్ట్రప్రతినిధులు సమావిష్టులై భారతదేశమున కంతకును ఒకేవిధమైన పారిభాషికపదములను సమకూర్చిన మన దేశమంతయు ఒకటే నని చెప్పుకొనుట కది కొంత ఉపకరించును. ఇదంతయు తయారగువఱకు ఇంగ్లీషును విడచుట హానికరము.

ఆచంద్రార్కముగా ఇంగ్లీషు మనదేశములో నుండవలె నని ఎవరును చెప్పరు. ప్రస్తుత ముండవలె ననుటకు కారణము భావదాస్యము గాదు. ఇంతకంటె మన మిపుడు చేయగలిగినది లేదుగనుక ఇట్లు చేయవలెను. ఇంగ్లీషును పూర్తిగా వదలించుకొనవలె ననినచో త్వరగా మన భాషలు పరిపూర్ణత చెందునట్లు చేయవలెను. ఈ దేశమంతయు రాజకీయముగా ఒకటేనని తలచుట కిదివఱకు ఇంగ్లీషు కారణమైనది. అనేక సంవత్సరములనుండి హిందీ రాష్ట్రభాష కావలెనని కాంగ్రెసువారు ఆందోళనపడుచున్నారు. ఇప్పటికి రాజ్యాంగవిధానపరిషత్తులో హిందీకి ఆ స్థానము నిచ్చిరి. కాంగ్రెసువారి మనోరథ మీడేరినది. కాని ఈ రోజుననే అది వ్యవహారయోగ్యముగా లేకపోవుటచే ఆనిర్ణయ మింకను అమలులో రాలేదు.

ఈ హిందీ ఎక్కడిది? సంస్కృతమునుండి అపభ్రష్టమైన భాష. ఇది యొక సామాన్యభాషగా బయలుదేఱినది. హిందీ ఉర్దూ అని మఱియొక ఆందోళన. ఉర్దూశబ్దము సంస్కృతభవమని, ఉర్ద్ అనే ధాతువునుండి వచ్చిన దని ఈమధ్య సయ్యద్ మహమ్మద్ గారు చెప్పియున్నారు. 'ఉర్ద్ మానే' అను ధాతు వది. 'ఊర్దతే'—కొలుచుచున్నాడు, లెక్కించుచున్నాడు అని దాని రూపము, అర్థములు. హిందీ, ఉర్దూలు రెండును గూడ సామాన్యభాషలు గావున ఆయన ఊహ

సరిగావచ్చును. ఇప్పు డీ హిందూస్థానీలో మన తెలుగులో ఉన్నంత సాహిత్య మున్నదా? లే దని విజ్ఞులందఱు సెలవిచ్చుచున్నారు. తులసీదాసువంటి మహామహులు లొకరిద్దఱున్నారుగాని, వారి హిందీభాషకు, ఇప్పుడు మాట్లాడు భాషకు సంబంధము లేదు. మన మందఱము కష్టపడి నేర్చుకొనవలసినది సంస్కృతమునుండి భ్రంశము నొందిన ఒక సామాన్యభాష. కష్టపడి నేర్చుకొనుటయే గాదు, ఈరోజున అది సర్వలక్షణలక్షితమై, సర్వవ్యవహారయోగ్యమై సిద్ధముగా లేనందున, ఇంకను కష్టపడి దాని నొక గొప్పభాషగా తయారుచేయవలసిన పని చదువరులపై ఉన్నది. ఇప్పు డీ భాషను దేశములో బహుసంఖ్యాకులు మాట్లాడగలిగియుండుటయే దీనిలో గల విలక్షణమైన గుణము. కాని, హిందీ మాట్లాడు భాగములలోకూడ ఒకే రకమైన భాష ఉన్నదని చెప్ప వీలులేదు. కాశీలోని హిందీకిని, లక్నోలోని హిందీకిని చాల తేడా గలదు. లక్నో భాషలో అరబిక్, పర్షియన్ మాటలు పడి ఫ్, ఖ్-లు ఎక్కువై దగ్గులు, ఖాండ్రింపులతో అది విజాతీయముగా కన్పించును. కాశీఅలహాబాదుల భాష సంస్కృతమునకు సన్నిహితమై మనకు తొందరగా అర్థము కాగలదు. ఇవిగాక ఇంకను అనేకమైన స్థానికభాషలు హిందీలోనే యున్నవి. హిందీ మాట్లాడువారిలోగూడ అందఱకును సమానమైన భాష కావలె ననినచో వారుకూడ కొద్దిగానో గొప్పగానో నేర్చుకొనవలసినది ఉండును. దేశమంతటికిని ఒకే విధమైన భాష ఉండవలయు నని చెప్పినచో అరబిక్, పర్షియను పాలు ఎక్కువగా ఉన్న హిందీ అట్టి స్థానము నెన్నడును పొందదు. సంస్కృతమునకు సన్నిహితమైనదే ఎప్పటికైనను సర్వసాధారణము కాగలదు. ప్రచార మెంత చేసినను దక్షిణ దేశములో హిందూస్థానీకి పట్టు తక్కువ.

ఇంతకుముందు చెప్పినట్లు, రాష్ట్రభాష హిందీ కావలె ననుటకు దానిలో గల అర్హత అధికసంఖ్యాకులు దానిని గాని, దానికి సదృశమైన స్థానికభాషనుగాని మాట్లాడుటయే. దీనికంటె ఇతరమైన అర్హత ఏమియు దానిలో లేదు. రాష్ట్రభాషను దేశములో గలవా రందఱును నేర్వవలెనా? అంతర్జాతీయవ్యవహారములలో ఇంగ్లీషు లేనిదే గడవదు. ఎవరికి? ఆయా వ్యవహారములను చేయువారికి. అట్లే భారతదేశవిషయములలో, అఖిలభారతదేశ విషయములలో కల్పించుకొనువారు రాష్ట్రభాషను నేర్తురు. పల్లెలలో ప్రతిపిల్లవానికి నిర్బంధముగా హిందీనికూడ నేర్పుచువచ్చిన అది ఎందుకు పనికివచ్చును? కొంతకాల మైనతరువాత మఱచిపోవుటకే. పోనీ, దానిలో విజ్ఞానమంతయు కరుడుగట్టి యున్నదందమా, చదువుట కంత ఎక్కువగా దానిలో ఏమియును లేదు. అంతకంటె అతి సమృద్ధమైన బంగాలీ చదువుకొనవచ్చును. హిందీగాని, హిందూస్థానీగాని (ఈరెండును దక్షిణదేశవాసుల కొఱకే) చదివిన మన దేశభాషల కేమైన ఉపకరించునా? హిందీ వలన తెలుగు వృద్ధిలోనికి వచ్చు ననువారు ఇంతవఱకు కన్పించలేదు. మిగిలిన దేశభాషల విషయమై కూడ అంతే. కావున, హిందీ నభ్యసించుటయేగాక, ఆ భాషనొక మహత్తరమైన భాషగా చేయవలసిన ఆవశ్యకత భారతీయులపై నుండును. ఆ భాష సమ

ర్థము కావలెనన్న సంస్కృతమునుండియో, అరబిక్ పర్షియనులనుండియో మాటలను ఎక్కువగా గ్రహింపవలెను.

మన దేశములో అన్నిమూలల నివసించువారిని ఏకముగ చేసినది సమాన సంస్కారములు, సంస్కృతభాష. జాతకర్మములనుండి మృతకర్మములవఱకు అంతయు సంస్కృతమేగదా. ఇది యావద్భారతదేశమునకు సమానముగానే యున్నది. మొన్న గాంధీగారు చనిపోయినపుడు ఢిల్లీ రేడియో నుండి గరుడపురాణము చదువుటయే దీనికి తార్కాణము. నానావిధములైన దేశభాషలను మాట్లాడు మనదేశములో సందఱకు ఏకీభావము కల్పించిన దీ సంస్కృతము. దేశభాషలన్నియు సంస్కృతసూత్రముచే గ్రుచ్చబడియున్నవి. సంస్కృతమును నేర్చిన అది సర్వభాషోపకారకము కాగలదు. ఈమాట మఱియొక భాషను గుఱించి చెప్పుటకు వీలులేదు. తెలుగులో వ్రాయువారు సంస్కృతము నభ్యసించిన మన భాష కెంత మేలు కలుగును! ద్రావిడవాదము నొకటి తెలుగునకు ముడిపెట్టి కొందఱు ఆంధ్రసంస్కృతములకు భాషావైషమ్యము కల్పించిరి. ఈ వాదము నమ్మదగినదిగా లేదు. ఒకప్పుడు, క్రీస్తుపూర్వము ౪౦౦సంవత్సరముల క్రిందట వేదము రచింపబడినదని చెప్పిరి. తరువాత ఇంకను వెనుకడుగు తొక్కి, ౧౦౦౦, ౨౦౦౦, ౩౦౦౦, ౪౦౦౦ సంవత్సరములకు పూర్వమని చెప్పుచువచ్చిరి. ఆ తారీఖును ఇప్పుడింకను వెనుకకు నెట్టుచున్నారు. మొన్న సీమధ్యనే వేదమును రచించిరి (పురుషులా, స్త్రీలా అను ప్రశ్న ఇక్కడనవసరము) అని పరిశోధకులు చెప్పిన రోజులలో తమిళభాష ప్రాచీనతరమని చెప్పుకొనియున్నారు. కాని ఇప్పుడు సంస్కృతమే ప్రాచీనతమమని నవీనపరిశోధకులు ఊహపడుచున్నారు. మన దేశములో గల భాషలన్నియు సంస్కృతముతో సమానమైన అక్షరసమామ్నాయము గలవి; తెలుగులో ఒక అక్షర మెక్కువ యున్నందున, అరవములో నాలుగు తక్కువ ఉన్నందున భేదమేమియు వాటిల్లదు. అన్నియు అక్కడనుండి బయలుదేఱిన వేనని చెప్పవచ్చును. ప్రపంచములోని భాషలన్నియు (గ్రీకులోని అల్ఫాగాని, ఉరుదూ అరబిక్కుల అలీఫ్ గాని) అకారముతో మొదలిడినవే. బ్రహ్మముఖమును చీల్చుకొని మొట్టమొదట అకారము బయలుదేఱిన దని మన పెద్దలు చెప్పుదురు. బ్రహ్మముఖ మెట్లున్నను, సర్వభాషా ముఖమున అకారము గన్పడుచున్నది. మంత్రశాస్త్రములో క్షకార మున్నట్టు గ్రీకుభాషలో 'ప్స' కార మను ఒక సంయుక్తాక్షర మున్నది. సంస్కృత మొకప్పుడు ఇండోచైనా, సయామ్, జావా మొదలైన దేశములలో ఎంత ప్రచారములో నున్నదో ఇప్పటికిని సాక్ష్య మున్నది.

సంస్కృతము మృతభాష యని ఎత్తిపొడుచుట కద్దు. సంస్కృతవ్యాకరణ మీరోజున ఎందఱికో కరతలామలకమై యున్నది. ఉగ్గుపాలను సంస్కృతముతో పెట్టినట్లు కొందఱు ధారాళముగా దానిని మాటాడగలవా రున్నారు. ద్రావిడ రాజేశ్వరశాస్త్రిగారినిగాని, అనంతకృష్ణశాస్త్రి గారినిగాని, దేవనాయకాచారిగారిని గాని విన్నవారికి ఇట్టి సందేహములు కలుగవు. మృతభాష యన మరణానంతరము మృతులు

మాట్లాడుకొను భాషయేమో. ముల్లోకము లందు సంస్కృతము మాట్లాడుదురని పతంజలి చెప్పెను. మృతులు పరలోకమున కేగి, ఇక్కడ నేర్చుకొనకపోయిన అక్కడ నేర్వవలెనేమో. ఇక్కడ నేర్చినవారికి అక్కడ తొందరగా ఉద్యోగము దొఱకునేమో. ఇంటిపట్టున ఎవరును సంస్కృతము భాషింపరుగనుక దానిని మృతభాష యని అనవచ్చునేమోకాని, నిజము చెప్పిన, ఆ భాషకు కొందఱు మృతులు. లాటిన్ భాషకు పట్టిన గతి మన సంస్కృతమునకు పట్టలేదు. ఇది ఒక పెద్ద మఱ్ఱిచెట్టువంటిది. అన్నివైపులను ఊడలు దిగి అసలుచెట్టు కన్పించుటలేదు. మన మెక్కువ క్లేశము లేకుండ దానిని కనుగొనగలము. మనము చేయవలసినది ఆ భాషయందు ద్వేషము లేకుండ బయలుదేరుటయే. దీనియందు అరవదేశములో—అందఱకునుగాదు, కొద్దిమందికి—ద్వేషమున్నట్టున్నది. తెలుగునాడులో ద్వేషించువారు లేరు. ఉత్తరదేశమున సంస్కృతమునందు గౌరవ మెక్కువ. సర్వ దేశభాషలయందును అంతర్వర్తియై, వివిధరాష్ట్రీయుల నానాత్వములో ఏకత్వమును కల్పించుచు సర్వవ్యాపకమైయున్న సంస్కృతము రాష్ట్రభాష కాగూడదా? ఇంతకంటె వ్యవహారయోగ్యమైన భాష మనకు దొరకునా?

"సంస్కృతము ఎన్నడును, ఎవరును మాట్లాడలేదు. ఇప్పుడు తొందర ఏమి" అని కొందఱనవచ్చును. సంస్కృతము నేర్చుట చాల కష్టమని కొందఱు గొణగవచ్చును. ఈ రెండును సత్యముగాదు. ఇప్పటికిని అద్భుతముగ మాట్లాడువారున్నారు. నేర్చుటగూడ కష్టముగాదు. పాణినీయమునంతను చదువుట కష్టమేమోగాని వ్యవహారమునకు కావలసిన భాషాజ్ఞానమును సంపాదించుట చాల తేలిక. భాషనంతను కృత్ప్రత్యయములతో వాడుచున్నచో ధాతువుల ప్రక్రియనే తెలుసుకొనక ఉండవచ్చును. హిందీ భాషకూడ చదువకపోయినచో రాదు. రానివారికి ఏదియును రాదు. అభ్యసించిన వారి కందఱకును ఇంగ్లీషు వచ్చినదా? వచ్చినది అని తలచినవారిలో సరిగా ఎంతమంది వ్రాయగలరు? ఇపు డెంతమందికి ఇంగ్లీషు వచ్చినదో అంతమందికి సంస్కృతము వచ్చిన—ఇపు డించుమించుగా అంతమంది ఉందురు—భారతదేశవ్యవహారము లన్నియు సంస్కృతములో— నడిపించవచ్చును. వింధ్యకు దక్షిణమున ఉన్నవారందఱు హిందీ నేర్చుటకు ఎంత కష్టపడవలెనో అంత కష్టమును సంస్కృతమును నేర్చుటకు పడిన చాలును. మన కేదియైనను కష్టమొకటే. అట్లున్నప్పుడు మనము మంచిదానినే ఎందు కేఱుకొనకూడదు? బెంగాలీవారికి కూడ సంస్కృతమే ఇష్టము. మహారాష్ట్రీలు, గుజరాతీలుగూడ సంస్కృతమును ఆమోదింతురు. ఇన్నాళ్లనుండి హిందీ రాష్ట్రభాష కావలెనని ప్రాకులాడిన కాంగ్రెసు ఇప్పుడెట్లు బల్లత్రిప్పగలదని బాధపడనక్కరలేదు. మంచి నేఱుకొనుటకు ఎప్పుడును వెనుకాడవలసిన పని లేదు. కాంగ్రెసుగవర్నరులలోనే ఒకరు అపుడే సంస్కృతము రాష్ట్రభాషగా నుండవలె నని చెప్పిరి. సంస్కృతము పునరుజ్జీవించుట కలలోని వార్తయని తలపనక్కరలేదు. ఇప్పు డనేకులకు దానిపై గౌరవము మెం డగుచున్నది. ప్రభుత్వసాహాయ్యము కొంచెమున్న అది తప్పక వృద్ధి

లోనికి రాగలదు. హిందీకి చేయుచున్న సాహాయ్యకములో సగము చేసియున్న అది ఈపాటికి ఎంత వృద్ధిలో నుండెడిదో! రాష్ట్రభాషగా సంస్కృతమును ఇప్పుడే పెట్టమని చెప్పుట లేదు. ఈభాష "సర్వభాషోపకారక మగుటచే, సర్వవ్యవహారసాధక మగుటచే రాష్ట్రభాషగా నిర్ణయింపదగినది. దీనికి ప్రభుత్వము దోహద మిచ్చుచువచ్చిన ఒక తరములో అది బాగుగా అందఱినోళ్లలో నలిగి మనకు అభ్యుదయహేతువై ప్రపంచభాషలలో తలమానికముగా వెలుగగలదు.

హిందూమతమునకు, సంస్కృతమునకు అవినాభావసంబంధ మున్నది కాబట్టి ఇదంతయు హిందూమత ప్రచారమని అవకాశముకొఱకు వేచియుండు కుహాభోజనులు కొంద అనవచ్చును. వీరు వస్తుస్థితిని గమనించిన ఇట్లు మాట్లాడరు. సంస్కృతభాష పారలౌకికమేగాదు, ఐహలౌకికముగూడను. మన సాహిత్యమంతయు దానిలో నున్నది. దేశభాషలలో గల గొప్పగ్రంథములన్నియు వానినుండి అనువదింపబడినవే. సంస్కృతము చదివినంతమాత్రమున సద్గతి కలుగునని ఎవరును చెప్పలేదు. సంస్కృతభాష భగవత్కటాక్షమునకు హేతుభూతము కాదని రామకృష్ణపరమహంస చెప్పియున్నాడు.

"సంస్కృతవాచా-గోచరమేవ
బ్రహ్మ న భాషా-భూషణముగ్రమ్;
క్షేమసమానం హ్యస్య దిహ మాతుః
జల్పతి బాలే వాగ్మినిచైవ".

ఇది ఆయన చెప్పిన బోధకు సంస్కృతీకరణము. కావున వ్యవహారమునందు సంస్కృతము సాధువగునా-కాదా, ఇతర భాషలకంటె దీనిలో ఆధిక్యమున్నదా-లేదా అను విషయములను ఆలోచించియే మనము రాష్ట్రభాషగా సంస్కృతమును స్వీకరింపవలెను.



# మృత్యుంజయ విలాసము

## శ్రీ బులుసు వేంకటరమణయ్య

ఆంధ్రవాఙ్మయానికి విశిష్టతను కలిగించిన రచనలలో యక్షగానాలు ముఖ్యంగా పేర్కొనతగ్గవి. ఇవి ప్రాచీనకవితారీతులకు చెందివున్నాయి. దేశిరీతుల్లో వెలువడిన మధురకవితారీతుల్లో ఇవి అగ్రస్థానాన్ని ఆక్రమించాయి.

గేయవిశిష్టాలయిన ఈ కావ్యాలను యక్షులు, లేక జక్కులు, అంటే ఒకరకపు కళావంతులు ప్రదర్శించటంచేత వీటికి ఈ పేరు వచ్చింది. ఈ యక్షగానాల ప్రాశస్త్యాన్ని, ప్రత్యేకతనూ గురించి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'సుగ్రీవవిజయ' పీఠికలో విపులంగా వివరించారు.

లక్షణాలనుబట్టి చూస్తే యక్షగానాల్లో రగడలకు కొన్ని మార్పులు చేసి, త్రిపుట, జంపె మున్నగు తాళాలకు అనుగుణంగా సరిచేసి, రచన సాగించవలసినట్లు కనబడుతుంది. కాని సాధారణంగా యక్షగానాలన్నిట్లోనూ ద్విపదలూ, తేటగీతలూ ధారాళంగా కనబడుతున్నాయి. కొన్నిట్లో సీసములూ, కందములూ, వృత్తాలూకూడా కనబడతాయి.

యక్షగానాలు వందలకొద్దీ ఉన్నా, వాటిలో సమగ్రంగా ఉపలబ్ధాలూ, ప్రశస్తాలూ అయినవి చాలా తక్కువ. ప్రశస్తయక్షగానాల్లో గణనీయమైనదీ, ప్రసిద్ధమైనదీ ఈ 'మృత్యుంజయ విలాసం.'

యక్షగానాలు ప్రజాదరణాన్ని బాగా పొందిన తర్వాత వ్రాయబడడంచేతకాబోలు ఈ 'మృత్యుంజయ విలాసా'నికి యక్షగానాల కుండవలసిన హంగులన్నీ కుదిరాయి. ఇందులో రగడలేకాకుండా ద్విపదలూ, దరువులూ, మార్ణికలూ, సీసములూ, కందాలూ, వృత్తములూ—ఇవన్నీ వాడబడ్డాయి. యక్షగానాల్లో రావలసిన 'ఎఱుకసాని' ఇందులో చాలా చమత్కారంగా ప్రవేశపెట్టబడ్డది; యక్షగానాల్లో సాధారణంగా కనబడుతూవున్న సవతుల పోరూ, బుజ్జగింపులూ యిందులోనూ చమత్కారంగా వున్నాయి.

ఇందులోని కథ పార్వతీపరిణయమే అయినా, ఆయా సందర్భాల్లో శివుడు చూపిన విలాసాలుకూడా కూర్చబడడంవల్ల దీనికి 'మృత్యుంజయవిలాసం' అనే పేరు పెట్టబడింది. గ్రంథంచివర—

"బాలేందుధారియుఁ బార్వతిఁ గూడి
చాల మోదంబున సౌఖ్యంబుఁ గెంద,
నొనర నంతట కుమారోదయ మయ్యె.
ఘనతారకాదిరాక్షసవధ మయ్యె,
సకలలోకమ్ములు సంతోష మందెఁ,
బ్రకటకల్యాణ పారంపర్యముగను."

అని కుమారోదయ, తారకాదిరాక్షసవధలు సూచింపబడ్డాయి.

ఈ యక్షగానంలో ఒక విలక్షణత వుంది; అదే హాస్యరచన. శివుని పరిచారకుడైన భృంగిమాటలూ, చేష్టలూ హాస్యాన్ని బాగా పోషించాయి. హాస్యమంటే బూతుల బుంగ లనే అభిప్రాయాలతో రచనలు సాగించిన అరసికులు సంస్కృతంలోనూ, తెలుగులోనూకూడా కొంద రున్నారు. ఈగ్రంథంలోని రచనమాత్రం అలాంటి అభిప్రాయాలకు చాలా దూరంగానే ఉంది.

వీధిభాగవతాల్లో హాస్యానికి ప్రాముఖ్యం ఉంది. యక్షగానాలు భాగవతాలుగా మారుతున్న కాలంలో వ్రాయడంచేతే కాబోలు, ఇందులో హాస్యం ప్రవేశించినది.

ఈ గేయనాటకం హరికథ అంటూ కవి— 'మృత్యుంజయవిలాసమ్మనుల నాటకము హరి కంకితం బౌట హరికథ యగుట' అని తెలిపినాడు. హరుణ్ణిగురించిన కథ 'హరికథ' కావడం వింతగానే కొందరికి తోచవచ్చు. కాని నేటికాలంలో హరిదాసులు చెప్పే కథలన్నీ (శ్రీహరివిలాసాలకు సంబంధించినవి అయినా, కాకపోయినా) హరికథ లయ్యేటప్పుడు, ఆకాలంలో హరికి అంకితం యివ్వబడ్డ ఈకథ హరికథ కావడంలో ఆక్షేపణ లేదు.

ఈగ్రంథాన్ని రచించిన గోగులపాటి కూర్మనాథకవి గొప్ప విష్ణుభక్తుడు; వైష్ణవుడు; విశాఖపట్నంజిల్లాలో ప్రసిద్ధులైన శ్రీతిరుమల పెద్దింటి వంశీయుల శిష్యుడు. వైష్ణవులు శివుని పరమభాగవతోత్తము డని వర్ణిస్తారు. భగవద్భాగవతులను సమానంగా చూచే వైష్ణవుల దృష్టిలో ఈ 'మృత్యుంజయవిలాసం' హరికథ కాక మ రేమవుతుంది?

దీన్నిబట్టి చూస్తే హరికథాపితామహులూ, అనేకహరిదాసులకు జీవికను కల్పించినవారూ అయిన కీ. శే. శ్రీ అజ్జాడాదిభట్ల నారాయణదాసుగారి హరికథాకాలక్షేపప్రణాళికకు కూర్మనాథకవే పునాది వేశాడని చెప్పవలసివుంది. ఇప్పటి హరికథలన్నీ యీ 'మృత్యుంజయవిలాస' పద్ధతిలోనే వున్న సంగతి అందరూ అంగీకరిస్తారు.

కూర్మనాథకవి వైష్ణవుడయినా, శివాలయాలు కనబడితే దృష్టికి అరచేయి అడ్డుపెట్టుకుని మరీ పోయే వీరవైష్ణవుడు కాడు. కాబట్టే పార్వతీపరిణయకథను యక్షగానంగా రచించడానికి పూనుకొన్నాడు.

పార్వతీపరిణయకథను ప్రత్యేకంగానూ, అనుషంగికంగానూకూడా సంస్కృతాంధ్రాల్లో చాలామంది కవులు రకరకాలుగా రచించారు. అన్నిట్లోకీ మహాకవి కాళిదాసు వ్రాసిన కుమారసంభవమే అగ్రస్థానం వహించింది. తక్కిన రచనల కన్నింటికీ కొంచెంగానో, గొప్పగానో కాళిదాసరచన ఆధారంకూడాను.

అయితేనేం? కూర్మనాథకవియ త్రం ఎక్కడాకూడా కాళిదాసుని అనుసరించినట్లు కనబడదు. హిమవద్వర్ణనలోగాని, పార్వతీవర్ణనలోగాని, తక్కినవాట్లోగాని ఒక కల్పనా కాళిదాసుది తీసుకోలేదు. అలా రాకుండా వర్ణించడ మనేది చాలా అసాధ్యమయిన పనే. కాళిదాసుని వర్ణనలు తీసుకోకుండా, తన కావ్యాన్ని రసవంతంగా చేయలేనా అనే ధీమాతో, పట్టుదలతో కవి యీ గ్రంథాన్ని వ్రాసినట్టు కనబడుతుంది.

"హిమవంతుని భార్య మేనకాదేవి గర్భం ధరించి మైనాకు డనే కుమారునీ, పార్వతి అనే కుమార్తెనీ కంటుంది. పార్వతికి యుక్తవయస్సు వచ్చిన సమయంలో నారదముని వచ్చి యీమె శివునికి అర్ధాంగి అవుతుందని చెప్పి వెళ్ళిపోతాడు. ఆ సంగతి తెలుసుకుని పార్వతి తన మనస్సులోనే మురిసిపోతూ వుంటుంది.

సదాశివుడు తన భార్య అయిన సతీదేవి యోగాగ్ని కల్పించుకుని, భస్మమై, ఈజన్మలో పార్వతిగా పుట్టిం దన్న సంగతి తెలుసుకుని, తపస్సు చేసుకోవడానికంటూ సపరివారంగా ఆ హిమవంతుని వనంలోనే మకాంవేస్తాడు. ఇదే సమయమని హిమవంతుడు తన కుమార్తెను చెలికత్తెలతోకూడా ఆ పరాత్పరుని శుశ్రూషకు నియమిస్తాడు.

అదే సమయంలో తారకాసురునివల్ల బాధలు పడుతున్న దేవతలు బ్రహ్మను శరణు వేడగా, ఆయన పార్వతీపరమేశ్వరులకు కలిగిన కుమారుడే ఆ రాక్షసుని చంపుతాడనీ, వారిద్దరికీ వివాహం జరిగే ఏర్పాటులో వుండాలనీ చెప్పడంచేత శివునికి పార్వతిమీద ప్రేమకలిగించాలంటూ ఇంద్రుడు మన్మథుని కోరుతాడు. మన్మథుడు సరేనంటూ, తన బలగంతో శివుడున్న వనానికి బయలుదేరుతాడు. తపస్సులో వున్న శివుణ్ని ఎదిరించడం మేలు కాదని రతీదేవి మన్మథుని ఎంత బతిమాలినా అతను వినలేదు. దారిలో ఎన్నో దుశ్శకునాలు కలుగుతాయి. మన్మథుడు వెళ్లి ఆ తోటలో అకాలవసంతాన్ని కల్పించి, శివుని మనస్సు చలింపజేయగా శివుడు కేల్కొని, తన చాంచల్యానికి కారణమైన మన్మథునిని భస్మంచేసివేస్తాడు. అప్పుడు రతీదేవి కంటికి కడవెడుగా వాపోయి, సహగమనానికి సిద్ధపడగా శివుని ఆజ్ఞ ననుసరించి రతీదేవితో అశరీర

వాణి 'అమ్మా! నీకు వైధవ్యం లేదు; తొందరపడి సహగమనం చెయ్యబోకు; నీ భర్త జీవించేవుంటాడు; అందరికీ అనంగుడుగా వుంటాడు; నీకు మాత్రం దేహంతోకూడా కనబడుతూవుంటాడు' అని చెప్పగా రతీదేవి విచారాన్ని విడిచిపెడుతుంది. తన కోరిక నెర వేరనందున పార్వతి చాలా విచారంతో వుంటుంది.

మన్మథుడిని భస్మం చేసినందులకు రతీదేవి కోపించి, ఏమి నిందిస్తుందో అని శివుడు తన కైలా సానికి వెంటనే వెళ్లిపోతాడు. అతనికేమో పార్వ తిని వివాహమాడాలనే కోరిక లేకపోలేదు. తొందర పడి మన్మథుడిని మంటకల్పి, పార్వతిని తిరస్కరించి వచ్చినందుకు అతను తన అంతఃపురంలో విచారంతో వుండి ముఖ్యసేవకుడయిన భృంగితో ఆలోచించి తాను, ఎలుకపాని వేషమూ, భృంగి సేవకురాలి వేషమూ వేసు కుని పార్వతివున్న అంతఃపురానికి వెళ్ళి 'నీకు శివుడే భర్త కాగల'డంటూ సోది చెప్పివస్తారు. పార్వతి చాలా సంతోషిస్తుంది. శివుని తపస్సుచేతనేగాని సాధిం చడం అసాధ్యమని తలచి, ఆమె ఘోరతపస్సు ప్రారంభిస్తుంది.

శివుడు ఒక బ్రహ్మచారివేషం వేసుకుని ఆమె దగ్గరికి వచ్చి, తపస్సు చేయడానికి కారణం ఏమిటో అడుగుతాడు. ఆమెఅభిప్రాయాన్ని తెలుసుకుని శివుణ్ణి నిరసించి, తన్ను వివాహంచేసుకోమని కోరు తాడు. పార్వతికి కోపం వచ్చి, బ్రహ్మచారిని అక్కడి నుంచి తరిమివెయ్యమని చెప్పగా, ఆమెచెలికత్తెలు బ్రహ్మచారినీ, అతని శిష్యుని వేషంతో వచ్చిన భృంగినీ అల్లరిపెడతారు. శివుడు స్వరూపాన్ని చూపగా, పార్వతి సిగ్గుపడిపోతుంది.

పరమేశ్వరుడు అరుంధతితోకూడా సప్తర్షులను పెళ్ళిమాటలకోసం హిమవంతుడి వద్దకు పంపిస్తాడు. మునులు వివాహముహూర్తాన్నికూడా నిశ్చయపరుచు కుని వచ్చి, ఆ వర్తమానాన్ని శివునికి తెలియజేసి, అతని ఆజ్ఞ మేరకు బ్రహ్మాదులను వివాహానికి ఆహ్వానించు తారు. నారాయణుడు మొదట తానొక్కడే వివాహా నికి వెళ్తానని చెప్పగా, శ్రీ భూనీళలు ముగ్గురూ అలుగు తారు. ఆయన వాళ్ళ అలకలు తీర్చి, వాళ్ళతోకూడా వివాహానికి వస్తాడు. తర్వాత వివాహం జరుగుతుంది. శివుడు పార్వతిని తోడ్కొని కైలాసపర్వతానికి వస్తాడు.

శివుడు గంగాదేవినికూడా ప్రేమిస్తున్నాడనీ, ఆమె అతని నెత్తిన ఎక్కికూర్చున్నదనీ చెలికత్తెలు తెలుపగా, పార్వతి అలకవహిస్తుంది. శివుడు ఆమె పాదాలకు నమస్కరించి, కాలితాపు తినిన్నీ, బతిమాలి ఆమెఅలకను పోగొట్టి, గంగా పార్వతుల కిద్దరికీ సఖ్యం కుదురుస్తాడు.

'ఉవిదలో, మన యిద్దర మొక్కటైతిమే, వేడ్క
శివునితో గేలిసలుపుచు మెలగుచుందామె'

అని వాళ్లిద్దరూ అప్పచెల్లెళ్లలా నుంటారు. తర్వాత పార్వతి గర్భం ధరింపగా, కుమారస్వామి పుట్టి తారకాసురుడిని వధిస్తాడు."

ఇదీ యిందలి కథ. కథ అందరికీ పరిచితమే గాని ఆయా సన్నివేశాలుమాత్రం యిందులో గమనింపదగ్గవి. అందులో ఈకవి కాళిదాసుని కథాప్రణాళికను మెరుగుపెట్టాడనే చెప్పాలి.

(౧) శివుడు తన భార్య సతీదేవి యోగాగ్నిలో పడి దేహం చాలించాక వైరాగ్యంతో తపస్సు చెయ్య సాగాడు. తపస్సుచేసుకోడానికి అతనికి మరెక్కడా చోటులేదా? హిమవంతానికే యెందుకు రావాలి? అని ప్రశ్నించుకుంటే, కుమారసంభవంలో గాని, దాని ననుసరించి వ్రాయబడ్డ శ్రీనాథుని హరవిలాసంలో గాని తగిన సమాధానం కనబడదు. మృత్యుంజయ విలా సంలో అలా కాదు. శివుడు సతీదేవి పార్వతిగా పుట్టిన సంగతి తెలుసుకునే అక్కడికి వచ్చాడంటూ—

'.........దక్షకుమారి
సెడబాసినది మొదలెచటను జిత్త
మిడక యా గుణవతి హిమవంతునింట
జనియించు టెఱిగి...'

అని చెప్పబడింది. ఇలా చెప్పడం ఎంతో ఉచి తంగా ఉంది.

(౨) మన్మథుడు శివుని కంటిమంటకు ఆహుతి కాగా అతని భార్య రతీదేవి విచారించి, సహగమనానికి సిద్ధపడుతుంది. అప్పుడు ఆకాశవాణి సహగమనం చెయ్యవద్దనిన్నీ, శివుడు పార్వతీదేవిని వివాహమాడేక మళ్ళీ మన్మథుడు బతుకుతాడనీ కుమారసంభవంలో వుంది. ఇందులో అలా లేదు. మన్మథుడు మరణించడం లేదనీ, అతను అందరికీ అనంగుడుగా ఉన్నా రతీదేవికిమాత్రం సశరీరంగా కనబడుతూఉంటాడనీ, అంచేత అనుగమనం కూడదనీ శివుని ప్రేరణ చేతనే ఆకాశవాణి చెప్పినట్లు ఈ మృత్యుంజయవిలాసంలో వుంది. ఈ మార్పు చాలా హృద్యంగా ఉన్నది.

(౩) పార్వతీదేవి శివునిగురించి ఘోరతపస్సు చెయ్యగా, శివుడు బ్రహ్మచారిగా వచ్చి, ఆమెను పరీక్షించి ఆమెకోరికను నెరవేర్చినట్లు కుమారసంభవాదుల్లో వుంది. దీన్నిబట్టి చూస్తే పార్వతికోరికను నెరవేర్చడానికే శివుడామెను వివాహమాడెననీ, అతనికిమాత్రం ఆమెమీద ప్రేమ లేదనీ అర్థంచేసుకోవడానికి అవకాశం వుంది. మృత్యుంజయ విలాసంలో మాత్రం శివుడు మన్మథదహనానంతరం పశ్చాత్తాపపడి, పార్వతిమీది వ్యామోహాన్ని విడవలేక ఎరుకసాని వేషంతో ఆమెను చూసి, సోది చెప్పి, తప్పకుండా శివుడామెను చేపట్టితీరుతాడని ధైర్యం చెప్పుతుంది. ఆమాత్రపు ఆశ అయినా లేకపోతే పార్వతి తన కోరిక నెరవేరడంకోసం తపస్సు చెయ్యడంకూడా సార్థకం కాకపోవచ్చుగదా!

మీది సన్నివేశాన్నిబట్టి పార్వతికి పరమేశ్వరునిమీదే కాకుండా, పరమేశ్వరునికిన్నీ పార్వతిమీద గాఢానురాగం వున్నదని తెలుస్తున్నది.

ఈ యక్షగానంలో హాస్యం వున్నా, అది చాలా అనుకూలంగా వర్ణితమై వున్నది. ఏమీ అసభ్యంగా లేదు. ఈ హాస్యం భృంగివల్ల బాగా పోషింపబడినది. పార్వతి మొట్టమొదట శివునికి శుశ్రూష చేయడానికి వచ్చినప్పుడు భృంగి శివునికి ఎవ్వరూ శుశ్రూష చెయ్యనక్కర్లేదంటూ హాస్యంగా శివుని సమాచారాన్ని వివరిస్తాడు.

చెలికత్తెలు పూలమొక్కలకూ, వాటికీ దోహదం చెయ్యాలని మాట్లాడుతూవుండగా భృంగి హాస్యంగా—

'అల్లిబిల్లిగ నల్లు మల్లె లేలె
తెల్లజిల్లేడుచెట్లు వేయరె తల్లులార!
ముమ్మరముగ గ్రమ్ము జాజిమొక్క లేలె
మంచి యుమ్మెత్తలు వేయరె రామయమ్మలార!
ఎక్కడలేని సంపెంగ లిక్కడేలె?
తుమ్మిమొక్కలు నాటరే రామయక్కలార!'
అని పాడుతూ గంతులు వేస్తాడు.

పార్వతీదేవిఆజ్ఞ ననుసరించి, ఆమెచెలికత్తెలు వటువేషంలో వున్న శివుని గెంటివెయ్య సిద్ధపడినప్పుడు, బ్రహ్మచారిశిష్యుడుగా వచ్చిన యీభృంగి శివునితో—

'ఏమిసేతు దిక్కెవ్వారు నీ కింక నయ్యవారు;
ఇదిగో కామిని ధూతాలగతి వెంటబట్టిరయ్యవారు.
ఎందేల నరుగక ఇందేల వచ్చితి రయ్యవారు?
వచ్చి పొందుగ నుండక పోకిళ్ళబోసేల నయ్యవారు'

ఈమొదలుగా ప్రసంగించడం చాలా నవ్వును కలిగించకమానదు.

పార్వతిచెలికత్తెలు వటురూపంతో వచ్చిన పరమశివుని అల్లరిపెట్టినవిధము—

'కటిసూత్ర మేపాటి గట్టి బాపడ యని
దెబ్బవ మొలత్రాడు తెంచె నొకతె,
యంటె మాచెలి; కానమాడు మంచు ఘటంబు
వంచి నీ త్తలఁ ద్రిమ్మరించె నొకతె,
ఎవగావు; పెండ్లికి నెడిగింతు వని పిల్ల
శిఖ లాగి మిన్నందకేసె నొకతె,
పులిభయం బిచట బోపొమ్మని హుమ్మని
పులితోలు పై వైచి పొదవె నొకతె'

ఆసేభాగంలో చాలా హృద్యంగానూ, హాసం కలిగేటట్లునూ వర్ణించబడింది.

భృంగి రకరకాల వేషాలతో చేసిన చేష్టలూ, ఆడిన మాటలూ అందరినీ కడుపుబ్బ నవ్వింపకేస్తాయి! వాటినన్నింటినీ వేర్వేరుగా చూపడం అనవసరం.

కూర్మనాథకవి కొన్నిచోట్ల ప్రాచీనకవులను అనుకరించకపోలేదు. బ్రహ్మచారివేషంతో వచ్చిన శివుడు పార్వతియెదుట శివుని నిందించి, తన్నే వివాహమాడాలని ఆమెను కోరినట్లు శ్రీనాథుడు హరవిలాసంలో వర్ణించగా, ఇతడూ ఆ పద్ధతినే గ్రహించాడు.

ముక్కు తిమ్మన్నగారి 'జలజాతాసనవాసవాది సురపూజాభాజనంబై—' అనే పద్యాన్ని సత్యభామ శ్రీకృష్ణుని తలను ఎడమకాలితో తన్నినప్పుడు చెప్పిన దాన్ని అనుసరించి, శివునికికూడా పార్వతీకోప ప్రశమనంకోసం ఆ గతిని పట్టిస్తూ—

'హీరమంజీరసితకాంతు లెల్ల దిశల
నలర నెలతాల్పుశిర మంతఁ దొలఁగఁద్రోచె
వామపాదంబుచే గౌరి; కాముకులను
కోర్కె దగఁ బాల వానలు గురిసె ననఁగ'

అని వర్ణించాడు.

కూర్మనాథకవికవిత్వం చాలా మధురంగా ద్రాక్షాపాకంలో పడివుంటుంది. పెద్ద పెద్ద సమాసాలు వాడినచోటకూడా అర్థస్ఫూర్తి అవలీలగా కలిగే పదాలనే అతను వాడతాడు. స్వతంత్రించి కొన్ని ప్రయోగాలు చేసినా, అవి రసానుభూతికి ఎంతమాత్రమూ అడ్డురాగలవు.

ఇతని పోలికలన్నీ కొత్తకొత్త రీతులు తొక్కుతాయి. కాళిదాసునుకూడా కాదంటూ సొంత పుంతను త్రొక్కినాడని యిదివరకే మనవిచేశాను. ఈ చంద్రోదయవర్ణనాన్ని గమనించండి—

'ఉదయాద్రికరిమీద హురుమంజిచాదోలు
వెడవింటి పాదుషా వెల్లగొడుగు,
తమిఁ జకోరములు పాల్ ద్రావు వజ్రపుగిన్నె
నిశి మీద జల్లు పన్నీటిపుప్పె,
గగన మరా పందిరిఁ గట్టు ముత్యాల గుత్తి
విష్ణుపదంబు చెన్నేలి నఖము
తెలిగంటిగమి బువ్వ దిను వెండిపళ్లెంబు
గగనసౌధాగ్రాబ్జకాంతి కలశ
కాలసుధ భూరుహముపండు గగనలక్ష్మి
చేతిపూచెండు; పాంథగర్వాతిశయము
శృంగకంతుండు వేయు ఫిరంగిగుండు
సుందరాకృతిఁ దగె నిండు చందురుండు.'

ఇది మచ్చుముక్క. ఇలాంటి వర్ణనలు ఎన్నయినా వున్నా యిందులో.

ఇక ముద్రణాన్ని గురించి కొంచెం మనవిచేసి, యీ వ్యాసాన్ని ముగిస్తా.

దీనిని చాలాకాలం కిందట—అచ్చుసౌకర్యాలు బాగా లేనప్పుడు—పలచని చిత్తు కాగితాలమీద ముద్రించారు. దీన్ని చక్కగా మళ్ళీ ముద్రించిన ఆంధ్రవిజ్ఞానసమితివారి (విజయనగరం) ప్రయత్నం ప్రశంసనీయము.

తమకు దొరికిన ప్రతులు తప్పుల తప్పులయినా, సామాన్యంగా కనబడే తప్పులనయినా దిద్ది, సవరించి ప్రచురించడం ప్రకాశకులధర్మం. కాని యీ విషయంలో వారు తగిన శ్రద్ధ తీసుకున్నట్లు కనబడడం లేదు. ప్రతిపేజీలోనూ ఒకటికి తక్కువకాకుండా తప్పు లున్నాయి. కొన్నిమాత్రం యిందులో చూపబడతాయి.

పుట ౧౧. ద్విపదలోని చివరి పాదం—

'ఒక వింతసొగసులతోఁ దేజరిల్లె'

అని అచ్చుపడినది. ఇక్కడ యతి పోయింది. 'ఒక' అనివుండడం చేత 'సొగసులు' అనే బహువచనం సరిపడదు. ఇక్కడ 'ఒక వింతసొగసుతో నొగిఁ దేజరిల్లె' అనేమాదిరి వుండాలి.

పుట ౧౪. సీసపద్యం తొలిచరణము—

'బొమలింటఁ దొడగిన పూజిల్క దొరముల్కి
పోల్కిఁ గస్తురిసొగసు బొట్టు దిద్ది'

అని అచ్చువేయబడివుంది. ఇందులో అక్షర దోషాలతోపాటు ముఖ్యంగా ఛందస్సే లోపించింది. దీన్ని—

'బొమలింటఁ దొడిగిన పూచిల్కదొరముల్కి
పోల్కిఁ గస్తురి సోగబొట్టు దిద్ది'

అని దిద్దవలసివుంది.

పుట ౧౭ లోని ఒక ద్విపద—

'పజ్జల నలరార పాదులనిండ
బొజ్జంగి బూబొదలు మరియు నుప్పొంగు'

అని వున్నది. ఇందులో ఛందోయతులు పోవ
డమే కాకుండా, అర్థంకూడా కావటం లేదు.
ఇక్కడ—

'పజ్జల నలరారఁ బాదులనిండ
గొజ్జంగిపూఁబొదల్ గురియ నుప్పొంగు'

అని వుండాలి. తర్వాతి ద్విపదలోని 'పన్నీటి తెలినీటి పదనున—' అనే దానిలో మీదిదానికి సమన్వయం వుంది.

పుట ౨౧లో నున్న 'అనుపమ సేవ్యరై అది మా రౌాష' అన్నది తప్పు. అక్కడ 'అనుపమ సేవ్యరై యా యమునారౌష' అని వుండాలి. లేకపోతే అర్థమూ వుండదు; ఛందస్సూ పోతుంది.

౩౮ వ పుటలోని సీసపద్యప్రథమపాదం—
'వలువంతదొలగించ వలదను వనితకే
శ్వేడిపించి బొత్తిగా వదలఁజేసి'
అని అచ్చులో వుంది. ఇక్కడ యతిపోయింది.
'వలువంత దొలగించవల దను వనితకే
శ్వేడిపించి బొత్తిగా సడలఁజేసి'
అని యిక్కడ వుండాలి.

౮౨ వ పుటలో తప్పుగా 'పికశుకావళులు వికావికలై పలుచి' అని ఒక ద్విపదపాదంవుంది. అది 'పికశుకావళి పికాపికలయి పలుచి' అని వుండాలి.

అలాగే ౮౬ వ పేజీలో ఉన్న—
'శివిశేషునిగూర్చి జెలగుచు నుండె' అన్నదిన్నీ తప్పే. అక్కడ 'శివిశేషునిఁగూడి చెలఁగుచునుండె' అని వుండాలి.

౫౮, ౫౯ పుటల్లో రెండుపంక్తులలో—
'బ్రహ్మాండనాయక భక్తరక్షకుఁడ;
సిమ్హాద్రిరరప్ప శ్రీకూర్మనాథ!'

అని చాలా తప్పులతో అచ్చుపడింది.
'బ్రహ్మాండనాయక! భక్తరక్షకుఁడ!
సిహ్మాద్రిరప్పన్న శ్రీ కూర్మనాథ!'
అనే అక్కడ ఉండవలసిన పాఠం.

౯౫-వ పుటలో వున్న 'జిహ్వకభూషాద్రిసీమకుఁ జనిరి' అనేదానికి బదులుగా 'జిహ్మగభూషాద్రిసీమకుఁ జనిరి' అని వుండాలి. జిహ్మగభూషుడంటే శివుడని అర్థం.

౧౦౩-వ పేజీలోని సీసపద్యం ౨-వ పాదం
'మకరకుండలవిభామండితనిజగండ
తటముతో సౌవర్ణ పటముతోడ'
అని తప్పుగా పడింది. దానికిబదులు—
'మకరకుండలవిభామండితనిజగండ
పటలితో సౌవర్ణ పటముతోడ'
అని వుండాలి.

౧౩౪-వ పుట మొదటిపంక్తిలో 'చెలిఁ గఱఁగింతాలఁ గఱఁగి' అనుటకు బదులుగా 'చెలిఁ గఱఁగించి, తాఁగఱఁగి' అని వుండాలి.

౧౮౮-వ పుటలో వున్న 'మంతనంబున మరి వార్త లడుగ—' అనడానికి బదులు 'మంతనంబున నుండి మఱి వార్త లడుగ' అని వుండాలి.

౧౫౦-వ పుటలో చాలా తప్పుగా 'ఘనతారకాలి రాక్షసపథమరెయ్యో' అని వుంది. 'ఘనతారకాది రాక్షసవధ మరెయ్యో' అని వుండాలి.

ఇలాంటి అచ్చుతప్పులు లెక్కకు మిక్కిలిగా వున్నా, కొంత వాఙ్మయపరిచయం గలవారు దిద్దుకుని చదువుకోవటానికి వీలుంది. తప్పుల సంగతి యెలా వున్నా ఈ ఉత్తమయక్షగానాన్ని ఆంధ్రలోకానికి సమర్పించినందుకు సమితివారికి ధన్యవాదాలు అర్పించవలసేవుంది.

---

# ఋగ్వేదభాష్యభూమిక

•

శ్రీ వంగల వేంకటరామశాస్త్రి

వేదము స్వతః ప్రమాణము. వేదాంతర్గతములైన మంత్రవిధ్యర్థవాదభాగములు ప్రమాణములు కావ నుట కుపపత్తి లేదు. ఆ యవాంతరభాగము లన్నియు కర్మబోధకములై యున్నందున వేదమున కంతకు ప్రామాణ్యము సిద్ధాంతము.

పూ : వేదము పౌరుషేయము. అది విప్రలంభక వాక్యమువంటిది. వేదమున కేకవాక్యత లేదు. ఒకవేళ ఏకవాక్యత కుదిరినను అది ప్రమాణము కాజాలదు. జైమినియు ప్రథమపాదమున వేదమునకు పౌరుషేయత్వమును సూత్రించినాడు.

సూ : "వేదాంశ్చైకే సన్నికర్షం పురుషాఖ్యాః" (౧-౧-౨౭)

కొంతమంది వేదములకు పురుష సంబంధమును చెప్పినారు. ఈ సూత్రమున చకారము కాళిదాసాది మహాకవిరచితములైన రఘువంశాదులకు సముచ్చయము. ఆ కావ్యము లిచ్చట దృష్టాంతములుగ సముచ్చితము లైనవి. రఘువంశాదికావ్యములవలె వేదములును ఇదానీంతనములు కాని అనాదులు కావు. వేదశాఖమున వినవచ్చు మహాపురుష నామములే ఇందుకు ప్రమాణము. 'వైయాసికీయం భారతం', 'వాల్మీకీయం రామాయణం' అన్నట్లు 'కాఠకం', 'కౌథుమం', 'తైత్తిరీయం' మొదలైన శబ్దము లాయా శాఖలకు కఠాదులు కర్తలని జ్ఞాపకము లగుచున్నవి. కనుక వేదములు పౌరుషేయములు.

ప్రశ్న—వేదములు నిత్యములు. కఠాదు లుపాధ్యాయులవలె నాయా వేదసంప్రదాయములకు ప్రవర్తకులుగాన నాయా భాగములకు కాఠకాదిసంజ్ఞలు కలిగిన వనుటలో విప్రతిపత్తి లేదుకదా!

ఉత్తరము—'అనిత్యదర్శనాచ్చ' (౧-౧-౨౮) అని జైమిని. "బబరః ప్రావాహణి రకామయత", "కుసురుబింద ఔద్దాలకి రకామయత" అని వేదమున బబరాదులు వినబడుచున్నారు. వీ రనిత్యులు; జనన మరణోపేతులు. దీనివలన బబరాదులకన్న పూర్వము వేదము లేనట్లు జ్ఞాపితమైనది. అందుచేత వేదము లనిత్యములు. సూత్రమందున్న చకారము లౌకికవాక్యములవలె వేదవాక్యమందును వాక్యసామాన్యధర్మ ముండుటచే నదియు పౌరుషేయమే అని అనుమానసముచ్చయమును బోధించుచున్నది. కావున వేదము పౌరుషేయము కాదు అని పూర్వపక్షమును శంకించుకొని, దీనికి సిద్ధాంతముగా జైమిని "ఉక్తంతు శబ్దపూర్వత్వం" (౧-౧-౨౯) అని సూత్రించినాడు. ఇందున్న తుశబ్దము వేదములు పౌరుషేయము లనుటను వారించుచున్నది. వేదరూపమైన శబ్దము కఠాదిపురుషులకన్న పూర్వముండు న్నదనియు, అది యనాదియనియు ఇంతకు పూర్వము సూత్రముచే సిద్ధాంతము చేసియున్నవి. "ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధః (౧-౧-౫) అను సూత్రమునందు ఔత్పత్తికశబ్దముచేత సమస్తశబ్దములకు వేదములకు వాని యర్థములకు ఆ యుభయసంబంధములకును నిత్యత్వమును ప్రతిజ్ఞ చేసి తరువాతివైన శబ్దాధికరణవాక్యాధికరణములచేతః దాని నుపపాదన చేసినాడు.

ప్రశ్న : అట్లైనచో కాఠకాదిసంజ్ఞలకు గతి యేమి ?

ఉత్త—సూ. "ఆఖ్యా ప్రవచనాత్" (౧-౧-౩౦) ప్రవచనమువలన సంజ్ఞ కలుగుచున్నది. కఠాదులు సంప్రదాయప్రవర్తకులైయున్నందున ఆయాభాగముల కాయాసంజ్ఞ లుపపన్నములైనవి.

ప్రశ్న—కఠాదులకన్న వేరై కానవచ్చు నీ బబరాదు లెవ్వరివారు ?

ఉ త్త—సూ. "పరంతు శ్రుతిసామాన్యమాత్రం" (౧-౧-౩౧) బబరాదిసంజ్ఞలు శబ్దసామాన్యమాత్రములు. బబరుడను పేరుగల మానవు డెవ్వడును ఇట వివక్షితుడు కాడు. బబరధ్వనితో గూడిన, ప్రవహణశీలమైన వాయువును చెప్పుటకుమాత్రమే ఇచట నీశబ్దము ప్రసక్తమైనది.

ప్రశ్న—వేదమున్న కొన్నిచోట్ల "వనస్పతయః సత్రమాసత", "సర్పాః సత్ర మాసత" అని కలదు. ఇచట వనస్పతు లచేతనములు. సర్పములు సచేతనములైనను జ్ఞానశూన్యములైనవి. కావున నీ యుభయమునకు సత్రానుష్ఠాన మసంభవము. ఈ కారణము చేత వేదము "జరద్గవో గాయతి మద్రకాణి" అనెడి యున్మత్తబాల ప్రలాపమువలె పౌరుషేయమని యొప్పుకొనవలయును కదా!

ఉ త్త—సూ. "కృతే చావినియోగః స్యాత్ కర్మణః సమత్వాత్" (౧-౧-౩౨). జ్యోతిష్టోమాది వాక్య మొక పురుష నిర్మిత మైనచో జ్యోతిష్టోమము స్వర్గఫలజనకము కాకపోవలసి వచ్చును. ఈ సాధ్యసాధనభావము పురుషబుద్ధి కజ్ఞాతచరము. "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అని తద్వినియోగవిధి శ్రుతమగుచున్నది. ఈ విధియును లౌకికవిధివాక్యమువలె సాధ్యము, సాధనము, విధానము అను నంశత్రయోపేతమైన భావనకు జ్ఞాపకమై యున్నది. అందువలన వేదవచన మున్మత్తప్రలాపసదృశము కానేరదు. లోకములో బ్రాహ్మణులను భుజింపజేయవలయు నను విధియందు "ఎందులకు? దేనిచేత? ఎట్లు?" అని యాకాంక్ష కలుగగా, "తృప్తి నుద్దేశించి; అన్నము చేత; సూపశాకాదివ్యంజనములతో సహా" అని చెప్పినట్లే జ్యోతిష్టోమవిధియందుగూడ "స్వర్గము నుద్దేశించి; సోమ మను ద్రవ్యము చేత; దీక్షణీయాద్యంగములతో గూడుకొనునట్లుగా" అని సమాధానము సమన్వితమగుచున్నది. ఇక నున్మత్తప్రలాపసదృశ మెట్లగును? వనస్పత్యాదిసత్రవాక్యముకూడ తత్తుల్యము కాదు. ఈ సత్రకర్మ జ్యోతిష్టోమాదులతో సమానమైనది. "యత్పరో హి శబ్దః స శబ్దార్థః" శబ్ద మెద్దాని నుద్దేశించి పలుకబడుచున్నదో అది యాశబ్దమున కర్థము అని న్యాయమతము. జ్యోతిష్టోమాదివాక్యము విధాయకవచనము. దాని కనుష్ఠానమునందే తాత్పర్యము. వనస్పత్యాదిసత్రవాక్య మర్థవాద. దానికి ప్రశంసయందు తాత్పర్యము. అచేతనములు, విద్యాశూన్యములు నగు వనస్పతులు, సర్పములు సత్రము ననుష్ఠించుచున్న వనిన సచేతనములు, విద్వాంసులు నగు బ్రాహ్మణు లనుష్ఠించుచున్నారని వేర చెప్పవలయునా అని కైముతిక న్యాయముచే సత్రయాగస్తుతి యిచట ప్రసక్తమైనది.

సూత్రములో నున్న చకారము పూర్వపక్షమున చూపిన వాక్యత్వహేతువునకు నిరాసము సముచ్చయము చేయుచున్నది. వేదము యత్కర్తృకమైనది వివక్షితమగుట లేదు. సర్వథా వేదమునకు పౌరుషేయత్వము లేదు. ఈ సిద్ధాంతమును క్రింది సంగ్రహ శ్లోకములు బలపరచుచున్నవి.

"పౌరుషేయం నవా వేద
వాక్యం? స్యా త్పౌరుషేయతా
కాఠకాదిసమాఖ్యానా,
ద్వాక్యత్వా చ్చాన్యవాక్యవత్;
సమాఖ్యానం ప్రవచనా,
ద్వాక్యత్వంతు పరాహతం
తత్కర్త్ర నుపలంభేన;
స్యా త్తతో ఽ పౌరుషేయతా."

వేదవాక్యము పౌరుషేయమా? లేక యపౌరుషేయమా? అనునది విషయము. కాఠకాదిసంజ్ఞలు కలదై యున్నందునను, ఇతరవాక్యములవలె వాక్యసామాన్యధర్మముకలదగుటవలనను వేదము పౌరుషేయము (పూర్వపక్షము). కఠాదు లధ్యయనసంప్రదాయ ప్రవర్తకులైనందున వేదమున కా సంజ్ఞ లుపపన్నములే; కాని తత్కర్త యొచటను అనుపలభ్యుడైనందున వేదమున కపౌరుషేయత్వము (సిద్ధాంతము).

ప్రశ్న—భగవానుడు బాదరాయణుడు వేదము బ్రహ్మకార్య మని శాస్త్రయోనిత్వసూత్రమున చెప్పియున్నాడు కదా?

ఉ త్త—నిజమే! ఋగ్వేదాదిశాస్త్రములకు మూలభూతు డగుటవలన బ్రహ్మ సర్వజ్ఞుడని పైసూత్రమున కర్థము. ఇంతమాత్రముచే వేదమునకు పౌరుషేయత

సిద్ధించదు. అది పురుషనిర్మితమును కాదు. ఈ యపౌరుషేయత్వము నుద్దేశించియే బాదరాయణుడు దేవతాధికరణమున "అత ఏవ నిత్యత్వం" అని వ్యవహార దశయం దాకాశాదులకువలె వేదమునకు నిత్యత్వమును సూత్రించినాడు. ఈయర్థమును బలపరచు శ్రుతి స్మృతులును కలవు:

"వాచా విరూపనిత్యయా" (ఋగ్వేదము ౮-౭౫-౬)

"అనాదినిధనా నిత్యా
వాగుత్సృష్టా స్వయంభువా
ఆదౌ వేదమయీ విద్యా
యతః సర్వాః ప్రవృత్తయః" (శంకరభాష్యే)

ఆకారణముచేత కర్తృదోషాత్మకశంక కలుగుటకే యవకాశములేదు. ఏతావతా మంత్రబ్రాహ్మణాత్మకమైన వేదమునకు నిర్వివాదమైన స్వతఃప్రామాణ్యము రాద్ధాంతమైనది.

వేదము మంత్రబ్రాహ్మణాత్మక మను సిద్ధాంతము మంత్రబ్రాహ్మణములకు లక్షణము కుదిరినగాని నిలువదు. ఆ కారణముచే మంత్రబ్రాహ్మణముల స్వరూపమును తెలిసికొనుట మన కవసరము. జైమిని న్యాయమాలలో ద్వితీయాధ్యాయ ప్రథమపాదమున సప్తమాష్టమాధికరణములయందు మంత్రబ్రాహ్మణవిభాగము చేసినాడు. దానిని మన మిట వివరించినచో మన కా స్వరూపసిద్ధి కాగలదు.

"అహే బుధ్నియ మంత్రం మ ఇతిమంత్రస్యలక్షణం
నాస్త్యస్తివాస్యనాస్త్యేతదవ్యాప్త్యాదేరవారణాత్
యాజ్ఞికానాం సమాఖ్యానం లక్షణం దోషవర్జితం
తేఽనుష్ఠానస్మారకాదౌ మంత్రశబ్దం ప్రయుంజతే."

ఈ శ్లోకములలో నొకటి పూర్వపక్షము. రెండవది సిద్ధాంతము. "అహేబుధ్నియ మంత్రం మే గోపాయ" అను మంత్రము (తైత్తిరీయబ్రాహ్మణము) ఆధానమున గలదు. ఈ మంత్రమం దతివ్యాప్త్యవ్యాప్తులకు ప్రసక్తి యున్నది. అదికారణముగ నిట మంత్రలక్షణము లేదు. 'విహితమైన యర్థమును చెప్పునది మంత్రము' అని లక్షణము చెప్పుకొందమన్న నది 'వసంతాయ కపింజలా నాలభతే'అను విధిరూపమైన మంత్రమునం దవ్యాప్తము. 'మనన హేతువు మంత్రము' అని లక్షణపరిష్కారము చేసికొన్నచో, ఈ లక్షణమునకు బ్రాహ్మణమున నతివ్యాప్తి. 'అసిపదాంతము మంత్ర'మనిగాని, 'ఉత్తమపురుషాంతము మంత్ర'మని గాని లక్షణము కుదుర్చుకొందమన్న నీ యుభయమునకు పరస్పరవ్యాప్తి కలుగుచున్నది. ఇట్లెన్నివిధముల జూచినను మంత్రమునకు లక్షణము కుదురుట లేదు కదా ! అనెడి పూర్వపక్షమునకు సమాధానము రెండవ శ్లోకము.

మంత్రమునకు యాజ్ఞికసమాఖ్యానము (యాజ్ఞికులిది మంత్ర మని నిర్దేశించుట) నిర్దుష్టమైన లక్షణము. ఈ సమాఖ్యనచే అనుష్ఠానస్మారకాది వచనములకు మంత్రత్వబోధక మైనది.

"ఉరు ప్రథస్వ" ఇత్యాదు లనుష్ఠాన స్మారకములు.

"అగ్ని మీడే పురోహితం" ఇత్యాదులు స్తావకములు.

"ఇషే త్వా" ఇత్యాదులు త్వాంతములు.

"అగ్న ఆయాహి వీతయే" ఇత్యాదు లామంత్రకములు.

"అగ్నీ దగ్నీన్ విహర" ఇత్యాదులు ప్రైషరూపకములు.

"అధస్విదాసీ దుపరిస్విదాసీత్" ఇవి సంశయాత్మకములు.

"అంబే అంబికే అంబాలికే నమానయతి కంచన" ఇవి పరిదేవనాత్మకములు.

"పృచ్ఛామి త్వా పరమం తం పృథివ్యాః" ఇవి ప్రశ్నరూపములు.

"వేది మాహుః పరమం తం పృథివ్యాః" ఇవి సమాధానాత్మకములు.

ఇవి అనుష్ఠానస్మారకాదులు. ఇటులనే ఇతరములనుగూడ తెలిసికొనవలెను. అత్యంతము విజాతీయములైన యీ మంత్రవచనములందు యాజ్ఞికసమాఖ్యాన

మునకన్న వేరైన లక్షణ మేదియు నవసరము కాజాలదు.

పదార్థము లనంతములు. లక్షణపరిష్కారము వినా వీనిని దెలిసికొనుట దుస్సాధ్యము. లక్షణసిద్ధమైన వస్తుజాలమును పండితులు సులువుగ దెలిసికొనగలరు. పూర్వాచార్యులును—

"ఋషయోపి పదార్థానాం
నాంతం యాంతి పృథక్త్వశః
లక్షణేనతు సిద్ధానా
మంతం యాంతి విపశ్చితః"

అని లక్షణప్రయోజనమును వక్కాణించి యున్నారు. కావున నభియుక్త రీతి మంత్ర మని చెప్పుటయే లక్షణము.

అష్టమాధికరణము

"నాస్త్యత్ర బ్రాహ్మణేత్యత్ర
లక్షణం విద్యతేఽథవా
నాసీయంతో వేదభాగా
ఇతి క్లప్తే రభావతః"
"మంత్రశ్చ బ్రాహ్మణంచేతి
ద్వౌభాగౌ తేన మంత్రతః
అన్యద్బ్రాహ్మణ మిత్యేత
ద్భవే ద్బ్రాహ్మణలక్షణం."

"ఏక బ్రాహ్మణాన్యేవ పంచ హవీంషి" అని తైత్తిరీయ బ్రాహ్మణమున చాతుర్మాస్యలలో కలదు. వేదభాగముల కవధి లేవందున బ్రాహ్మణభాగములందు, తదితరభాగములందును లక్షణమున కవ్యాప్త్యతివ్యాప్తులు సంభవించినవి. అందుచే నీబ్రాహ్మణభాగమునకు లక్షణపరిష్కారము దుస్సాధము. వేదమున పూర్వము చెప్పిన మంత్రభాగ మొకటి. తదితరములైన హేతువాదాదిభాగములు మరికొన్ని. వానిని—

"హేతు ర్నిర్వచనం నిందా
ప్రశంసా సంశయో విధిః
పరక్రియా పురాకల్పో
వ్యవధారణ కల్పనా"

అని అభియుక్తులు గణన చేసినారు.

'తేన హ్యన్నం క్రియతే' ఇత్యాదులు హేతువాదలు.

'తద్దధ్నో దధిత్వం' ఇత్యాదులు నిర్వచనములు.

'అమేధ్యా వై మాషా' ఇత్యాదులు నిందావాదలు.

'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' ఇది ప్రశంసావాద.

'తద్వ్యచికిత్సజ్జుహవానీ మా హౌషాం' ఇది సంశయము.

'యజమానేన సమ్మితౌదుంబరీ భవతి' ఇది విధివాద.

'మాషానేవ మహ్యం పచంతి' ఇది పరకృతి జ్ఞాపకము.

'పురా బ్రాహ్మణా అభైషుః' ఇది పురాకల్పము.

'యావతోఽశ్వాన్ ప్రతిగృహ్ణీయా త్తావతో వారుణాం శ్చతుష్కపాలా న్నిర్వపేత్' ఇది శేష విధిజ్ఞాపకము.

ఇట్లే మరికొన్ని కూడ కలవు. ఇవి హేతువాదాదులు. ఈ హేతువాదాదులలో నొకటి బ్రాహ్మణమునకు లక్షణముగ చెప్పుకొనుటకు విప్రతిపత్తి లేదు కదా? అన్నచో ఈ హేత్వాదులు మంత్రముల యందును గానవచ్చుటచే నిది పొసగదు.

'ఇదంవో తా ముశంతిహి' ఇది హేతువు.

'ఉదానిషు ర్మహీ రితి తస్మా దుదక ముచ్యతే' ఇది నిర్వచనము.

'మోఘ మన్నం విందతే అప్రచేతాః' నిందావాచకము.

'అగ్ని ర్మూర్ధా దివః కకుత్' ఇది ప్రశంసావాద.

'అధస్స్విదాసీ దుపరిస్వి దాసీత్' సంశయము.

'వసంతాయ కపింజలా నాలభతే' ఇది విధివాద.

'సహస్ర మయుతా దదత్' ఇది పరకృతి జ్ఞాపకము.

'యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః' ఇది పురాకల్పము.

ఇట్లీ లక్షణమున కతివ్యాప్తి కలిగినందున పైవిధముగ పరిష్కరించుటకు వీలులేదు.

ఇక 'సాధనబాహుళ్యముతో కూడినది బ్రాహ్మణము' అని లక్షణము కుదుర్చుకొందమన్న నదియు కుదరదు. ఈ లక్షణము "ఇత్యదదా ఇత్యయజథా ఇత్యపచ ఇతి బ్రాహ్మణో గాయేత్" అని బ్రాహ్మణుడు గానముచేయదగిన ఈ మంత్రమునం దతివ్యాప్త మగుచున్నది. పోనీ "'ఇత్యాహ' అను వచనముతో కూడుకొనినది బ్రాహ్మణము" అను లక్షణము "రాజాచిద్యం భగం భక్షీత్యాహ", "యో వా రక్షాః శుచి రస్మీత్యాహ" అను రెండు మంత్రములయందు నతివ్యాప్త మగుచున్నది. ఆఖ్యాయికారూపము బ్రాహ్మణము అనుట కైనను యమయమీసంవాదసూక్తము మొదలైన మంత్రభాగము లాఖ్యాయికాజ్ఞాపకములై యున్నందున నట అతివ్యాప్త మగుచున్నది. ఏవిధముగ చూచినను బ్రాహ్మణమునకు లక్షణము కుదురుటలేదు కదా అంటే, అట్లు కాదు.

వేదము మంత్రభాగము, బ్రాహ్మణభాగము అని యిరుదెరగుల నున్నటుల మన మిదివర కంగీకరించియున్నాము. వీనిలో మంత్రభాగము నకు లక్షణము చెప్పియున్నాము. ఇక మిగిలినది బ్రాహ్మణము అని పరిశిష్టన్యాయముచే బ్రాహ్మణము నకు లక్షణము సిద్ధమైనది. ఈ రెండు లక్షణములను జైమిని 'తచ్చోదకేషు మంత్రాఖ్యా', 'శేషే బ్రాహ్మణశబ్దః' అని రెండు సూత్రములతో నిరూపించినాడు.

వేదమున కొన్ని యభిధాయకవాక్యములందు సంప్రదాయవేత్తలు "మంత్రా నధీమహే" అను వచనముతో నిది మంత్రమని వ్యవహరించుచున్నారు. వారే మంత్రేతరభాగములందు బ్రాహ్మణశబ్దమును వాడుచున్నారు అని పైశ్లోకములకు తాత్పర్యము.

ప్రశ్న — బ్రహ్మయజ్ఞప్రకరణమున "యద్బ్రాహ్మణా నీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారాశంసీః" అను వాక్యమునందు మంత్రబ్రాహ్మణములకన్న వేరైన ఇతిహాసపురాణాదులు వినబడుచున్నవి గదా?

ఉత్తర — ఇతిహాసాదులు బ్రాహ్మణపరివ్రాజకన్యాయముచే బ్రాహ్మణములనుండి పృథక్కరింపబడినవి; కాని నిజమునకు బ్రాహ్మణములకన్న వేరైనవి కావు.

౧. "దేవాసురాః సంయుత్తా ఆసన్" ఇత్యాదు లితిహాసములు.

౨. "ఇదం వా అగ్రే నైవ కించనాసీత్" ఇది సృష్టిక్రమమును తెలియజేయు పురాణము.

3. "ఇతి మంత్రాః, కల్పోఽక ఊర్ధ్వం యతి బలిం హరేత్" ఈ మొదలైన గ్రంథము కల్పము. ఇది అరుణకేతుక చయనప్రకరణమున కలదు.

౪. "యమ గాథాభిః పరిగాయతి" ఇవి గాథలు.

౫. మనుష్యవృత్తాంతప్రతిపాదకములైన ఋక్కులు నారాశంసలు.

ఇవి ఇతిహాసాదులు. ఏతావతా వేదమున మంత్రబ్రాహ్మణములకన్న వేరైన భాగము లేనందునను, మంత్రబ్రాహ్మణాత్మకము వేదమని లక్షణపరిష్కార మై యున్నందునను వేదమునకు తదుభయాత్మకత్వము సిద్ధము.

ఇంతేకాక జైమినిమంత్రములలోనున్న యవాంతరవిశేషములకు సాంకర్యము కలుగకుండుటకై—

"సర్వాన్నముయజుషాం లక్ష్మ
సాంకర్యాదితి శంకితే,
పాదశ్చ గీతః ప్రశ్లిష్టః
పాఠ ఇత్యస్త్వసంకరః"

అని ప్రత్యేకలక్షణముల వివరించినాడు. ఇందు పూర్వార్ధమున ఋగాదు లన్యోన్యము కలసియున్నవి. వానికి ప్రత్యేకలక్షణము లేదు అని పూర్వపక్షమును శంకించి ఉత్తరార్ధముతో సమాధానము చెప్పినాడు. పాదార్ధములతో గూడుకొని ఛందోబద్ధమైనది ఋగ్వేదము. గానము చేయదగినది సామవేదము. ఛందోగానములు లేక సంహితారూపేణ పఠింపదగినది యజు

ర్వేదము అని వీనికి ప్రత్యేకలక్షణములు కలవు. ఈ లక్షణములకు సాంకర్యము లేదు.

పూర్వ—"అహే బుధ్నియ మంత్రం మే గోపాయ, యమృషయ స్త్రైవిదా విదుః" (తైత్తిరీయ బ్రాహ్మణము.)

ఋగ్యజుస్సామములను తెలిసినవారు త్రివిదులు. వారి యొజ్జలు త్రైవిదులు. అట్టివారు ఋగాదిరూపేణ త్రివిధముగ పఠించుచున్న మంత్రభాగమును గోపనము చేయవలెనని మంత్రార్థము. పైన చూపిన త్రివిధ మంత్రభాగములకు సాంకర్యము దుష్పరిహార్యము. వానికి వ్యవస్థితమైన లక్షణము పొసగదు. చూడుడు:

"దేవో వః సవితోత్పునా త్వచ్ఛిద్రేణ
పవిత్రేణ వసోః సూర్యస్య రశ్మిభిః"

అను మంత్రము యజుర్వేదములోనిదని త్రైవిదులు వేదమంత్రములలో పఠించుచున్నారు. కాని యీ మంత్రమునకు యజుష్ట్వము లేదు. "తద్బ్రాహ్మణే సావిత్ర్యర్చా" అని పైమంత్రము ఋగ్వేదముగగూడ వ్యవహృత మగుచున్నది. ఇటులనే "వీత త్సామ గాయ న్నాస్తే" అని ప్రతిజ్ఞ చేసి యజుర్వేదమున కొంత సామగానము చేయబడుచున్నది. మరియు "అక్షిత మస్యచ్యుత మసి ప్రాణసంశితమసి" అని మూడు యజుర్వేదమంత్రములు సామవేదమున పఠింపబడుచున్నవి. అటులనే గీయమానమగు సామమునకు మూలమైన కొన్ని ఋక్కులు సామముతో కలిపి గానముచేయబడు చున్నవి. కనుక ఋగాదుల కసాంకర్యలక్షణనివృత్తి కుదురుటలేదుకదా ?

సిద్ధాం—అంటే అట్లుకాదు. ఋగాదులకు జైమినిప్రోక్తమైన పాదాదిలక్షణమునకు సాంకర్యము లేదు. పైన చూపిన సంకీర్ణత సరియైనది కాదు. అర్థ సంబద్ధమైన పాదములతో గూడుకొని వృత్తబద్ధములైన మంత్రములు ఋక్కులు. గీతరూపమున నున్నవి సామములు. పై రెండింటికి వేరై కేవలసంహితారూపేణ పఠితము లగునవి యజుస్సులు అని లక్షణప్రత్యేకత కలదు. ఈ లక్షణములకు సాంకర్య మేమాత్రము లేదు. ఈలక్షణ త్రైవిధ్యమును జైమిని—

"తేషాం ఋగ్యత్రార్థవశేన పాదవ్యవస్థా" (౨-౧-౩౫)
"గీతిషు సామాఖ్యా" (౨-౧-౩౬)
"శేషే యజుశ్శబ్దః" (౨-౧-౩౭)

అని సూత్రత్రయముచే నిర్వచనము చేసినాడు. మంత్రములలో గల ఈయవాంతరవిశేషము సాధారము చేసికొనియే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అని వేద త్రైవిధ్యము సిద్ధించినది.



# ప్రాచీన ఖగోళము

3

— శ్రీ వేలూరి శివరామశాస్త్రి —

సంహితలలో గనబడు నక్షత్రాదులనుబట్టి మొత్తముమీద సంహితల రచనాకాలము కృత్తికాకాలమని చెప్పవచ్చును. కృత్తికలో విషువము సుమారు క్రీ. పూ. రెండువేల ఇన్నూరేండ్లు. నాటినుంచి సుమారు వేయేండ్ల యీవలివరకును కృత్తికాకాలము. కావున ఈ నడుమకాలములో వీని ప్రాదుర్భావము[1].

సంహితలలో హ్రస్వదినము ౨౪, దీర్ఘదినము ౩౬ దండములు. ౩౬ దండములనగా ౧౪ గంటల ౨౪ నిమిషములు. ౨౪ దండములనగా ౯ గంటల ౩౬ నిమిషములు. ఉత్తరాయణాంతదినమున ౩౪ వ అక్షాంశలో ౧౪ గంటల ౨౦ నిమిషములకును, దక్షిణాయనాంతదినమున ౯ గంటల ౧౨ నిమిషములకును సూర్యోదయ మగును. కాన నాటి ఆర్యుల నివాసము ౩౪ వ అక్షాంశమునకు దాపులం దని చెప్పవచ్చును. అది పాంచాలములకు ఉత్తరము.

ఋగ్వేదఋషు లున్న దేశము కొంత మాడు ఋతువులే ఉన్న ఉత్తరకపాలమునందలి (Northern Hemisphere) అక్షాంశప్రాంతము అని ఊహింప వచ్చును.

## యంత్రములు

ఋగ్వేదమునందు మనకు గనబడు తురీయ యంత్రము నకు పిదప సంహితాజ్యోతిషకాలమున యంత్రవికాసము కానవగును. తగిన యంత్రములు లేనిచో సరిగా కాలనిర్ణయము చేయుటకు వీలులేదు. శంకువును కనిపట్టుటకు చెట్లనీడలును, మనుష్యుల నీడలును ఒజ్జలయి యుండును. ఇది అతిసులభసాధ్యము. ఇట్టిదిగూడ ఆర్యులకు తెలియ దన్నవా రున్నారు. విషువదయనాంతదినముల గనుగొనుటకు సిద్ధాంతములం దన్యయంత్రము లున్నను శంకువు (Gnomon) చాల నావశ్యకము. వృత్తమును చుక్కలచేగాని, అంశలచేగాని విభాగింప నేర్చినవారికి చక్రయంత్రము గాని తురీయయంత్రముగాని కనిపట్టుట చేత గాకపోదు. దృగ్జ్యోతిషమున వృత్తాంశపరిమాణమును, కాలపరిమాణమును కనుగొనుటకు రెండు రకముల యంత్రము లుండవలెను. పగట శంకు వీ రెంటిని సాధించునుగాని రాత్రివేళ నది గ్రుడ్డిది. కావున నాటివారు కపాలయంత్రమును కనుగొనిరి. వారు ప్రస్థజలాదిపరిమాణముచే కాలమును[2] కనుగొను

1. విషువబిందువున కనబడిన నక్షత్రము వెనుకకు జరిగి మరియొక నక్షత్ర మచటికి వచ్చుటకు సుమారు ౯౫౦ ఏండ్లు పట్టుటచే కృత్తికాకాలము సుమారు క్రీ. పూ. ౨౨౦౦ లో మొదలయి క్రీ. పూ. వేయేండ్లవరకును ఉండును. కావున క్రీ. పూ. ౨౨౦౦, క్రీ. పూ. ౧౧౫౦ కృత్తికాకాలమునకు పరిహద్దులు. మరియు విషువ మిప్పు డుత్తరభాద్రలో నడుచుచున్నను కొన్ని దేశములవారు అశ్వినినే పట్టుకొని కూరుచున్నటులు అపుడు కృత్తిక వెనుక బట్టినను ఇంకను కృత్తికయే యున్నదనియు కొందరు నాటివా రనుకొనియుందు రను నూహకలదు. కావున నీ కాలము పూర్వాపరసీమామధ్యకాల మని అనుకొనుట లెస్స.

2. వే. జ్యో. న దివావృద్ధి ప్రస్థజలపరిమితము. ఉ. అయన ద. అయన దివారాత్రిభేదము ౬ ముహూర్తములు.

చుండెడువారు. దేశకాలాదిభేదముచే ఆ ప్రస్థాజికము గూడ భేదించును. కావున కపాలయంత్ర మావశ్యక మాయెను. దాని కొక చిల్లి యుండును. దానినుండ నీరు నిండును. అది నిండుట కొక దండము పట్టును. దండము ౨౪ నిమిషములు. రెండు దండము లొక ముహూర్త మను మానము చాలకాల మమలులో నుండెను.

రాశిచక్ర మేర్పాటయినపిదప సూర్యఘటికా యంత్రము[3] వచ్చియుండును. దానికి పండ్రెండు ముండ్లుండును. ఇదియు రేచీకటిదే. కావున దానికి పిదప జలఘటికాయంత్ర[4] మావిష్కృత మయి యుండును. మరియు మధ్యాహ్నమును దెలిసికొనుట కును, పలపకాలమును దెలిసికొనుటకును షష్టియంత్ర మొకటి కనబడును.

## జైన జ్యోతిషము

జైనులు రచించిన జ్యోతిషగ్రంథములలో సూర్యప్రజ్ఞప్తి వెలుగు చూచెను. దాని విరచయిత మహా వీరుడు. ఇతడు క్రీ. పూ. ౫౨౭ సం.న మృతిజెందెను. చంద్రప్రజ్ఞప్తి భండార్కర్ ఇన్స్టిట్యూట్‌లో కలదు. భద్రబాహవీయసంహిత యను మరియొక పేరు మాత్రము వినబడుచున్నది. ఇతరగ్రంథములు దొరక నంతవట్టు వీనిబట్టియే జైనజ్యోతిషమును గూర్చి యిప్పటికి చెప్పగల చరిత్ర. కావున జైనజ్యోతిషము క్రీ.పూ. ౫వ శతాబ్దిలో మొదలాయె నని అనుకొందము. సూర్యప్రజ్ఞప్తిలోని ముఖ్యవిషయము లిదిగవ—

ఇరువురు సూర్యులును, ఇరువురు చంద్రులును, రెండేసి రెండేసి గ్రహములును, రెండేసి రెండేసి నక్షత్ర పుంజములును గలవు. ఇవి మేరువునకు ఉత్తరదక్షిణ ముల క్రమముగా కనబడును. మేరువు పదువారు వేల యోజనముల ఎత్తగు కొండ. దీని అడ్డంకివలననే జంబూ ద్వీపమునం దుదయాస్తము ౧౦ కలుగుచుండును. సూర్యుని దేహవిపర్యాసము రాత్రిందివములకు కారణ, మని చెప్పిన శతపథబ్రాహ్మణము (౩ పంచిక ౪౪ అధ్యాయ) మన కిచట గురుతునచ్చును. సూర్యుని ముఖము వెలు గనియు, వీపు చీకటి అనియు ఈ ఋషి భావించెనని మనకు తోచును. కాని యిట్టిదే యగు మరొక శ్రుతికి శ్రీధరస్వామి—'సముద్రతీరస్థస్య ప్రాచ్యేచ. అదోఖత్ర వా ఏష ప్రాత రుద్యోపః సాయం ప్రవిశతి ఇతి శ్రుతివ్యవహారో న వస్తుతః' వ్యాఖ్య మనలను హెచ్చరించును.

బ్రాహ్మణములును, సంహితలును, వేదాంగ జ్యోతిషమును చెప్పిన ఐదేండ్ల యుగమును వీరు కైకొనిరి. కాని జైనయుగాదికి ఉత్తరాయణపూర్ణిమ మొదలు.

## సిద్ధాంతజ్యోతిషము

క్రీ. శ. ఐదవ శతాబ్దిశేషమున ప్రాచీనసూర్య సిద్ధాంతమును పునరుద్ధరించి గణితము, యంత్రము, భూఛాయోదర్శనము మొదలగు పెక్కు కట్టుదిట్టములతో జ్యోతిషమును శాస్త్రముగా తీర్చి దిద్దినవాడు శ్రీ ఆర్య భటుడు, లేక ఆర్యభట్టు[5]. ఇతడు భూమి తిరుగుచున్న దని వక్కాణించెను. పూర్వమందే చలాచలవాదములు రెండును గలవు. కాని యితడే చలవాదమును సిద్ధాంతము చేసినవాడు. ఇతడు నీచోచ్చవృత్తములయు, ప్రతివృత్త ములయు సాయమున గ్రహమార్గము వృత్తాకారము కా దనియు, మరి వృత్తాభాస (Elliptic) మనియు వ్యాకరించెను. ఇతడు నిరూపించిన భగణముల లెక్కయు, కుట్టకవిధియు ('Indeterminate' analysis) వైజ్ఞానికుల కాశ్చర్యము కలిగించును.

ఐదు, లేక ఆరవశతాబ్దికి చెందిన లల్లాచార్యుడును, బ్రహ్మగుప్తుడును ఆర్యభటుని భూభ్రమణవాదమును

3. వే. జ్యో. నందు ఘటీయంత్రము కలదు. అపుడు శంకువుచే ఉత్తరదక్షిణాయన నిర్ణయము చేయువారు.

4. తెలుగుదేశమున గడియారమువారికి దీనితో నేదో సంబంధ ముండియుండును. ఈ విషయము 'శివ భారతము' వ్రాసిన శ్రీ గడియారము శేషశాస్త్రిగారికి వ్రాయగా వా రిటులు వ్రాసిరి: —'పూర్వ మొకప్పుడు ఘటికాయంత్రమును నిర్మించి తద్ద్వారా కాలబోధ చేయుచుండువా రనియు, నైజాములో ప్రభుత్వ స్థానమున ఈ యుద్యోగము నిర్వహించుచుండి రనియు మాయింటిపేరును గూర్చి మాపెద్దలు చెప్పుచుండిన వార్త.'

5. ఆర్యభటుని పిదప జ్యోతిషశాస్త్రకర్తలు మరికొందరు ఆర్యభటులు కలరు.

ఖండించివై చిరి. లల్లాచార్య డార్యభటున శకలవ్య శిష్య డేమో కాని 'భూమి యింత వడిగా తిరుగుచేని ఆకాశాభిముఖముగా విడిచిన బాణము పడమట నేల పడదు ! మేఘము లన్నియు పడమటికే పరుగెత్తునటు లేల కనబడవు ?' అని గురువుతో గుద్దులాడెను. 6

వరాహమిహిరుడు ఆరవ శతాబ్ది మొదట ప్రాచీన సంహితలను సంకలించి బృహత్సంహితను, పంచసిద్ధాంతిక యను కరణగ్రంథమును రచించెను. ఇది గణిత సౌకర్యమునకు సంక్షేపముగా కొన్ని నియమములను దెలుపును. ఆర్యభటుడు ఉద్భావయిత. వరాహమిహిరుడు ముఖ్యముగా సంకలయిత. ఇతడు లోగడ ప్రచారములో నున్న దక్షిణాయనమునందలి సంవత్సరాదిని మార్చెను.

భాస్కరుడు వరాహమిహిరునినాటివాడు. ఇత డార్యభటుని సిద్ధాంతము చేకొని బృహద్భాస్కరీయ, లఘుభాస్కరీయము లను రెండు గ్రంథములు రచించెను. సిద్ధాంతశిరోమణిభాస్కరుడు వేరు, ఇతడు వేరు. క్రీ. శ. ౫౭౮ వ సాలున ఇతని మనికి అని కొందరు వ్రాసిరి.

బ్రహ్మగుప్తుడు ౬౨౮ వ సంవత్సరమున బ్రాహ్మస్ఫుటసిద్ధాంతము వ్రాసి దేశదేశాంతరములలో కీర్తి వెదజల్లెను. క్రీ. ౭౭౩ వ సాలున మహమ్మద్ బిన్ ఇబ్రహీమ్ అల్ ఫాజారీ అనునతడు దీని నారబీలోనికి పరివర్తించెను. దానికి సింద్ హింద్ అని పేరు. ఇతని ఖండఖాద్యకము అలర్ కంద్ అను పేర అరబీలోని కనూదిత మాయెను. బ్రహ్మగుప్తుడున్నంతవరకును భూమి తిరుగుచున్నదని ఆతనిముందెవరును నోరెత్తలేకపోయిరి.

ముంజాలుడు ౮౫౪ వ శకమున లఘుమానసము రచించెను. ఇత డయనాంశము నావిష్కరించెను. ఇతడు చూపిన నియమమునే జ్యోతిరాచార్యుడు భాస్కరుడు స్వీకరించె ననినచో నితనికి వేరుకతప్రతముతో పనిలేదు. ౧౧౦౦ శా. శకమున ముంజాలుని మానసమును సంక్షేపించి ఎవరో లఘుమానసము రచించిరి. వారు తమ పేరు వ్రాసికొనలేదు. 'ముంజాలాద్యైః' అని భాస్కరుడన్నవాడు ౮౫౪ శకపు ముంజాలుడు. దీనికి కారణము సూర్యకేవయజ్య 'ధ్రువమానసాబ్దములు' అని పేర్కొని ౮౫౪ శకమును గ్రహించి ముంజాలు ననుసరించి అహర్గణము కట్టెను.

శ్రీపతి యితనికి పదపటివాడు. ఇతని గ్రంథము లు ధీకోటియు, సిద్ధాంతశేఖరమును. గ్రంథరచనా కాలము ౯౬౧ శకము.

ఇతనికి పిదప ధారేశ్వరుడు భోజుడు. అనేక దర్శనములు వ్రాయగలిగిన యితని చేయి రాజమృగాంకము నెత్తి చూపెను. పిదప శతానందుడు సూర్య సిద్ధాంతమునందలి మూలసూత్రముల భిత్తిపై క్రీ. ౧౦౯౯ న భాస్వతి రచించి 'భాస్వతీ గ్రహణే ధన్యా' అని కీర్తి గొనెను.

పండ్రెండవ శతాబ్దిలో భాస్కరుడో యను భాస్కరు డుదయించెను. అతడు తన ముప్పదారవ యేట సిద్ధాంతశిరోమణిని విరచించెను. తొంబదారవ యేట కరణకుతూహలమును కూర్చెను. ఇతడు గణిత జ్యోతిషమునందలి శాఖోపశాఖల ఆకారము పరిశోధించెను. ఈతని గణితవిజ్ఞానమును పాశ్చాత్యగణితజ్ఞులు చాల మెచ్చిరి. సిద్ధాంతశిరోమణియందలి

---

6. తెలుగుదేశమున లొల్లవారు కలరు. లొల్ల అను ఊరు కలదని వినికి. లొల్ల, లేక నొల్ల యను సేద్యపు యంత్ర మొకటి కలదు. వీనిలో నొకదానికి వీరి యింటిపేరు సంబంధపడునో, లేక లల్లాచార్యుని పేరునకే వికృతమై సంబంధపడునో తెలిసికొనవలయును. లల్లుని తండ్రి త్రివిక్రమభట్టు. తాత సాంబుడు. చూ. లల్లతంత్ర— ఉత్తరాధికార. ఒకపాటీ గణితము, రత్నకోశము లల్లకృతములు. రెండవది ఇపుడు కనబడదు. శ్రీపతి రత్నమాల వివరించుచు మహాదేవుడు వ్రాసిన 'తారాసంఖ్యాయాం లల్లః శిఖిశిఖరస' అని ఉదాహరించిన దా రత్నకోశ సంహితలోని దయియుండునని కొందరు తలచిరి. భాస్కరు డితని యుక్తులను కొన్ని పద్యములుగా మార్చెను. మరియు నితని గ్రంథములో జేలుచూపకయుపోలేదు—'తర్హి తేన లల్లేన వృత్తఫలం పరిధిఘ్నం సమంతతో ధరణిగోళ స్పష్టఫల మిహ స్వగణితే కథం పరిధిఘ్నం కృతమ్?'

అయనాంశనిర్ధారణమును 7, గ్రహగతిమీమాంసయు, లంబననిర్ణయమును 8, గ్రహయుతియు, 9 వలన మీమాంసయు 10, గ్రహణగణనమును జూచినచో పాఠకులకు సముద్రగాంభీర్య మెంత గహనస్యమని తోచదు. ఈ మహానుభావునితో భారతజ్యోతిర్జ్యోతి ఉష్వాని అరెను11.

సంహితాకాలమునకును, ఆర్యభటుని కాలమునకును నడుమగల వేయేండ్లలో నొక జ్యోతిషగ్రంథము గూడ దొరకలేదు. ఈ కాలమునడుమ అలెగ్జాండర్ దండయాత్ర కనబడుచున్నది. తావన్మాత్రమున ఇతర శాఖలలో గ్రంథరచన లేకపోలేదు. ఈ తోకచుక్క జ్యోతిషముమీదనే ఏల విరుచుకొని పడెనో తెలియదు.

## సూ ర్య చా ర ము

సూర్యుడు తూరుపు క్షితిజమున పొడిచి యటనుండి నడినెత్తిమీదికి వచ్చి పడమటగా నస్తమించి రాత్రి కనబడకుండబోయి మరల తూరుపున పొడిచి భూమిచుట్టును తిరుగుచున్నటులు మనకు కనిపించును. సూర్యుడు పరిభ్రమించు మేరలో నెన్నియో చుక్కలున్నవి. ఆ చుక్కలు గల మేరకు క్రాంతిమండలమనియు, క్రాంతివృత్తమనియు పేరు. క్రాంతి= నడక. మండలము = గుండ్రముగు ప్రదేశము. ఉదయమునకు ముందు సూర్యునికడ నొక చుక్కను గురుతుపెట్టుకొందము. సూర్యుడు మరల నా చుక్కకడకు సుమారు ౩౬౫ దినములకు వచ్చునని కనుగొందుము. అనగా సూర్యుడు ఒకచుట్టు తిరుగుటకు, లేక క్రాంతిమండలము వలగొనుటకు ౩౬౫ దినములు పట్టునని కనిపట్టగలము.

ఒక యేడాదిపాటు పరిశీలించినచో సూర్యుడు దక్షిణమున నొకచోటునుండి బయలుదేరి ఉత్తరముగ నొకచోటివరకేగి అటనుండి మరలి క్రమక్రమముగా మొదట బయలుదేరిన చోటికే వచ్చినటులు కనిపించును. ఏటేట నీ నడకలో మార్పుండదు. ఈ దక్షిణోత్తర గమనములు ౨౩౼° అని కొన్ని గ్రంథములందును, ౨౪° అని కొన్ని గ్రంథములందును గలదు. దీని గణనము భూమధ్యరేఖకు సరిగా పై ఖగోళమున నున్న విషువద్వృత్తమునుండి ప్రారంభము.

## చ ం ద్ర చా ర ము

ఒక పున్నమనాడు క్రాంతివృత్తమున చంద్రుని కడ నున్న ఒక పెద్ద చుక్కను గురుతిడుకొందము.

7. Arc of the ecliptic intercepted between the first point of Aries and first point of the fixed star Aswini.

8. Parallax.

9. Conjunction of planets.

10. Angular deflection.

11. సంహితలయందే గాక సిద్ధాంతములయందును అవైజ్ఞానికములగు విషయములు కొన్ని కనబడుచుండును. ఆర్యభటుడు సూర్యుని లెక్కలు కట్టికట్టి భక్తిపరవశుడై సూర్యస్తోత్ర మారంభించును. మరియు వీనిలో సిద్ధాంతములే కాని సోపపత్తికముగ విచారప్రక్రియ యుండదు. ఇది చూచి పాశ్చాత్యులు—'భారతీయులు గ్రీకుల కడనో, ఖాల్డియా వారికడనో రెండు ముక్కలు ముక్కున బెట్టుకొని ప్రక్రియ తెలియక పుస్తకములలో వ్రాసి పెట్టుకొనిరి' అని అపహసించిరి. భారతదేశము వేదము మొదలు చిల్లర విద్యలవరకును పుస్తకాపేక్షను నిరసించును. ఇచట గురుముఖమున సంప్రాప్తమయి కంఠస్థమయినదే విద్య. మరియు నిందు సభలలో పూర్వపక్షములయు, సిద్ధాంతములయు బలముమీద గ్రంథములు పెరుగుచు వచ్చెను. సారాంశములే గ్రంథస్థము లగును. వాదములలో నలిగిన ప్రక్రియాంశములే వ్యాఖ్యానగ్రంథములు. ఇదీ ఉన్న సంగతి. రెండు మూడు శతాబ్దుల నుండి పుట్టుచు వచ్చిన తర్క వ్యాకరణ గ్రంథము లన్నియు నిట్టివే. ఈ సంగతి పాశ్చాత్యులెరుగరు. మరియు భూమి ఇన్ని యోజనములు, అన్ని యోజనములు అని పరిష్కరించి తుట్టతుద కిది యంతయు మిథ్య, బ్రహ్మమే సత్యము అని వేదాంతములో పర్యవసన్నము చేయుట భారతీయులకు పరిపాటి యనియు వా రెరుగరు. మరియు వీనిలో ప్రక్షిప్తము లన్నమాట సత్యము. ప్రాచీన నవీన సూర్యసిద్ధాంతములను వేరుపరుపజాలము. ప్రకృతము ముద్రితములగు ప్రతులలో పాఠభేదములు చాల గలవు.

చంద్రుడు మరల నా చుక్కకడకు వచ్చుటకు సుమారు ౨౭ దినము లగును. అనగా చంద్రు డిన్ని దినముల కొక చుట్టు తిరిగెను. కాని ఆనాడు పున్నమ కాదు. మరి ౨౯ దినము లోపిక పట్టవలయును. ఇపుడు సూర్యు డెట్టెదుట పశ్చిమక్షితిజమున నుండును. చంద్రు డిటు లొక్కొక్క పూర్ణిమకు ౨౯ దినముల చొప్పున ముందు ముందు క్రాంతివృత్తమున గనబడుచు ౧౨ పున్నమలను పూరించును. ఈ పండ్రెండు నెలలతో నొక సంవత్సరము పూర్తియగును.

పున్నమనుండి పున్నమవరకుగాని, అమనుండి అమవరకుగాని సూర్యుడు ముప్పది మారులు ఉదయించును. ఒక ఉదయమునుండి మరియొక ఉదయము వరకు దినమనియు, పున్నమనుండి పున్నమవరకుగాని, అమనుండి అమవరకుగాని నెల యనియు, అట్టి ౧౨ నెలలు, లేక ౩౬౦ దినము లొక సంవత్సరమనియు కాలవిభాగ మొనరించుకొను టతిసులభము. ప్రాచీను లందరు నిటులే చేసికొనియుందురు. దాననే ౩౬౦ దినము లొక సంవత్సర మను మాట ప్రాయికమాయెను. ఇదియు ఋగ్వేదమున గానబడును (౧-౮౪). కాని యిందువలన మాసకాలమును, ఋతుకాలమును, సంవత్సరకాలమును సరిగా పరిచ్ఛిన్నము కాదు.

## భచక్రము

ఇటులు పరిశోధింపగా రవిచంద్రుల పరిమాణము సమము కాదనియు, వీరు సమతలమున లేరనియు, చంద్రుని దారిని చంద్రుడును, సూర్యుని దారిని సూర్యుడును తిరుగుచున్నా రనియు తేలిపోయెను. మరియు చంద్రుడు దిప్పకాయవలె క్రాంతిమండలమునకు పెడపెడగా పోవుచున్నా డనియును కనబడెను. 'ఈ చంద్రుని మాడ్చి బూడిద చేసినను సరిగా నుండడు' అని శ్రీ పిడపర్తి చిన్నపూర్ణయ్య సిద్ధాంతిగా రనిరని వాడుక కలదు. కావున ప్రాచీను లితడు తిరుగు మేరగూడ కలిసి వచ్చుటకు ఒక మేఖల కల్పించి దానికి భచక్ర మని పేరిడిరి. దానిని వారు ౨౭ భాగలు చేసిరి. ఒక్కొక్క భాగమునకు 'భ' అనియు, నక్షత్ర మనియు పేరు[12].

చంద్రకక్ష సూర్యకక్ష యగు క్రాంతివృత్తమును ౫° అంశలలో ఖండించును. ఆ సంపాతబిందువులకు రాహుకేతువు లని పేరు. చంద్రకక్షకును, గ్రహకక్షలకును విక్షేపమండలము లని పేరు. క్రాంతివృత్తమునకే విక్షేపమండలము లన్నియు దాపున నుండుటచే రాశిచక్రవ్యవస్థ చేసినపుడు సాక్షాత్ క్రాంతివృత్తమును గ్రహింపక ౧౬° అంశలు గ్రహించిరి. అనగా ఖగోళమున క్రాంతివృత్తమున కటు ౮° ఇటు ౮° అంశల ప్రదేశమును రాశిచక్రమునుగా గ్రహించుటచే అన్ని గ్రహములయు కక్షలు రాశిచక్రములో ఇరికెను.

చంద్రునకు పరమవిక్షేపము ౫-౯°. విక్షేపమునకు శర మని మరొక పేరు. ఈ దిగువపటమున 'చ' బిందువు చూచునది. చంద్రుడు దాని దాటిపోడు. కాన అదే పరమదూరము. అది ౫-౯° అంశములు. రాహుకేతువులకడ విక్షేపము లేదు. అవి సాక్షాత్క్రాంతివృత్తమునం దుండును.




శరాంశము చంద్రునకేగాని సూర్యునకు లేదు. విక్షేపమునకే దిగువ వివరణము:—

సూర్యునిచుట్టు భూమి తిరుగు తలమునకు (Plane) క్రాంతివృత్తతల (Ecliptic Plane) మని పేరు. మనము భూమిమీదనే యుండుటచేసి మన తిరుగుడు మనకు తెలియదు. సూర్యుడే ఖగోళమున ఒక చక్రమున తిరుగుచున్నటులు మనకు కనబడును. అదియే క్రాంతివృత్తము. చంద్రాదులు క్రాంతివృత్తతలమున

---

12. శ్రీ బాలగంగాధరులును, కొందరాంగ్లేయులును ఆర్యులు తొల్లి నక్షత్ర విభాగ మెరుగ రని వ్రాసిరి. అటులగుచో బ్రాహ్మాదిసిద్ధాంతముల ఉత్పత్తియే అసంభవమని అనకలసివచ్చును. మరియు బ్రాహ్మణములు అభిజిత్తును పరిగణించుటయు, వదవడి దూడబెరుకుటయు సంభవింపదు.

గాక తత్సమీపమున స్వస్వకక్ష్యలలో పరిభ్రమింతురు. ప్రాచీనులు సూర్యకక్ష్యవలెనే మిగిలిన గ్రహముల కక్ష్యావృత్తములనుగూడ గుర్తించిరి. అవన్నియు క్రాంతివృత్తమునకు సుసన్నిహితము లగుటచే గ్రహవిక్షేప




ములకు గణన లేదు. గ్రహణములయెడ చంద్రవిక్షేపము తెలియవలయును కావున చంద్రవిక్షేపమునకు గణన మావశ్యకము.

## న క్ష త్ర ము లు

అశ్విని మొదలగు నక్షత్రములు సమాంతరాళము లందు లేవు. కావున నక్షత్ర మనగా క్రాంతివృత్తము నందు ౨౭ వ భాగము. ఒక్కొక భాగమునం దెన్నియో చుక్క లున్నవి. ఆ యన్నియు కలిసి ఒక నక్షత్ర మని పరిభాష. శతభిషఙ్నక్షత్రము చుట్టును[13] పలు చుక్క లున్నవి. శత=నూరు, లేక పెక్కు. ఇవన్నియు కలిసి శతభిష. క్రాంతివృత్తమునం దున్న కోటానుకోట్ల చుక్కలలో పై యిరువదేడు చుక్కలును తమతమ భాగలలో పెద్ద వెలుగు కలవి. వానికి యోగతార లనియు పేరు. ఆ యా యోగతార ఆ యా చుక్కల కాది. క్రాంతివృత్తము ౩౬౦ అంశలు. వీనిని ౨౭



[క్రాంతివృత్తము]

13. శతభిషఙ్నక్షత్రమున చంద్రు డున్నప్పుడు జబ్బు చేసినయెడల నూరుగురు వైద్యుల కయినను అది లొంగదు అని దీని కొక వ్యుత్పత్తి ఫలజ్యోతిష గ్రంథములందు కలదు. ఈ నక్షత్రమునకు వరుణు డధిదేవత. యోగతార Gama Aquarii.

నక్షత్రములకు పంచినచో నక్షత్రమునకు ౧౩°-౨౦″ కలలు వచ్చును. కావున ౧౩°-౨౦″ అనినను నక్షత్రము. ఇంతియకాక చంద్రుడీ ౧౩°-౨౦″ కడచు కాలముగూడ 14 నక్షత్రమే. వైదిక కాలమున ఈ రీతిగా విభాగమును, నక్షత్రముల కాకారకల్పనయు జరిగెను. 15

## తిథి 16

అమావాస్య నాడు రవిచంద్రులు కలిసియుందురు. అమా=కూడ, 'వస-నివాసే' వాస్య=వసించుట. ఆ క్షణమున వారికి అంతరము శూన్యము. అటనుండి ఎవరి దారిని వారు పోదురు. వారికి ౧౨° అంశ లెడ మయినపుడు పాడ్యమి పూర్తియగును. ౨౪° అంశ లెడ మయినపుడు విదియయు, ౧౮౦° అంశ లెడ మయినపుడు పున్నమయు, ౩౬౦° అంశ లయినపుడు కలయికయు కలిగి అమవస యగుటయు ఘటిల్లించును. ఇట్టి నెలలు ౧౨ ఒక చాంద్రసంవత్సరము. దీన ౩౬౦ తిథు లున్నను దినములు ౩౫౪. ఏల? రవిచంద్రుల గతులు వేసగిలో వడిగను, సీతువులో మెల్లగను ఉండును. మన కిటట దీర్ఘాహము ఘ ౬౫-౧౬ పలలు. హ్రస్వాహము ౫౩-౫౬ పలలు. తిథులు ఇటులు వృద్ధిక్షయములు పొందును. సాధారణముగా ౧౨ చాంద్రమాసములలో ౭ వృద్ధతిథులును, ౧౩ క్షీణతిథులును ఉండును.



సూర్యుడు ఉన్న దిశ

[నల్లనిభాగము సూర్యుని వెలుగు పడని చోటు. తెల్లనిభాగము పడినచోటు. గీతలున్న చోట సూర్యునిచే వెలుగొందినను మనకు కనబడనిచోటు. సూర్యున కెదురుట నున్న చంద్రభాగమంతయు ప్రకాశించును గాని అందు భూమి కెదురుట నున్న ప్రదేశమే మనకు కనబడును. కావున మనకు చంద్రరేఖ C ఇటులు కానిపించును.]

---

14. ఈ కాలము మధ్యమ మానమున ౬౦-౪౨-౫౭.౪ దీర్ఘకాలము ౬౬-౨౧-౦ హ్రస్వకాలము ౫౫-౫౬-౦.

15. వే. జ్యోతిషమున సూర్యచంద్రులు ధనిష్ఠాదిని కలిసినపుడు ఉత్తరాయణారంభము. అదే ఉగాది. అపు డమాంతమాసము. కాన ఉగాది అమపోయిన మరుపటి నాడు. ఇంతకు ముం దొకపు డుగాది వాసంతవిషువద్దినమునను మరొకపుడు ఉత్తరాయణాంతదినమునను అయెడిది. అపుడు పూర్ణిమ మొదలు చాంద్రమాసము. తైత్తిరీయసంహితలో మాఘపూర్ణిమ నుండి ఉగాది. కాన వేద సంహితల పిదప వేదాంగజ్యోతిషము దీనిని సంస్కరించెనని అనవలయును. తై. సంహితకును, వే. జ్యోతిషమునకును నడుమ రమారమి వేయేండ్లు. పిమ్మట వరాహమిహిరుడు ఐదవశకమున, అనగా ఆరవ క్రీస్తు శతాబ్దిని దానిని సంస్కరించెను. వరాహమిహిరుని కాలమున కర్కాటక ప్రథమ పాదమున ఉత్తరాయణాంతము.

16. సూర్యుడు కనబడినటులు చంద్రుడు కనబడడు. కాలమునందును నియతవేళకు కనబడడు. అటులయినను తిథి యనున దొక భరతఖండమునందే యిపుడు కలదు. ఖాల్డియా పారసీకముల వారికి తిథి లేకున్నను చాంద్రమాసము. ఇస్లాంవారిది చాంద్ర మాసము కాని తిథి లేమి రంజాన్ ఒక నియతసమయమున రాదు. అనియత మగు నిట్టి చాంద్రమాస మేల వచ్చెను? చంద్రునికంటె సూర్యదర్శన మే దేశమున అనియతముగా నుండునో ఆదేశము నందున్న ఆర్యుల గణన మిది యని కొందరూహించిరి.

చంద్రకళల హానివృద్ధుల జూచి లెక్కించునది చాంద్రమాసము. అమనుండి అమవరకుగాని, పున్నమనుండి పున్నమవరకుగాని దీనిని లెక్కింపవచ్చును. సూర్యుడొక నక్షత్రమునుండి మరల నా నక్షత్రమునకు వచ్చు సమయమును లెక్కించు కాలము సౌర సంవత్సరము. ఋగ్వేదమునందే అధిమాసకల్పనము కనబడుటవలన ఆ కాలమునకూడ ౩౬౫ దినములుగల సౌరసంవత్సరగణన మున్నదని ప్రతీత మగుచున్నది. ఈ యధిమాసగణనమువలన చాంద్రవత్సరము సౌరవత్సరముతో సమానమగును. ఈ రవిచంద్రుల యోగనికి[17] నడుమ నున్న సమయములో ముప్పదింట నొక భాగము చాంద్రదినము. దీనివలన చాంద్రసౌరమాసముల మూలప్రకృతి మారదు. సౌరమాసము సౌరదినములచేతను, చాంద్రమాసము చాంద్రదినములచేతను, అనగా తిథులచేతను లెక్కింపబడి చాంద్ర-సౌరసంవత్సర[18] మేర్పడును. రాశిచక్రమే యిప్పుడును ఒనగూడెను[19].

## సంవత్సరాది

ఆ కాలమున సంవత్సరాది యెప్పుడు? జనసామాన్యమునకు యాగములకంటె ముందు పంటలతో సంబంధము ఉండుట స్వభావము. ఆ పంటలకు వర్షమాధారము. కాన చాల ప్రాచీనకాలమున వర్షర్తువుతో సంవత్సరాది యైయుండును. కావున వర్షపదము సంవత్సరార్థకముగా వాడుకలోనికి వచ్చియుండును.

క్రొత్త పంటలతో ఆగ్రయణేష్టి. పిదప నిటులు యజ్ఞములకును, సంవత్సరాదికిని సన్నిహితసంబంధ మొదవియుండును. కొన్నియేండ్లకు ఋతువులు భేదించును. అవి వర్షాకాలపు సంవత్సరాదితో నియతములు కావు. అపుడు వారు అయనకాలమును, అనగా విషువద్దినమును సంవత్సరాదిగా గొనియుందురు.

## విషువము

పై క్రాంతివృత్తమునకు అడ్డముగా విషువద్వృత్తము కలదు. ఈరెండును కలియుచోట సూర్యు




[కదంబముల నడుమ క్రాంతివృత్తము. ధ్రువముల నడుమ విషువద్వృత్తము. ధ్రువకదంబముల అంతరము రేఖ ౨౩½°. కదంబ= Pole of the Ecliptic. యామ్యోత్తరవృత్త= Meridian. ద్ర=ద్రష్ట]

17. Conjunction of the Sun and Moon.
18. Luni-Solar year.
19. వేదాంగజ్యోతిషమున ఒకరాశి పదము కలదుగాని అది సముదాయార్థకము. ఖాల్డియావారికిని అట్టి పద మొకటి కలదు.

యుండునాడు ఎల్ల దేశములందును రేబవళ్లు సమానముగా నుండును. ఈ రెంటికిని సంపాతము కలుగుచోటులకు విషువబిందువు లని పేరు. ఇం దొకటి మహావిషువము. సూర్యుడు మహావిషువమును దాటిపోవుదినమే సంవత్సరారంభము.

సాయన మేష తులా స్థానముల విషువద్వృత్తమున సంపాతములును. సాయన మిథునాంతమున దక్షిణాయన రేఖతోడను సాయనధనురంతమున ఉత్తరాయణరేఖతోడను, ఇవి కలిసియుండును. దీనివలన విషువమునుండి యామ్యోత్తర క్రాంతి తెలియవగును. సాయన మేష తులా సంపాతముల యంతరము ౧౩ నక్షత్రములు.

## అయనచలనము

విషువబిందువులు రెండును క్రాంతివృత్తమునందే యుండుటవలన అతిప్రాచీనకాలమునందే ఋషులు నాటికినాటికి చూచి వీని స్థానమును కనుగొనిరి. ఇంతియకాక యివి చలించుచు నున్నవనియు గ్రహించిరి. వీని గతియే అయనచలనము.

ఒకానొకప్పుడు ఈ విషువబిందువుకడ పునర్వసు వుండెను. పిదప మృగశిరా రోహిణీ కృత్తికాశ్వను లన్నటులు వేద పురాణ జ్యోతిష గ్రంథములందు సాక్ష్య మున్నది. ఏటేట విషువబిందువునకు సుమారు ౫౦.౨ అను లెక్క నంగీకరించినయెడల నొక యంశము జరుగుటకు ౭౧ ఏండ్లు పట్టును. ఒక నక్షత్రము జరుగుటకు ౯౫౦ ఏండ్లు. ధ్రువము జరుగుటకు సుమారు వేయేండ్లు. కావున సుమారు తొమ్మిదెనిమిదివేల యేండ్ల నడుమ పునర్వసులో విషువము. ఈ సంగతి చెప్పిన ఐతరేయబ్రాహ్మణము ఆనాటిది. లేక పరంపరాయాతమయిన ఆనాటిమాటను చెప్పినను చెప్పియుండవచ్చును.

తిథినిబట్టియు, కాలమునుబట్టియు నాడును నేడును నక్షత్రమే కాలబోధకము. అప్పుడప్పుడు వచ్చు గ్రహణముగూడ తిథి నంటియే యున్నది. అమ పున్నములందు తప్ప సూర్యచంద్రగ్రహణములు రావు గదా. మరియు విషువమునాడే ఉగాది మాసాది ఋత్వాది యాగాది. నాటి యీ నక్షత్రప్రాధాన్యము శ్రౌతమునందును, స్మార్తమునందును నేటికిని అనువృత్త మగుచునేయున్నది.

తిథికొరకు క్రాంతివిభాగ మావశ్యకమే కాని దానివలన చంద్రుని దైనికగతియు, గ్రహణమును నిక్కచ్చిగా తెలియరావు. కాలగతిచే చంద్రగతిలో మాంద్యవేగముల జూచుచున్నాము. కావున జ్యోతిష గణనమున క్రాంతివృత్త మెక్కు డుపయోగపడెను. కాన దానికంటె కచ్చితమగు కటిబంధ మొకటి కావలసివచ్చెను. అందులకు వారు చూచిచూచి చంద్రుడుగాని, సూర్యుడుకాక అన్యగ్రహములుగాని క్రాంతివృత్తమునకు అటు ౮°, ఇటు ౮° అంశముల మీరకుంటె మిగిలిపోరని గ్రహించి భచక్రము నంతవట్టు పెంచిరి. క్రాంతివృత్తము భచక్రాంతర్గతము. క్రాంతివృత్తమున పండ్రెండవ వంతు రాశి. అనగా రెండుంబాతిక నక్షత్రము. ఒక రాశి ౩౦ అంశలు. సూర్యు డొక రాశిలో నుండు కాలము సౌరమాసము. ఆ రాసు లివి:

| రాశి | మాసము | దినములు |
|---|---|---|
| మేషము | వైశాఖము | ౩౧ |
| వృషభము | జ్యేష్ఠము | ౩౧½ |
| మిథునము | ఆషాఢము | ... |
| కర్కాటకము | శ్రావణము | ... |
| సింహము | భాద్రపదము | ... |
| కన్య | ఆశ్వయుజము | ౩౦½ |
| తుల | కార్తికము | ౩౦ |
| వృశ్చికము | మార్గశిరము | ౨౯½ |
| ధనుస్సు | పౌషము | ౨౯ |
| మకరము | మాఘము | ౨౯ |
| కుంభము | ఫాల్గునము | ౩౦ |
| మీనము | చైత్రము | ౩౧½ |

పై రాసులలో దీర్ఘకాలము ౩౧½ దినములు హ్రస్వకాలము ౨౯ దినములు. మధ్యకాలము ౩౦½ దినములు. దీనికి కారణము ప్రక్కపుటలోని దిగువ చిత్రమున కనబడును. చిత్రమధ్యమున కనబడు సున్న భూకక్ష.

భూమి అ బాటలో తూర్పు చూపు చొప్పున జను చుండును. మన కప్పుడు సూర్యు డొక రాశిలోనుండి మరొక రాశిలోనికి పోవుచున్నటులు కనిపించును.



రాశిచక్రము

సూర్యుడు మేషవృషాదులలో తిరుగుతరి భూమి 'అ' బిందువునుండి 'ఆ' బిందువుకేని నడచును. అప్పుడు సూర్యునకును, భూమికిని దూర మెక్కుడగును. దాన భూగమనము మృదు వగును. మన కప్పుడు భూగమనము బట్టి సూర్యగమనము మృదు వయినటులు కనబడును. భూమి 'ఇ' బిందువుకడకు తిరిగివచ్చుడు సూర్యుడు దాపగును. దాన భూమిగతిలో తొందర పుట్టును. అప్పుడు సూర్యుడు ధనుర్మకరములలో వడిగా పోవుచున్నటులు మన కగపడును.

ఈ రీతిగా సౌరమాసవ్యవస్థ యెప్పు డేర్పాటాయెను? అనగా రాశిచక్ర మెప్పు డేర్పాటాయెను? నక్షత్రచక్రములో రాశిచక్రమునకు ఐక్యము కలిగించుటకు వరాహమిహిరుడు అశ్విన్యాదిని, మేషాదిని సంకలనము చేసినటులు గ్రంథసాక్ష్యము కలదు. కావున క్రీ. శ. ౬ వ శతాబ్దిలో రాశిచక్ర మేర్పాటాయెనని పలువురు వ్రాసిరి.

అటులగుచో క్రీ. పూ. 3 వ శతాబ్దిలో రచితము (ఈ కాలనిర్ణయము వారిదే) రామాయణమున కనబడు రాశిమాట యేమి? గర్గపరాశర సంహితల రాశిమాట యేమి? శ్రీ బాలకృష్ణదీక్షితుల వారే అది ప్రక్షిప్తమనిరి. కొందరు ప్రాచీనులుగూడ రాశిచక్రము అన్యదేశ్యమని అనిరి. ఇది అంగీకరించినచో ఋగ్వేదమునందలి అధిమాసముగూడ ప్రక్షిప్తమని ఏల యనరు? కావున వ్యతిరేకప్రమాణము దొరకనంతవరకును రాశిచక్రము ఋగృషులకు తెలియునని అనుకొనవలయును. దీని నింకను ప్రాజ్ఞులు పరిశీలింతురుగాక.





# పుణ్యస్మరణ

శ్రీ కపిల కాశీపతి

చైత్రశుద్ధద్వాదశి శ్రీ దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు లింగైక్యమును పొందిన రోజు. ప్రతిసంవత్సరం ఆరోజున కీర్తిశేషులైన ఆ పుణ్యమూర్తిని స్మరించి, వారి ఆత్మశాంతికోసం ప్రార్థించడం హిందూసంప్రదాయప్రకారం బంధువుల ధర్మం. నాగేశ్వరరావుపంతులుగారు ఆంధ్రులందరికీ ఆత్మబంధువు. ఆకలివేళ అన్నం పెట్టిన వారిని "అన్నదాతా సుఖీ భవ" అని దీవించడం మన పద్ధతి. నాగేశ్వరరావుపంతులుగారు కేవలం అన్నదాతమాత్రమే కాదు. ఆయన విశ్వదాత; సంపూర్ణదాత; మాంధాత. అందుచేత ఆ రోజున ఆయనపుణ్యస్మృతి, ఆయన సేవాస్తుతి చేసుకోవడం తెలుగువారి విధ్యుక్తధర్మం.

* * * *

"ఆంధ్రమహాపురుషులలో ఆయన ఒకడు" అని వ్రాస్తే దేశచరిత్రలో ఆయన స్థానం వీలైనంత పేలవంగా వర్ణించినట్లు. పోయిన పదిసంవత్సరాలలోనూ, తత్పూర్వం పాతికసంవత్సరాలలోనూ, ఎందరెందరో కవులు, వ్రాయసగాండ్రు, వక్తలు, భట్రాజులు, ఆశ్రితులు, అర్థులు నాగేశ్వరరావుపంతులుగారి సుగుణాలు పద్యాలలో వర్ణించారు; వ్యాసాలలో విపులీకరించారు; వేదికలమీద ఉద్ఘాటించారు; సభలలో పొగడ్తలుచేశారు; దేశంలో

ప్రచారంచేశారు; అన్నిచోట్లా చెప్పుకున్నారు. ఆ వాఙ్మయమహోదధిని మించి పోవడం సామాన్యులకు సాధ్యంకాని పని.

కానైతే పంతులుగారిని "ఆంధ్రమహాపురుషుడు"అనడంలో లౌకికంగా ఏో విశిష్టత వుంది. తన సూక్ష్మబుద్ధివల్ల సాధించిన ఒక సర్వబాధానివారిణిద్వారా లోకప్రజల నొప్పులు బాపి, తద్వారా దేశదేశాలనించి తనను చేరే స్వర్ణప్రవాహం నిశ్శంకగా ఆంధ్రాభ్యుదయానికి ప్రయోజనం చేసిన ఆయనగాక ఆంధ్రమహాపురుషులు మరెవ్వరు? అది స్థూలదృష్టిలో వారి గొప్పదాతృత్వానికి తార్కాణ. ఆవిధంగా చూసినట్టయితే దేశసేవాపీఠులలో, తన్నుమాలిన ధర్మం చేసి, తమ సర్వస్వం బలిదానం చేసి, భస్మీభూతులైనవారున్నారు. అటువంటి దానం రెండుమూడుతరాల తర్వాత ప్రజాస్మృతిలో వుండదు. చరిత్రలో స్థానం అందుకోదు. తత్కారణంగా దూరదృష్టిలో పంతులుగారి లౌకికదాతృత్వం కించిద్విషయం.

నాకు చూడగా నాగేశ్వర రావు పంతులుగారు జ్ఞానదాతగా దేశచరిత్రలో కలకాలం నిలిచిపోతారు. అటువంటి స్థానమే చరిత్రలో ఆశించతగినది; మహోత్కృష్టమైనది.

* * * *

ఆంధ్రదేశచరిత్ర యావత్తూ మనకు లభించే మంచిరోజు లింకా రాలేదు. మన దేశ, భాష, జాతి శబ్ద నిర్ణయంలోనే మంత్రశాస్త్రజ్ఞుల మాట కలవని ఈ సంధికాలంలో సర్వాంధ్ర సమగ్రచరిత్ర లభించక పోవడంలో ఆశ్చర్యం లేదు.

సాహిత్యరీత్యా పరిశీలించినట్లయితే మన చరిత్ర చోళచాళుక్య సమ్మేళనంలో క్రీస్తుశకం పదకొండో శతాబ్దంలో ప్రారంభించిందని చెప్పవలసి వస్తుంది. అప్పుడే నన్నయ్య భట్టు భారతాంధ్రీకరణం ప్రారంభించాడు గనుక. తత్పూర్వం వున్న సాహిత్యం మనకు మిగలకుండా పోయిందిగనుక. నీరసించిపోయిన జైన, బౌద్ధమతాలు ఆరామాలలో రసారాధనలో రాగిణీహృదయాంకితాలై, దేశంలో అరాజకం, అవినీతి ప్రబలిననాడు దండబలం, దండుబలం కలిగిన చోళ—చాళుక్య వంశీయులు దాన్ని రూపుమాపి, చివికి జీర్ణించిపోయిన ఆనాటి నాగరికతా నిర్మాణం భగ్గంపాడు చేసి, ఆ పాటి దిబ్బల మీద నవయుగసంస్థాపన చేశారు. ఆ నవయుగంలో మళ్ళీ నీతినియమాలూ, వర్ణాశ్రమ ధర్మాలూ పునరుద్ధరించి విశిష్టమైన వేదమతం పునస్థాపన చెయ్యవలసిన అవసరం కలిగింది. దానికి ప్రజానీకంలో జ్ఞానప్రచారం అవసరం అయింది. దానికోసమే తెనుగు సంప్రదాయ ప్రకారం "అక్షరరమ్యత నాదరింప నానా రుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగున మహాభారత సంహితారచన బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్". అదే ఆంధ్ర విజ్ఞానయుగారంభం. మన చరిత్రలో నన్నయ భట్టారకుడు మొదటి సంఘసంస్కర్త; మొదటి జ్ఞానదాత.

ఆదికావ్యమూ, మహాకావ్యమూ అయిన శ్రీమద్రామాయణం ఆంధ్రీకరించక నన్నయ భట్టారకుడు భారతం ఎందుకు

ప్రారంభించాడా అనే సందేహం మనలో చాలామందికి వుంది. జైన, బౌద్ధ సంప్రదాయాలలో, ఆర్య ధర్మాన్ని ఎదుర్కొని, ప్రజాపరిభాషలోనే భక్తియోగానికి దూరమైన మతవాఙ్మయం చదువ నేర్చి, తాత్కాలికంగా భేదదూరులైన ప్రజానీకానికి రామనామ తారక మంత్రం అంటడానికి వీలులేదు. ఆ నాడు కావలసినది జ్ఞానయోగమే కాని భక్తియోగము కాదు. ఆ జ్ఞానప్రచారానికి లౌకిక ప్రాధాన్యమైన, కలియుగానికి సన్నిహితమైన భారతమే భక్తి ప్రధానమైన రామాయణంకంటే ఎక్కువ ప్రయోజనకారి. ఆ ప్రయోజనం కలిగించి దేశాన్ని ఉద్ధరించిన చరితార్థుడు నన్నయ భట్టారకుడు.

* * * *

వెయ్యిసంవత్సరాలతర్వాత ఆ గోదావరీతీరంలోనే, ఆ రాజమహేంద్రవరంలోనే మరో జ్ఞానయోగి అవతరించినాడు. దేశం చేతులుమారింది. ప్రజలలో పూర్వపు మూఢ నమ్మకాలు నాటుకుపోవడంవల్ల దురాచారాలు ప్రబలి, సంఘం కుళ్ళి, కుసమారి పోయింది. అటు పూర్వసంస్కృతీ లేక; ఇటు ఆధునికవిజ్ఞానమూ లేదు. 'తన శారోగ్యం, తన సౌభాగ్యం'అనే స్వార్థంలో ప్రజలు సంఘనీతిని మరిచిపోయి విచ్చలవిడిగా జంతురీతిని సంచరించిన కాలం అది. అటువంటి సంఘంలో జ్ఞానప్రచారంచేసి అంధకారంలో ఆత్మజ్యోతిని వెలిగించినవాడు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు. సామాన్యుడై జన్మించి, అసామాన్యశక్తులు సాధించి, ఆంధ్రదేశంలో ఆధునికసంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు శ్రీ వీరేశలింగం. ఆయన తన పని యావత్తూ జ్ఞానప్రచారంవల్ల సాధించినాడు. గ్రంథరచనలో, గ్రంథముద్రణలో, గ్రంథాలయ నిర్మాణంలో, విద్యలో, విద్యాప్రచారంలో, విద్యాలయ నిర్మాణంలో, సంఘనీతిలో, సంఘసంస్కార ప్రచారంలో, నూతనసంఘనిర్మాణంలో, సర్వత్రా పునాదివేసిన పుణ్యపురుషుడు శ్రీ వీరేశలింగం. నన్నయతర్వాత ఆయన రెండవ జ్ఞానదాత.

* * * *

ఆ శ్రీ వీరేశలింగం మొదలు శ్రీ నాగేశలింగంవరకూ ఆంధ్రదేశచరిత్రలో అదొక మహాప్రకరణము. వీరేశలింగం పంతులు ప్రారంభించిన జ్ఞానప్రచారం బహుముఖంగా, మహోజ్జ్వలంగా వ్యాపింపజేసిన మహనీయుడు మన నాగేశ్వరరావు పంతులుగారు.

"దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్"

అన్న గురజాడకవివచనం వెలిసింది ఈ ప్రకరణంలోనే. దేశం బాగుపడాలంటే ప్రజలు బాగుపడాలి. ప్రజలు బాగుపడడానికి జ్ఞానోపదేశం కావాలి. ఆ జ్ఞానోపదేశానికి పూర్వం కథలూ, కావ్యాలూ పరికరాలు. ఆధునికయుగంలో పత్రికలు ఆ జ్ఞానప్రచారానికి పట్టుగొమ్మలు. ఈ జ్ఞానప్రచార ప్రాముఖ్యత గ్రహించిన సుప్రసిద్ధాంధ్రుడు శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావు. ఆయన విజ్ఞానచంద్రికలు వెదజల్లి, విజ్ఞానసర్వస్వానికి పునాదివేసినవాడు.

తొల్లింటి ఆమహనీయులు వేసిన ఈ మహాప్రయత్నాలన్నిటికీ గొప్ప పోషకుడై పత్రికాప్రచురణలో బహుముఖవ్యాప్తికి పునాదివేసి, శాశ్వతనిర్మాణం చేసిన శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు ఆంధ్రప్రజానీకానికి మూడవ జ్ఞానదాత.

దేశకాల పరిస్థితుల్ని అనుసరించి మహాపురుషులు అవతరిస్తారు. ఆరీతిని, ఆంధ్రదేశం అంధకారంలో పడిపోయినప్పుడు జ్ఞాన ప్రచారంకోసం అవతరించిన మహాపురుషులు నన్నయభట్టు, వీరేశలింగం పంతులు, నాగేశ్వరరావు పంతులు. వీరు మహావ్యక్తులు. కాదు సంస్థలు.

ఇటువంటి పుణ్యపురుషులు, సేవావ్రతులు నయిన మహానీయులను ఇటువంటి పుణ్యకాలంలో సర్వాత్మనా స్మరించడం ఆంధ్రుల అవశ్యవిధి.





కళాప్రపూర్ణుడు

కీ. శే. శ్రీ కాశీనాథుని-నాగేశ్వరరావుపంతులు.



దేశోద్ధారకుడు

కీ. శే. శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుపంతులు

చిత్రకారుడు : శ్రీ కాశా రామమోహనశాస్త్రి.

# వెలుగు  నీడలు

[కథానిక]

— శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి —

తెల్లవారింది.

బద్ధకంగా లేచాను.

రాత్రి చాలాసేపు నిద్రమేలుకుని వ్రాసిన విక్రమోర్వశీయ పద్యకావ్యపు స్వర్గీయదృశ్యాలు తియ్యని స్వప్నాలల్లే కదిలిస్తున్నాయి.

ఊర్వశి దివ్యసౌందర్యం నా పద్యాల్లోకి కాంతిధారగా ప్రవహించి ఒచ్చినట్టనిపించింది.

పురూరవ చక్రవర్తి మధుర స్నేహసల్లాపాలతో నా కావ్యం పులకరిల్లినట్టు తోచింది.

సుధర్మలో, భరతముని ప్రయోగించే నూతన నాటికలోని నాయికాపాత్ర ధరించి, ఆ అప్సరః సుందరి, స్త్రీరమణీయతాసర్వస్వంగా రంగభూమికి అవతరించినప్పుడు వ్రాసిన ఈ పద్యం...

"రేషనుషాపు తీసే వేళ అయింది. చప్పున కాఫీ పుచ్చుకు వెళతారా! పాపం రాత్రి చాలా సేపు మేలుకున్నారు. ఏం చెయ్యను! తెచ్చుకునే రోజు. తప్పదు"

ఇంద్రసభకు బదులుగా మా చాలీచాలని అద్దె వాటా, నాట్యకళోజ్జ్వలరూపిణి ఊర్వశికి బదులుగా నిత్య సంసారయాత్రలో నలిగే పాతగళ్లచీర బ్రాహ్మణి కనపడేసరికి నా పురూరవచక్రవర్తి హిందూదేశంలో ఒక నాగరిక పట్టణంలోని ఆరో నెంబరు రేషనుషాపు దగ్గరకు నడవలేక చట్టున తప్పుకున్నాడు.

ఎదురుగా కనబడే సిమెంటుకంపెనీ కాలెండరు మీద ౧౯౫౪ సంవత్సరం ౧౭ తారీఖు నా స్తబ్ధజగత్తులో కనబడేసరికి నా ఒళ్ళు దహించుకుపోయింది.

బియ్యం లేదని తెలియగానే ఆకలి ఎక్కువగా ఉంది. అంత దివ్య సౌందర్య ధూయిష్ఠ కళాసంపదను భావనాసంపత్తితో పుడమికి అవలీలగా అవతరింపచేయగల ఆంధ్రకవీశ్వరునకు ఆకలి కలిగిందంటే ఎంత నీచం!

కాని వేస్తోంది!

ఎవరితోనూ అనకండి, బాగుండదు.

మహేంద్రుడుగాని, అమర వేశ్యగాని ఈ కరువు రోజుల్లో నా కట్టిసహాయం చెయ్యలేరని రూఢిగా తెలిశాక మాసిపోయిన కేన్వాస్ సంచీ పుచ్చుకొని కాళ్లీడ్చుకుంటూ బజారుకు నడిచాను.

ఈనాటి కవి నిజస్వరూపం ఎదుట నిలువుటద్దం లేకపోయినా స్ఫుటంగా నా కళ్లల్లో ఆనింది.

రోడ్డు ఎక్కేసరికి జమీందారుగారి కొత్తకారు రయ్యిమని నడిచేవారి కంట్లో దుమ్ముకొట్టి పరిగెత్తింది.

చట్టున కొనుపోల్లో జరగబోయే గౌరవార్థపు టీపార్టీలోని లేనీటీసువాసన నా మెదడుకు తగ్గిలి వికారపెట్టింది.

పట్టణానికి ఒకవైపున చాలీచాలని కొలబద్దెపు బియ్యంకోసం తొక్కిడిపడే దౌర్భాగ్యుల కోలాహలమైతే—ఇంకోవైపున బలిసిన లంచాల చేతులు కమ్మని వెచ్చని పదార్థాలను సమృద్ధిగా సిల్కునోట్ల బొజ్జల్లోకి నెమ్మదిగా జార్చడం గమ్మత్తుగా జ్ఞాపకం వచ్చి నవ్వాను.

రోడ్డుమీద జనప్రవాహం ఏవైపు నడుస్తున్నదో తెలియలేదు.

అప్పుడే రేషనుషాపు తెరిచారు.

అధికారులు పిచ్చితవ్వలతో మట్టిరంగుబియ్యం రూపంలో న్యాయాన్ని పంచుతున్నారు. పవిత్ర ఆరాధన రథయాత్రలో—

చప్పున షాపులోకి చొరబడడానికి వీలులేదు. నరశరీరాల గోడ అప్పటికే బలంగా ఏర్పడిఉంది.

కొంతసేపు గడిచింది. ఉద్వేత్తుగా మానవదేహ భిత్తిక చీటివారి లోపలినుంచి ఒక కలకలం వినపడడం మొదలుపెట్టింది.

మేం ఆశ్చర్యపడి చూస్తున్నాం.

గుమాస్తా కీచుగొంతుకతో అరుస్తున్నాడు. అయిదునిమిషాల తర్వాత కీచుగొంతూ, ఇద్దరు సాఖర్లూ చేతుల్లో శక్తి అయిపోయాదాక బాది ఒక పదార్థాన్ని రోడ్డుమీదికి తెచ్చి విడిచిపెట్టారు.

అది నెమ్మదిగా కదిలి అంటుకున్న రోడ్డుకుమ్ము దుమ్ముదులుపుకుని, ఊడిపోయిన చిరుగుల తలగుడ్డను సవరించుకొని వెనకవాలికలై ముందు మాసికలతో నిండిన చొక్కాతో పాలిపోయిన ముఖంమీద మొహమాటంగా పెరిగిన పేడిగడ్డంతో మాటలు మోసే కూలీగా లేచి నించుంది.

వాడు ఏమీ జరగనట్టు, తగిలిన చోట చేతితో నైనా తడుముకోకుండా ముందుకు నడిచి పక్కతూము మీద కూచున్నాడు.

బియ్యం కొన్నాను. ఇటూ అటూ చూశాను. కష్టమైనవారైతే స్వయంగానే పట్టుకుపోవచ్చు. కాని......

"బాబూ, కూలీ కావాలా ?"

—పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఎంత ?"

"...బేడ"

"పావలా ఇస్తాను. పట్టుకో"

చాలా సహజంగా అన్నాను. కాని—తిన్న దెబ్బలకన్న ఆ మాట పలిపించిదిగాబోలు. సిగ్గుపడి తల వంచుకుని మూట పుచ్చుకున్నాడు.

వెనకనించి అంటున్నారు—

"మంచివాడు దొరికాడు"

"సగం బియ్యం తోవలో తినేస్తాడు"

"పచ్చి దొంగవెధవ"

"ఊరికే తన్నారా గుమాస్తాగారు?"

"ఇంక కూలి ఎందుకు ?"

"ఏం ? బేడ అడిగితే పావలా ఇచ్చే మహాను భావులు దొరికాక..."

"సామ్యవాదులండీ !"

దూరమైన ఇక వినపడలేదు.

"నీ పే రేవరమ్మా"

నడుస్తూ తోచక వేసిన ప్రశ్న.

"సన్నాసండి"

" పద. "

చేతిలో పడ్డ పావలాకాసు చూసి సన్నాసి మొహం మరింత పాలిపోయింది. స్వార్థావరణం చీల్చి నిజమైన మనస్సు తెరచి చూపితే మనుషులు ఎంతదగ్గరకు వస్తారు ! కాని నమ్మం. అదే ఈనాటి నాగరికతలో ఉన్న కీలకం.

మూర్ఖుడు. అనాగరిక ప్రాకృతుడు. వాడికి సనాతన సాంఘికమర్యాద లేమి తెలుసు ?

కొంతసేపటికి సన్నాసిముఖం సంతోషంతో నల్లబడి—పురూరవ పార్వతీముడు కాళీ చేసినచోట వెళ్లి కూర్చుంది.

* * *

సోమవారం సంత.

ఫెళ్ళున సాగుతోంది.

ఇంద్రనీలమణిరాసులవంటి నీటి వంకాయ గుట్టలూ, పచ్చలవంటి బచ్చలికూరస్తూపాలూ, కెంపులవంటి ఉల్లిగడ్డల పర్వతాలూ సాయంకాలపు ఎండ తగిలి మిలమిలా మెరుస్తున్నాయి.

విజయనగర సామ్రాజ్యం ఉచ్ఛదశలో వెలిగేటప్పుడు వర్తకులు రాజవీథిలో రత్నాల రాసులు పోసి పట్టు శాలీసుల కొలతకుని అమ్మడం చూశానని అబ్దుల్ రజాక్ అన్నమాటలు నానాటికి ఆంధ్రదేశంలో సోమ

వారం సంతగా ప్రత్యక్షమైనందుకు సంతోషిస్తూ, మనకు ఏ రకం రత్నాలు ఎన్నిపీశలు కావాలో నిర్ణయించలేక ఆలోచిస్తున్నాను. నిండా అన్నం లేని ప్రజలకు ఇన్ని కూర లెందుకో !

అరటికాయల దుకాణం దగ్గిర ఘొల్లుమని చప్పుడయింది.

తిరిగిచూశాను.

చుట్టూ చేరిన పలుగురు 'పెద్దమనుషుల' మధ్య మా కథానాయకుడు సన్నాసి కనబడ్డాడు. అధికార ముద్ర తగిలినట్టు దవడ ఎర్రగా కందింది.

ఒక కాపుపెద్ద చేత్తో కూరల బరువు మూట పట్టుకుని రెండోచేతితో సన్నాసిని ఒడిసి పట్టుకుని అన్నాడు.

"యెదవలు...కూలిపని చేసుకోరాదూ, దొంగ గడ్డి తినకపోతే...మూట లాగుతున్నాడు. సవట..."

కాలెత్తి, మళ్లా దయదలచి ఊరుకున్నాడు. గాంధీగారి అహింసా సిద్ధాంతం మీద చాలా గౌరవం ఉన్నవాడు !

"తప్పు కాదండీ—లేకపోతే... అడుక్కోవాలి...."

మూకలో ముందున్న పంగనామాల తనుమనిషి. పళ్ళులేని బోసినోటితో దేశంలోని నిరుద్యోగ నిర్మూలన రహస్యం నిమిషంలో పరిష్కరించి ఊరుకున్నాడు.

సన్నాసికి ఊపిరితిరిగింది.

"మూట తెమ్మన్నారా బాబూ! అణాడబ్బు లిప్పించండి. ఇంటికాడికి. అందుకోసమే మూట ముట్టుకుంటే..."

"ఛప్! నోరుముయ్యి. దొంగగాడ్డె ! నాకు నీకూ లెందుకురా ! ఇలాటివి పదిమూటలు పట్టికెళ్ళగలను. బుద్ధిగా బతుకు. తన్నులుతినేవు..." అని వెళ్లిపోయాడు.

"మంచిపని చేశాడు. చూస్తే కూలి, చూడక పోతే నాలి. నాలిముచ్చువెధవలు" ఒక శ్రోత్రియ బ్రాహ్మణోత్తముడు అరటాకుల కొట్టుదగ్గర్నుంచి తన అభిప్రాయం వెల్లడించాడు.

మళ్ళా మామూలుగా జనప్రవాహం సంతలోకి ప్రవహిస్తోంది.

అలజడి క్రమంగా తగ్గింది.

సన్నాసి నెమ్మదిగా ఏదో కాలికింద గుచ్చుకున్నట్టుగా ఒంగి ఇందాకటి ఘర్షణలో పెద్దకాపు రొంటినుంచి జారగా ఇంతవరకూ ఎడంకాలి బొటన వేలితో తొక్కిపెట్టిన వస్తువును పదిలంగా తీసి బజార్లో నల్లమందుకొట్టువైపు చరచరా నడిచాడు.

* * *

సిరావర్షంలా చీకటి అలముకుంది.

రాత్రి పదిగంటలు దాటింది.

మబ్బుగా ఉంది.

చలిగాలి చెలరేగింది.

వెచ్చని అన్నం తిని ఇనప్పెట్టెలలాంటి గదుల్లో కాశ్మీరశాలువల్లోకి కమనీయగాథల్లోకి వెళ్ళిపోయే వారికి ఆరాత్రి ఎంత వరప్రసాదం ! ఒక్క చలిరాత్రి చల్లారిపోయే ఎన్నిగుండెల్ని జ్వలింపజేస్తుంది !

సంతపాకలు తప్ప ఊరంతా, ఒత్తిగిలడానికి కూడా బద్ధకంగా నిద్రపోతోంది.

పగలంతా బైరాగివేషంతో తిరిగే ముసలిజంగం పాతపడవ ఒక రేవుకు చేరినట్టు సంతపాకల్లో ఒకమూల చేరి కొంతగడ్డి పోగుచేసి మంట వేసి గుడాకుపొగ తాగుతూ దగ్గుతున్నాడు.

చవకరకంకల్లు తాగి రెవరో పడమటియాసలో కీచులాడి తిట్టుకుని నోరు నొప్పెట్టి సంతపాకల నాప రాళ్ల మీద ఒరిగారు.

అక్కడికి కొంతదూరంలో చింతచెట్టుకింద బసచేసిన ఎఱుకల కుటుంబంలోంచి ఎఱుకలపిల్ల నీలాలు చట్టున మెళుకువ ఒచ్చి కూచుంది. అన్ని ముష్టికుటుంబాలూ ఒళ్లు తెలియకుండా నిద్రపోతున్నాయి. ఎటు చూచినా కారుచీకటి రాత్రి. పక్కని కలవిరబోసుకున్న దెయ్యంలా పెద్ద చింతచెట్టు.

భయమేసింది.

తల్లిని లేపుదా మని ఊరుకుంది.

"భయంమాట కేంగాని, ఈ చీకటిరాత్రులు పడుచుమనస్సులకి ఎంత సరదాగా ఉంటాయి!" అనుకుంది నీలాలు, గొంతుగా కూచుని నిద్రలో చెదిరిన జుట్టు ఎగదోసుకుంటూ.

సందేళ తాగిన గంజి ఉడుకు చల్లారిపోయింది. ఆకలి మండిపోతున్నది.

పడుచుపిల్లకు చారెడు గంజినీళ్ల బలం ఎంత సేపు?

చలిగాలి రివ్వున కొట్టింది.

లేతాకులా గజగజలాడి ఒళ్లంతా కప్పని గుడ్డతో కాయాన్ని కప్పబోయింది.

రెండుచేతుల్నీ బలంగా 'ఇంటూ'గుర్తులా చేసి గుండెలకు అదుముకుంది.

మెఱుపు మెరిసింది.

ఆకలి భగ్గుమంది.

లేచి నించుంది.

ఎదురుగా మంచంమిఠాయి పెట్టెకొట్లు కనబడుతున్నాయి.

మూసిఉన్న కొట్టులోంచి మిఠాయి ఎల్లా ఒస్తుంది!

ఏమో ?

ఆకలిగా ఉంది మరి—

నవ్వింది.

నున్నని నల్లకానపురాయిలా నిగనిగలాడే ముఖంలో పళ్లు మెరిశాయి.

అడవిలో ముళ్లపొదలమీద అడవిమల్లెపూలు జ్ఞాపకంవస్తాయి. ఎవరు చూశారు!

చుక్కలు లేని ఆకాశం నిగ్గుపడింది.

పెట్టెకొట్టు అడుగున ఏ బల్లైనా ఒదులుగా ఉండగూడదూ!

"దొరికితే చంపేస్తారు"

"ఈ ఆకలి బతకనిస్తోందా!"

"అది మొగోళ్ల పని"

మొగా డనగానే నవ్వొచ్చింది.

"ఆకలికి మొగా...ఆడా ఉందా!"

ఒక మొగాడు ఎట్లాగో తంటాలుపడి కొట్టు బద్దలుకొట్టి 'ఇదిగో మిఠాయి' అంటే ఎంత బాగుండును అనుకుంది.

కొట్టుపక్క ఏదో నీడ కదిలింది. గుండెలు పట్టు జారిన ట్టనిపించింది. మనస్సు కూడదీసుకుని కొట్టు పక్క నక్కి కూచుంది.

రెండు నిమిషాలు నిశ్శబ్దం.

కొట్టు వెనక బల్ల ఊడలాగుతున్నట్టు వినపడి ప్రాణం కుదటపడి మెల్లగా అక్కడికి మోకాళ్లమీద పాకి తలదూర్చింది.

నీడ పారిపోయింది.

నీలాలు నాలిక కరుచుకుంది.

నోటిదగ్గర కూడు జారిపోయిందని విచారించింది.

నిటార్గా నించుని చూడగా వెనకతట్టు ఒక బల్ల సగం ఊడిఉందిగాని ఒక మేకు పట్టుమాత్రం ఎక్కువగా ఉంది.

బలంకొద్దీ బల్లను గుంజి లాగింది. కదల్లేదు. ఒక కాలితో అడుగుభాగం తన్నిపెట్టి పెకలించింది. బల్ల చప్పున ఊడి నీలాలు తూలి వెనక్కు పడిపోయింది. నీడ రెండు చేతులూ చాపి పట్టుకొని నించోబెట్టింది. చెమటపట్టిన చల్లని వెన్ను మీద వెచ్చని చేతులు బిగువుగా అనుకునేసరికి ఆ స్పర్శతో ఒక విశ్వరహస్యం అర్థమై పోయినట్టు తోచింది ఇద్దరికీ.

నీరసంతో అంతవరకూ చురుకుగా కదలలేని రెండు చేతులూ కొత్తగా చిగిర్చినట్టు పని చేస్తున్నాయి.

నీడ మెల్లిగా లోపలికి దూరి చీకట్లో వెదికి ఒక చేరుసెనగ నూనె మిఠాయిజంగిడీ పట్టుకుంది.

నీలాలు సాయంచేసి ఇవతలికి లాగింది.

కొన్ని లోపలికి జారిపోయినా జంగిడీతో కొన్ని వచ్చాయి.

నీలాలు జంగిడీతో కలిపి తినేసేటంత ఆకలితో ఉంది. నీడకు ఇద్దర్నీ కలిపి తిందామని ఉంది.

"కూకో, తినేసిపోదాం. మళ్లా మోతెందుకు!"

"సాల్లే. ఎవరన్నా చూస్తే పక్కలిరుగుతాయి."

"ఈ రోజువ్వారసే ఇల్లా ఉంది."

"వెంగళన్నాసికే ఇంత పికర్లైతే...ఇక ఆడోళ్ళకంతా కూడే..."

"అసి...నీవంటేఁ..నీలీ! కనిపెట్టేశావ్."

"ఓరి...నీవంట్రా! పోల్చేశావు!"

"పదూ...నాన్నక..."

ఇటూ అటూ చూసి నీలాలు కర్రపళ్లెం చేతిలో పెట్టింది.

"తూరుపెంపుపాకకాడ ఎవరూ సేరు. అక్కడికి పోదాం"

నడుస్తున్నాడు.

పక్కదుకాణంబడ్డీమీద మనిషి కదిలినట్టయింది. కుక్క బొంయిమంది.

వన్నాసి చెంగున మురుక్కాలవ దాటి పరిగెత్తిపోయాడు. కాలు జారి మిఠాయి జంగిడి కాలవలో పడిపోయింది.

ఇద్దరూ పరిగెత్తి తూరుపువైపు సంతపాకదగ్గిరికి రొజుకుంటూ చేరారు.

మెల్లగా మెంగవాడు అరుగెక్కి నిరాశగా ఒకమూల ఇరికి కూచున్నాడు.

నీలాలు వెళ్లి దగ్గరగా కూచుంది.

ఏమి మాటాడాలో ఇద్దరికీ తెలియటలేదు.

వన్నాసి నీరసంగా తలగుడ్డ నేలమీద పరిచి ఒరుగుతూ అన్నాడు: "ఒట్టి అలుపు మిగిలింది..."

"నీ కరమ్మ"

అద్వైతసారం ఒంటబట్టిన వేదాంతిలా నీలాలు వెటకారంగా నవ్వి వాడి బుజంమీద కొట్టింది.

నీలాలకళ్లు ఆ కటిక చీకట్లో తెల్లనిప్పుల్లా మెరిశాయి.

"ఈయేల కింతే పెట్టిపుట్టాం"

'ఉపనిషన్మథను'వొలికిన చోట పుట్టిన వాడు పలికాడు.

కాని వేదాంతికి కడుపు కుందుకోంది. కన్నులు ఎంత నులిమినా మూతపడడం లేదు.

"మిటాయీ పోయి ఎర్రియేదాంతం మిగిలిందిరా మనకి" అని మరింత దగ్గిరిగా జరిగి, దాచిన ఒక్క మిఠాయిఉండ రెండుముక్కలు చేసి ఒకటి వాడిచేతిలో పెట్టి తనొకటి తిని కూచుంది.

చిటపట చినుకులు ప్రారంభించి టిన్ రేకు దారుణంగా ధ్వనిస్తోంది.

చలిగాలి రివ్వున కొట్టింది.

నీలాలు మాటాడకుండా ఒణికింది.

వర్షం ముదిరిపోతోంది.

వన్నాసి మూలిగి, జల్లుకొట్టని పెంపుకి పక్క మార్చి బద్ధకంగా కళ్ళు మూసుకున్నాడు. తగినంత గుడ్డ లేని వెచ్చని వక్షస్థలం చుర్రున తన బుజానికి తగిలే సరికి మానవుడి తరతరాల నాటి ఉష్ణవాంఛలలో ఒక్కసారిగా వాడి మనస్సు అంటుకుంది.

తన ఒంటిమీది గాయాలను ఒక్కటొక్కటిగా మృదువుగా తాకే మెత్తని రెండు చేతులనూ తీసి కళ్ల కద్దుకున్నాడు.

బుద్ధి ఎరిగినప్పటినుంచీ ఈసడింపులూ, అవమానాలూ మాత్రమే చూసినవాడి గాజుకళ్ళు తలవని తలంపుగా చెమ్మగిల్లాయి.

వాన కురుస్తూనే ఉంది.

మళ్ళా తెల్లవారుతుందని, ఆ చల్లని చీకటిరాత్రి దయతో వాళ్ళకు జ్ఞాపకం చెయ్యడం మానేసింది.

---



భారతీయులచే భారతదేశములో ప్రప్రథమముగా తయారు చేయబడిన 'జలఉష' అనే 8000 టన్నుల నౌక మార్చి 14-వ తేదీ నాడు విశాఖపట్టణములో నెహ్రూ గారి ఆధ్వర్యమున మొట్టమొదటిసారిగా జల ప్రవేశము చేసిన దృశ్యము.

# అయినసంబంధాలు

[కథానిక]

## శ్రీ రా. సి. అంజనేయశాస్త్రి

"అడ్డిగదీ! ఆ మాటంటేనే అరికాలిమంట నెత్తికెక్కుతుంది" అనే గర్జనవల్ల నుంచునే కునికిపాట్లు పడుతున్న నేను ఉలిక్కిపడి కళ్లు తెరిచాను. గూడూరు దాటిందల్లే వుంది రెయిలు. చీకట్లను కావిలించుకొస్తున్న చలిగాలి రైలుపెట్టెకిటికీ దగ్గరే నా చూపుల్ని అరికట్టింది. దానికి తల ఒగ్గి రెప్ప వాల్చి, ఒకక్షణం ఆగి మళ్లీ చూసేసరికి, దూరాన గుట్టల మీద తపస్సుని తలపాగాచుట్టుకు కూర్చున్న అడవి చెట్లతో సరసాలాడుతున్న మిణుగురులూ, "మేమూ వాటితోబాటు సరసాలాడుతాం" అంటూ తగుదునమ్మా అని యింజనుగొట్టంలోంచి బయలుదేరి దారిలోనే ఆరిపోతున్న రవ్వలూ కనిపించాయి. ఒంటికాలిమీద నుంచుని తపస్సుచేసే యోగిలాగా యిందాకటినుంచీ కుడికాలుమాత్రమే కింద ఆన్చగలిగా. పక్కవాళ్లని బతిమాలి కాలు మార్చుకుని, గాలి చెవుల్లోకి పోకుండా ఉత్తరీయం చెవులమీది కొచ్చేట్టు చుట్టుకుంటుంటే, కొంచెం మోటగానే, నా ఎడంచెయ్యి పట్టుకుని లాగుతూ "మీరు చెప్పండి స్వామీ, పెద్దమనుష్యులు... నే వియ్యనంటే పిల్లని, చెప్పుతీసుకు కొట్టండి. ఒప్పుకుంటా..." అన్నాడా మీసాల ఆసామీ. యాభై అయిదు ఏళ్లున్నా మంచి బలంగా కనిపిస్తున్నాడు. కొంచెంబొద్దు. గుబురుమీసంలో వెండితీగల్లాంటి తెల్లవెంట్రుకలు వింత సోయగాన్ని చేకూరుస్తున్నాయి. అవతలాయన వయస్సు కొంచెం తరుగే కాని, మనిషి పీలగా వుండటంచేతా, నుదురు ముడతలు పడటంచేతా ముదురుగానే కనిపిస్తాడు.

"కట్టె విరిచినట్లు చెప్పాలా ఏమిటి నా పిల్లనియ్యనని?... క్రియ కాస్తా చేసి గప్‌చిప్‌గా కూర్చున్నావు... ఏమంటారు బాబూ!... అప్పుడెనిమిటిగదా వచ్చింది... అదేనా ఆయనకి చెప్పాల్సినమాట!..." అంటూ ఆ పీలమనిషికూడా నాతీర్పును కోరుతూ, నా మొహంలోకి చూశాడు. అసలు వాళ్ల తగాదాలూ, జరిగిన మాటామంతీ సమస్తమూ నాకు తెలుసునన్నే ధోరణిలో వాళ్లు మాట్లాడుతుంటే, నేను కాస్త ఉక్కిరిబిక్కిరై "మాది యీ వేపు కాదు. ఉత్తరాది. మీ రెవరో తెలీదే నాకు! అసలు సంగతేమిటి?" అన్నా, కునికిపాట్లకిక అవకాశం ఉండదని గ్రహించి.

"ఉత్తరాదయితేనేం? దక్షిణాదయితే నేమండి? ... నూటిగా పోయి, నూటిగా వచ్చేవాడికి ఎక్కడైనా, రెండూ రెండూ నాలుగే!..." అన్నాడు మీసాలాసామీ... నేను నూటిగాపోయి నూటిగారానివాడినా ఆయనఉద్దేశం? పెదిమె కదపబోయేసరికి మళ్లా పీలమనిషి అందుకున్నాడు- "మాకుమటుకు మీ రెవరో తెలుసా? ఏమిటి?... మీరు పెద్దమనుష్యులుకదా అని చెబుతున్నా..." నంటూ. అవును. దాంట్లో సందేహమేముంది? హైస్కూలు టీచరునేగా నేను?... పీలమనిషే యింకా సాగిస్తున్నాడు: "మా పెద్దన్నయ్య లేడుటండీ!... అదేతే!... సవతితల్లిబిడ్డన్న మాట!... మా నాన్న రెండో పెళ్లి చేసుకున్నాడుగదూ మరి? అదీ లెక్క... ఆ అన్నయ్యకి ఇదిగో యీయనగారి అప్పనిచ్చారు" అంటూ "ఈపాటిసంగతికూడా మీకు తెలీదూ?" అనే అర్థం వచ్చేట్టు నాకేసి చూశాడు.

"కాదన్నానా నేనుమటుకు?" అన్నాడు బిగ్గరగా మీసాలాసామీ చుట్ట ముట్టిస్తూ. వినక తప్పేట్టు కనిపించలేదు నాకు. మళ్లీ కాలు మార్చుకుందామని ప్రయత్నిస్తుంటే పీలమనిషి మరికాస్త

ఒత్తిగిలి నా రెండుకాళ్లూ కింద ఆనేటట్టు సౌకర్యం కలగజేశాడు. నేను తాపీగా నుంచుని "అయితే తగాదా ఏమిటీ?" అన్నాను.

"అబ్బే! తగాదా ఏముందండీ! వడ్లగింజలో బియ్యపుగింజ... నేనూ, మాఅప్పామటగా వుంచండి... అది పరాయిఅమ్మ కన్నబిడ్డేగదా, పెళ్లి దాన్నడగండి... మేనరికం యిద్దామనుకున్నామా లేదో!... లేదన మనండి... మీసం గొరిగించి..." అని మీసాలాసామీ ఏదో అనబోతుంటే, అర్థోక్తిలోనే పీలమనిషి "త... యివాళ గొరిగిస్తే, రేపిపాటికి మొలుచుకొస్తుంది—" అనేశాడు తేలిగ్గా. మీసాలాయనకి చర్రుమంది. "అబద్ధాలూ, సుబద్ధాలూ ఆడి, నేను ఊళ్లో నలుగురిదీ పోగేసుకోలేదు." అన్నాడు. పీలమనిషికి అదెక్కడ పొడుచుకుందో ఏమో "ఆఁ...ఎందరిది పోగేసుకోక పోతే, నీకు, పదారాల కొం డ్రెక్క వొచ్చి పడిం దేమిటి?" అన్నాడు.

"అలా పోగేసుకున్నావుకనకనే, ఎక్కడికక్కడ ఊడ్చిపెట్టుకుపోయింది" అని దులిపాడు మీసాలాసామీ.

"ఆఁ... యిల్లలకగానే పండగైందిలేస్తూ?... నీది మాత్రం నిలిచేడిసేదా? అగూ, నాలుగుకాలాలపాటు!" అని అక్కసు తీర్చుకున్నాడు పీలమనిషి...

"తనకి లేదని ఏడిచినందుకు ఒక కన్ను పోయిందట. ఎదటివాడికి వున్నదని ఏడ్చినందుకు యింకోకన్ను పోయిందట—" అంటూ అలంకారాల్లోకి దిగాడు మీసాలాసామీ... నా కంఠుకోకతప్పలేదు.

"అది కాదయ్యా, అసలుతగాదా విడిచిపెట్టి దీంట్లోకి దిగారేమిటీ?" అని నేననేసరికి "అలా గడ్డి పెట్టండి వాడికి" అని యిద్దరూ ఒకేసారి అన్నారు. నేను నవ్వటం కనిపెట్టి, పీలమనిషే గుక్కతిప్పుకుని "మాట తీయగా మాట ఒస్తుంది బాబూ... మాఅన్నయ్య సంసారం యిప్పుడు కొంచెం చితికే వుందనుకోండి... అయితేమటుకు..."అని ఏదో చెప్పబోతుంటే...

"అఁ... ఒకప్పుడుమటుకు యింత తేసీపెయ్యవట్టుం దేమిటి యిప్పుడు చితకటానికి?" అని మీసాలాసామీ సమిధవేశాడు.

"నువ్వూరుకో బావా కాస్సేపు... నేను చెప్పేదాకా!... మీనాన్న కాళ్లా వేళ్లా పడితేనే ఒప్పుకున్నాం తెలుసా?..."అంటూ నావేపు తిరిగి "అదండీ విషయం... మాఅన్నయ్యకొడుక్కి పెళ్లీడొచ్చింది... ఇదిగో యీయనగారి దగ్గర యీడైన పిల్లలున్నారు." అన్నాడు పీలమనిషి...

"కాదన్నానా నేనుమటుకు?" అని పొగాకు గుక్క పీల్చాడు మీసాలాసామీ.

పీలమనిషి సాగించాడు కథ: "అసలైతే నేమైందీ...? నేనూ, మాఅన్నయ్యా స్వయంగా వెళ్లి 'బావా, బావా, మీ అమ్మాయిని మన అబ్బాయికియ్యి' అని అడిగాం... నోరు చేసుకుని... తప్పేమన్నా వుందా బాబూ?..."అని ఆగాడు.

"అబ్బే! ఎవరంటారయ్యా?..."అన్నా నేను.

"కాదన్నానా నేనుమటుకు?" అని మామూలు పదం వేస్తూనేవున్నాడు మీసాలాసామీ...

"మావాడికేం పిల్ల దొరక్క కాదు...వాళ్లింటి కెళ్లింది...ఏదో అయినసంబంధం. మేనరికం ప్రధానమంటారూ...ఒక పేగులోంచి ఒచ్చారూ అనే అనుబంధంవల్ల కాదూ 'దేహి!' అని అనగటం?...అసలు ఆ పిల్లకలవాడు కాదటండీ...'ఇదిగో నబ్బాయి.. నా పిల్లని నువ్వు చేసుకోవాలి' అని అడగాల్సింది?..."అని నాఅభిప్రాయంకోసం ఒక్కక్షణం ఆగాడు పీలమనిషి...

"ఏమో! నేనే అడిగేవాడినేమో! ఓపికపట్టలేకపోయారూ?..." అంటూ మీసాలాసామీ సమాధానంగా ప్రశ్నించాడు. నా అభిప్రాయం ప్రకటించాల్సిన అవసరం కలగలేదు.

"ఎందుకు లేవయ్యా కబుర్లూ?...లచ్చుతూ, రుక్కుతూ పరాయిసంబంధాలు చెయ్యలేదూ నువ్వు?...వాళ్లుమటుకు యీడుకాదూ పెద్దబ్బాయికి? మళ్లీ నరసుకి కూడా అక్కడా అక్కడా విచారిస్తున్నట్లు తెలుస్తోందయ్యో..." అన్నాడు పీలమనిషి.

ఇంత మాటిగా దెబ్బతగుల్తుందని మీసాలాసామీ అనుకోలేదు. కాస్త నీళ్లు నమిలి "అ...మాఘబహుళంలో లచ్చుపెళ్లయిందో లేదో...ఫాల్గుణశుద్ధంలో

మీరు ధూమాయిపెళ్లి చేసేశారయ్యో...ముందే విచారించి వుంచుకోక పోతే ఇట్టే చెయ్యగలిగేవారా?" అన్నాడు.

"ఆఁ!...చెయ్యక, బ్రహ్మచారిగా వుంచుతా రనుకున్నావేం?...ఆడపిల్లలు దొరక్కపోరు...ఏదో శాస్త్రం చెప్పినట్లు, ఏ ట్రాంత కాగంత ..." అని అంటూ దెబ్బతీశాడు పీలమనిషి...చప్పున మీసాలాసామి అందుకుని "మరే! మొగపిల్లలే కరువయ్యారు..." అన్నాడు ఎకసక్కెంగా...

"ఎవరి కెవరూ కరువుకాలేదు...కాకపోతే, మేనరికాలూ, అయినసంబంధాలూ కంటి కానటం లేదు. ఇంతకీ, బాబూ, వెయ్యి చెప్పండి, లక్ష చెప్పండి...రోజు లెలా వున్నాయి?...'కాసులు గల వాడే రాజు'అని...కులం గోత్రం, తనా మనా ఎవరి క్కావాలి బాబూ? ఏదో బాలసురాళ్లు కనిపిస్తున్నాయి ఆయనకని....మొదట్లోనే మనవిచేశాగా. మా పెద్దన్నయ్యసంసారం కాస్త చితికిందని...ఈయన గారి కళ్ల కానలేదు. పరాయిసంబంధాలు చేశాడు... అంతే" అని తేల్చేశాడు పీలమనిషి.

"అద్దిగదీ! ఆమా టంటేనే అరికాలిమంట నెత్తి కెక్కుతుంది. నేనేం యివ్వనన్నానా పిల్లని?" అని కళ్లెర్రజేశాడు మీసాలాసామి.

"అనా లేమిటయ్యా వెధ? క్రియకాస్తా చేసి కూర్చున్నావ్!" అన్నాడు పీలమనిషి...నవ్వుగా.

సగంకాలిన చుట్ట కిటికీలోంచి పారేసి,యిందాకటినుంచీ జాగ్రత్తగానే వింటూన్నా, యింకా జాగ్రత్తగా వినాల్సిందన్నట్టుగా, నా జబ్బ పట్టుకుని ఊపుతూ "బాబూ, అంతా బాగానే వుందిగాని..., కట్నం ఎంత యిస్తావని నిక్కచ్చిచెయ్యడం ఎందుకండీ నన్ను—ఎవరో పరాయివాణ్ని అడిగినట్టు?" అని కోరగా చూశాడు మీసాలాయన, పీలమనిషి వంక...

ఆయన తల వంచుకునే... "ఆ ప్రసంగం తెచ్చింది నేను...మాఅన్నయ్య కట్నంమాట ఎత్తనే లేదు...ఏదో మాటవరసకి నేనే..." అని నీళ్లు నమిలాడు...

"నువ్వడిగితే ఒకటీ, మీఅన్నయ్య అడిగితే ఒకటీనా? రాయబారాని కొచ్చి నిజం చెప్పొద్దూ? కట్నంమా టడిగేసరికి నగలమాట నే నెత్తాను. 'అబ్బాయే నగ'లని వాళ్లంటే 'అమ్మాయే కట్న'మని నే నన్నాను. 'కట్నం నిక్కచ్చి చేస్తే అమ్మాయి మీకు దక్క' దని నాపక్కనే వున్న మాపింతల్లి కొడుకన్నాడు...'అయితే యిదంతా నా కెందు కొచ్చింది. మీ అక్కయ్యనే పంపుతా'నని మా బావ అన్నాడు. 'సరే'నని నేనన్నా...మళ్లీ అది ఒస్తే ఒట్టు"అని విజయగర్వంతో చూశాడు మీసాలాయన.

"ఆఁ...లేదనిపించుకుంటానికి రావడ మెందుకని ఆవిడగా రూరుకుంది". అన్నాడు పీలమనిషి.

"అదేంమాట? లేదనిపించుకునేదో, వుందనిపించుకునేదో?...నేనుమటుకు నాబిడ్డకి పెట్టుకోనుటండీ? నిక్కచ్చిచేస్తే నాకు పట్టింపు ఒచ్చింది కాని?...పోనీ, నేను పెట్టకపోతే, తల్లి వూరుకుంటుందా? అదీ వూరుకుంటేమటుకు, 'అప్పగార్లతో పాటు పెట్ట'మని తన్ని తీసుకోదూ చెల్లెలుమాత్రం?" అంటూ నోరు కట్టేశాడు మీసాలాసామి.

పీలమనిషి విసుగ్గా "ఎందుకొచ్చిన కబుర్లండీ! మేనల్లుడి కివ్వాలనే వుంటే, వెళ్ళి 'ఒసే, అక్కయ్యా... యిలా ముడెయ్యాలనుందే' అంటే, మావదినెగా రొద్దంటుందండీ?..." అన్నాడు.

"నేనొచ్చి అడగాలేం? అదే ఎందుకు రారాదు!" అని ప్రశ్నించాడు మీసాలాసామి.

"ఆవిడమాత్రం నువ్వు పుట్టినట్లు పుట్టలా? నీకెంత టెక్కో ఆవిడకీ అంతే!"...అని సమాధానం చేశాడు పీలమనిషి యిద్దర్నీ.

"ఆఁ...మంచిమాటన్నావు...ఆడకూతురికే అంత యిదయితే, మొగముండాకొడుకుని నా కెంత నిక్కుండచ్చు బాబూ,...న్యాయం చెప్పండి..."అని మీసం మీద చెయ్యేశాడు మీసాలాసామి.

"అవునవును...అలాగే వుంది కాలం..."అన్నా నేను.

"ఇంతకీ రాసిపెట్టలేదు..."అన్నారు యిద్దరూ ఒక్కమాటుగానే. ఈవిషయంలో యిద్దరూ ఏకీభవించారు.

"ఎవరి కెక్కడ నీళ్లు ప్రాప్తో!" అంటూ, ఎదట బల్లమీద కూర్చున్న ఒక ప్రౌఢ పమిట సర్దుకుంది.

"ఏమో లెండి...జానకికి కలవరాదూ,.. గీక వుంటే!..."అన్నాడు మీసాలాసామి...

"అయితే యీడైన మేనల్లు డున్నాడన్న మాట!..."అన్నా నేను...

"ఆఁ...గోపీకేగా ? గోచిపెట్టుకోటంకూడా తెలీని పన్నాసి...పదకొండేళ్లుంటాయి..."అని నసిగాడు పీలమనిషి...

"జానకికి మటుకు మొన్న దీపావళిఅమావాస్యకేగా నాలుగోఏడు వెళ్లింది?..."అని మీసాలాసామి అన్నాడు. ఇంతలోనే యింత మార్పు రావటం నా కాశ్చర్యం వేసింది.

"అయితే, యిందాకటినుంచీ చెప్పిం దెప్పటిమాటేమిటి?..."అన్నా...

బిగ్గరగా నవ్వుతూ మీసాలాసామి"అదే! యిప్పటిసంగ తటండీ;...ఎనిమిదేళ్లొచ్చి తొమ్మిదో ఏడుజొరబడింది. లచ్చూ, రుక్కూ, వరుసా, సుబ్బూ అయింతర్వాత జానకి కడసారి పిల్ల. నలుగురూ కాపరాలు చేస్తున్నారు. పెద్దమ్మాయికి నలుగురుపిల్లలూ,... రెండోదానికి ముగ్గురూ, మూడో అమ్మాయికి ఒకత్తె... యిప్పుడు...నిరుడే పోయాడు ఓకొడుకు పుట్టి... పండల్లే వుండేవాడు...సుబ్బు యీ ఏడే కాపరాని కెళ్లింది..." అంటూ మనుమల సంగతంతా ఏకరువు పెట్టాడు.

పీలమనిషి తన అన్నగారి నలుగురు కొడుకులకీ ఎక్కడెక్కడ సంబంధా లొచ్చాయో, వాళ్ళ కెంద రెందరు పుట్టారో, చచ్చిపోయిం దెవరో, బతికున్నవా ళ్లెందరో తేదీలవారీగా చెప్పాడు.

"నీ కెంతమంది పిల్లలు?" అన్నా నేను. పాపం! పీలమనిషి గద్గదస్వరంతో "ఏం లాభం బాబూ! యిప్పుడొక్కడూ లేడు...ఆ గోపీనే దగ్గరికి తీసుకున్నా" నన్నాడు. నాకూ కష్టం వేసింది...

"నీకూ ఆయన సంబంధ మేనా?..." అన్నా మాట తప్పించటానికి.

"మా పెత్తల్లి కూతుర్నే గదండీ...యీయన కిచ్చింది!" అన్నాడు మీసాలాయన రెండో చుట్ట తయారుచేస్తూను.

"ఏమయితే నేం స్వామీ? ఈ ఎనిమిదేళ్లనుంచీ యీ ఇంటి కాకి ఆయింటిమీద వాలలేదు" అని దిక్కుమొహం వేశాడు పీలమనిషి.

"చచ్చి, కలుపుతున్నాడు..." అని బావురు మన్నాడు మీసాలాసామీ... ఇంతవరకూ అంత కచ్చగానూ, ఆవేశంతోనూ మాట్లాడిన అంతమనిషీ యింతలో అంత దుఃఖించడం నాకు ఆశ్చర్యం కలిగించింది.

"పాపం...మీబావమరిది పోయాడేం? ఒక రోజు ముందో వెనకో, ఎవరికీ తప్పదులెండి" అన్నా ఓదార్చటానికి...

"మరే!... పెద్దదినాని కెడుతున్నాం బాబూ... యీతనూ దార్లో ఒంగోలులో కలిశాడు...మా అప్ప మొహం ఎలా చూడనా అని ఏడుస్తున్నా...సీతాంబ వారల్లే యింత కుంకం బొట్టు పెట్టుకుని...ఎంత ప్రేమను కున్నారు దానికి నేనంటే!...మా బావమటుకు? ఒళ్లు కోసిచ్చేవాడు కాదండీ నాకు!...ఇంతకూ..." అని మళ్లీ బావురుమన్నాడు. వాళ్ళ ప్రకృతులు నా కేమీ అర్థంకాలేదు. చదువుకున్న మనుష్యుల్లో యింత సరళత వుంటుందా అని సందేహిస్తూ కిటికీలోంచి చూసే సరికి తెల్లారొచ్చింది. గబగబా రైలు దిగి "జానకిని మటుకు గోపీకిచ్చి చెయ్యం"డన్నా. "చిత్తం... చిత్తం" అన్నారు యిద్దరూను కళ్ళనీళ్ళు తుడుచు కుంటూ.

దీపాల కాంతిని తోసుకుని చీకట్లోకి చేరిం తర్వాత, కన్నీటి చారికలు గల మీసాలాసామి మొహం ఎదురుగా వచ్చి, "ప్రేమలోగాని, కోపంలో గాని నీ కెప్పుడన్నా యింత తీవ్రానుభూతి కలిగిందీ?" అని ప్రశ్నించింది. ఓటమిని అంగీకరించిన నా హృదయాన్ని ఎడంచేత్తో గట్టిగా పట్టుకుని రిక్షా ఎక్కా.

---

# నే నెఱిగిన గాంధీమహాత్ముడు*

•

= శ్రీ కొండ వెంకటప్పయ్య =

మహాత్మునకు మహాత్మా బిరుదమును పొందక పూర్వమే నేను వారిని దర్శించుటయు, వారు మహాభారములగు కార్యక్రమములను జేపట్టిన పిమ్మట కొన్ని సమయములందు సన్నిహితుడుగ ప్రవర్తించు భాగ్యమును నా కబ్బినందుకు నే నెంతయు గర్వించు చున్నాను. ఒకప్పుడు వారు కాంగ్రెసు మహా సభా సమావేశమందు దక్షిణాఫ్రికాలోని భారతీయులు పడుచున్న కడగండ్లనుగూర్చి నివేదికను చదివి వినిపించు చుండగా వారిని నేను దర్శించితిని. వారి స్వరూపమును చూచుట కదియే ప్రథమము. ఆనాడు వారు ఆంగ్లేయులవలెనే దుష్టులన[illegible]వియుండిరి. కాని వర్ణింపరాని కష్టములకును, అవమానములకును పాత్రులై నిస్సహాయులైన జనుల నుద్ధరించవలె నను దీక్షాపరత్వము అప్పటికే వారి ముఖవిలాసమందు విస్పష్టముగ గాన్పించు చుండెను.

అహింసామార్గము నవలంబించి, సత్యాగ్రహమును బూని దక్షిణాఫ్రికాలో బోయరుల ప్రభుత్వముతో పోరుసల్పి, అచ్చటి భారతీయుల బాధలను తొలగించుటకు తగిన ఏర్పాటులను గావించి, మాతృభూమియగు భారతదేశమునకు చనుదెంచి, ఇచ్చటి పరిస్థితులను పరిశోధించుటకు దేశమునందు సంచారము సల్పుచుండెను. ౧౯౧౫ సం. నెల్లూరునందు సమావేశమైన మద్రాసురాష్ట్ర కాంగ్రెసు మహాసభ నిమిత్తము వారు విచ్చేసినప్పుడు కొందరు మిత్రులతో కూడ వారి దర్శనార్థము వారి బసకు పోయియుంటిమి. అప్పటికి వారి స్వరూపమున గొప్పమార్పులు పొడసూపినవి. అతిపేదయగు నొక సాధారణ మానవునివలె నొక చిన్నగుడ్డను మొలచుట్టు చుట్టుకొని సన్నదియగు నొక చిన్న చేతికఱ్ఱను చేతబట్టుకొని, ఉదయమున వ్యాయామము నిమిత్తము పురమువెలుపల పరిభ్రమణ గావించి వారు మరలివచ్చునప్పటికి మేమును వారి బసకు చేరితిమి. మేమందరము కూర్చొనుటకు బల్లలుగాని, కుర్చీలుగాని, చాపలుగాని లేకపోవుటచేత, తల్లియగు భూదేవి ఆసనములు కల్పించినదని నుడువుచు, తాను నేలమీద కూర్చొని మమ్ముల నందరిని గూర్చొనుడని వాక్రుచ్చెను. ఇట్లు వారియందు మూర్తీభవించిన నిరాడంబరత్వము మాకొక క్రొత్త యనుభవమును చేకూర్చెను. అంతట, అప్పటప్పుడే సాగించబడుచున్న ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమమునుగూర్చి నేను వారితో ముచ్చటించితిని. వారు మద్రాసులో నెవరో చెప్పిన మాటలనుబట్టి కాబోలును "మీ ఆందోళన అరవలయెడ మీకు గల ద్వేషమునుబట్టి సాగించుచున్నట్లు వినుచున్నా"నని పలికిరి. అది సరి గాదనియు, ఆంధ్రులకు ప్రత్యేకభాషయు, ప్రత్యేకసారస్వతసాహిత్యములును, ప్రత్యేకమును ప్రగల్భమును నగు చారిత్రమును కలవనియు, ప్రత్యేక ఆశయములు, ఆచారములు కలవనియు, కాని మాకు సలుపుబడి లేక మేము ఆంధ్రుల మను విషయమే ఇతరులకు తెలియక, దుస్థితిలో నున్నకారణమున ఆత్మోద్ధరణకై ఆంధ్రరాష్ట్రమును గోరుచున్నాముగాని, మరెవ్వరిమీదను ద్వేషభావముతో కాదని వారితో గట్టిగ మనవి చేసితిని.

మాంటేగూచలమ్స్ఫర్డుల పేర పేర్కొనబడు రాజకీయ సంస్కరణలనుగూర్చి ఢిల్లీలో మాంటేగూచలమ్స్ఫర్డులకు ఒక నివేదిక నందజేయుటకు నేర్పడిన అఖిలభారత ప్రతినిధివర్గములో నే నొక ప్రతినిధిగ నియమింపబడుటచేత అచ్చటికి వెళ్లియుంటిని. ఆ ప్రతి

* ఆలిండియా రేడియో-మద్రాసు కేంద్రము వారి అనుమతితో.

నిధివర్గములోనే చేరిన లోకమాన్యతిలక్, గాంధీజీ మొదలగువారు అప్పటికి విచ్చేసిరి. గాంధీజీ అప్పుడు మిక్కిలి ముతకగా నుండిన ఒక ఖద్దరువస్త్రము కట్టుకొని, మరియొక ఖద్దరుగుడ్డను పెద్ద తలగుడ్డ పెట్టుకొని, అట్టిదియే మరియొక ముతకఖద్దరు దుప్పటి కప్పుకొని, చెప్పులు తొడుగుకొని గ్రామనివాసియగు రయితు వలెనే చూపట్టెను. లోకమాన్యతిలక్ గారు తెల్లని స్వదేశీమిల్లువస్త్రము కట్టుకొని, బొందులు గలిగిన అంగరఖాను తొడిగి, మహారాష్ట్రపగిడీని శిరోవేష్టిగా ధరించి, ముచ్చెలు తొడుగుకొనియుండెను. తక్కిన వారమందరము లాగులు, లాంగుకోట్లు, సరిగె తల పాగాలు ధరించి, విదేశీస్వదేశీ సంకరమైన విచిత్ర వేషధారులమై మెలగితిమి. అప్పుడును మహాత్మ గాంధీగారితోడ ఆంధ్రరాష్ట్రమును గురించి ప్రస్తావించితిని. అప్పుడు వారు ఇతర విషయములందు నిమగ్నులై యుండుటచేత దానినిగూర్చి ఆలోచించుటకు అవకాశము లేదుగాని, ఆ విషయమునుగూర్చిన కాగితములు పంపగోరిరి.

కలకత్తాలో ౧౯౨౦ సం॥న ప్రత్యేకకాంగ్రెసు మహాసభ జరిగినప్పుడు గాంధీమహాత్ముడు సహాయ నిరాకరణోద్యమ తీర్మానమును ప్రవేశపెట్టుచు నుపన్యసించెను. అప్పటికి విచ్చేసియున్న శ్రీ లాలాలజపతిరాయి, చిత్తరంజనదాసు, విఠలభాయి పటేలు, కేల్కారు, సేలం విజయరాఘవాచార్యులు, మహమ్మదాలీ జిన్నా సాహెబు మొదలగు కాంగ్రెసుమహానాయకులందరును ఆ తీర్మానము నాక్షేపించి ప్రతిఘటించిరి. మహాత్ముడు మరల తీర్మానమును గూర్చి ప్రతిఘటించిన వారి వాక్యములను ఖండించుచు నుపన్యసించినప్పుడు సభలో సమావేశమైయున్న సుమారు ఇరువదివేల కాంగ్రెసువాదులు కదలక మెదలక నిశ్శబ్దముతో విని, తీర్మానమును కరతలధ్వనులు మిన్నుముట్ట 'గాంధీమహాత్మకు జై' అను జయజయధ్వానములతో అంగీకరించిరి. ఆ సమయమున మహానాయకులందరు మహాత్ముని అనన్యప్రభావమును గుర్తించిరి. కొలదిదినములలో జిన్నాసాహెబుగారుతప్ప కాంగ్రెసుమహానాయకులందరు అసహాయోద్యమమునందు చేరి, గాంధీ మహాత్మునకు తోడునీడరై నిలిచిరి.

ఆ అసహాయోద్యమము నడచు కాలములోనే, ఆంగ్లేయయువరాజు బొంబాయిపట్టణమునకు వచ్చిన సమయమున పట్టణములోని అంగళ్లు, కర్మాగారములు మొదలగు వ్యాపారస్థానములన్నియు కట్టివేసిరి. పారశీకుల షాపులుమాత్రమే తెరువబడియుండెను. వీనిలో అనేకములు బ్రాందిషాపులే. వీరిపై ప్రజలు దుండగములు గావింపకుండ రక్షణార్థముగ ప్రభుత్వమువారు తుపాకులను షాపులఖామందులకు వందలకొలది సప్లయి చేసిరి. మూసివేయబడిన కర్మాగరములలో పనిచేయుచుండిన కార్మికులు వేనవేలు బజారులలో తిరుగులాడుచు పారశీకుల దుకాణములను కొల్లగొట్టసాగిరి. దుకాణముల యజమానులు తుపాకులను కాల్చుటచేత అనేకులు హతులైనకారణమున, మహాత్మజీ ఈ దురంతములను సహింపజాలక నిరశనవ్రతమును బూనెను. ఆరోజులలోనే కాంగ్రెసుకార్యవర్గసమావేశము నిర్ణీతమైయుండుటచే, అందు సభ్యులలో నొకడనుగా నున్న నేను బొంబాయికి వెళ్లి, ప్రిన్సెస్ వీథిలో నొకమిత్రుని యింట బసచేసితిని. నేను బసచేసిన ఇంటికి చుట్టును తుపాకుల కాల్పులు వినపడుచుండెను. గుండుదెబ్బలు తినినవారిని పోలీసులు ఆసుపత్రులకు కొనిపోవుచుండిరి. అప్పటి దృశ్యము మిక్కిలి భయంకరముగను, దుఃఖకరముగను నుండెను.

మహాత్మాగాంధీగారు గిర్గాములో నొక మిత్రుని యింట బసచేయుచుండినందున, అప్పటి పరిస్థితులనుబట్టి వెలపలకు వెళ్లుటకు దుస్సాధ్యముగ నుండుటచేత, టెలిఫోనుద్వారా వారికి నేను అచ్చటికి వచ్చియుంటినని తెలిపితిని. నేనున్న స్థలముయొక్క పరిసరములు ఉపద్రవకరముగ నుండినందున నన్ను ఇల్లు వెడలవలదని చెప్పుచు, రాట్నము వడకుచుండుమని ప్రత్యుత్తరము చెప్పిరి. ఆరాత్రి యెట్లనో గడపి, తెల్లవారుజామున మేల్కొని చుట్టుప్రక్కల శాంతముగ నుండుటచేత గాంధీమహాత్ముని బసకు వెళ్లితిని. అప్పటికే దీపపు వెలుతురున వారు ఏదియో వ్రాసుకొనుచుండిరి. ఆరోజు ఉపవాసము ప్రారంభించిన మూడవ

దినము. నేను వారియెదుటనే కూర్చొనియుంటిని. ఇంతలో ఉదయ మయినది. వారు ఇంకను దీక్షతో వ్రాసుకొనుచునే యుండిరి. కొంత ప్రొద్దు ఎక్కినప్పటికి కొందరు సభ్యులు సమావేశ మైరి. శ్రీ చిత్తరంజనదాసుగారు మేము కూర్చున్న గదిలోనికి రౌద్రరూపముతో వచ్చి, గాంధీగారిని బిగ్గరగా సంబోధించి, "ఏల మీరు ఇంత యపకారము నకు వడిగట్టితిరి ? ఏల పత్రికల కిట్లు వ్రాయవలసి వచ్చెను ? కాంగ్రెసుకు ఇంక ప్రతిష్ఠాభంగము గావించ లేల!" అని తీవ్రముగ ప్రశ్నించిరి. గాంధీమహాత్ముడు నెమ్మదిగా, శాంతవచనములతో "నే నేమి చేసితి, నేమి చేసితి"నని ప్రతిప్రశ్న గావించెను. కాని దాసుగారింకను కోపావేశముతోడనే యొక పత్రికను చూపుచు, "ఈ వ్యాసము పత్రికల కేల వ్రాసితిరి ? లోకములో జరుగు దోషము లన్ని కాంగ్రెసునెత్తికి చుట్టి, మీరింత అపకారముచేయుట ఏమి న్యాయ"మని తర్కింప సాగిరి. అందుకు మరల గాంధీజీ, "అవును, నేను వ్రాసినదానిలో దోష మేమి కలదు ? ఇచ్చట కాంగ్రెసుకమిటీవారు తగిన జాగ్రతతో నేర్పాటులు చేసినయెడల ఈపట్టణమున జరుగుచున్న ఘోరదురంతములకు అవకాశము లేకపోయియుండును". ఇందుకు "ఈపట్టణములో దుండగీడులు జరుపు దుశ్చేష్టలకన్నిటికి కాంగ్రెసున కేమి బాధ్యత గల" దనుచు మరల గాంధీగారి వాక్యములను దాసుగారు ఖండించిరి. అటుపైన శాంతమార్గమున అసహాయోద్యమమును బూనిన కాంగ్రెసు విదేశప్రభుత్వమును ప్రతిఘటించి, రాజ్యమునకు ప్రతిసృష్టిగావింప నుద్దేశించుకొనియుండుటచే ఈ భారతదేశమున ప్రజలలో నెవ రే దుండగములు గావించినను కాంగ్రెసుదే దోషము. అట్టి దుండగము లేవియు జరుగకుండ, శాంతిని నిలుపవలసిన బాధ్యత యంతయును కాంగ్రెసువారిదే యని గాంధీజీ శాంతివచనములతోనే నొక్కివక్కాణించెను. అప్పటికి దాసుగారు తీవ్రతను మాని "మీరు తెలిపిన అభిప్రాయముతో నే నేకీభవింపజాల"నని సూచించెను. పిమ్మట గాంధీజీ "పత్రికలలో నా అభిప్రాయమును తెలుపుటకు నాకు స్వాతంత్ర్యము లేదా ? నా ప్రత్యేకాభిప్రాయమును తెలిపినమాత్రమున కాంగ్రెసుకు గలుగు ప్రతిష్ఠాభంగ మేమి"యని అనినతోడనే "మీరే కాంగ్రెసు, కాంగ్రెసే మీరు. మీ రొప్పుకొనినది కాంగ్రెసు ఒప్పుకొనినట్లే గదా" యని దాసుగారు పలుకుటతో సంభాషణ ముగిసెను. గాంధీగారు తమలో తాము నవ్వుకొనిరి. దాసుగారు శాంతించిరి.

ఇట్టివి ఎన్నియో సంఘటనలు జరుగుటచే గాంధీమహాత్ముని ఉదాత్తభావములు ప్రకటిత మైనవి. వారు పలికిన పలుకులును, వారు వ్రాసిన వ్రాతలును మనకు అమూల్యమైనవి. జ్ఞాన సంపత్తి.

## ౨

మహాత్మాగాంధీగారు బాల్యమున తాను పాఠశాలలో నేర్చిన సామాన్యవిద్యలతో తృప్తి జెందక మానవుడు ఈ లోకమున ఎందుకు జన్మించి, ఎట్టి కార్యములను నిర్వహించి, జీవితమును ఎట్లు సార్థకము చేయవలయునో అను విషయము లెక్కువగ పాటించి అందుకు ఆవశ్యకములగు జ్ఞాననిష్ఠయు, కర్మాచరణము మొదలగు సాధనములను సమకూర్చుకొనుచుండెను. ఈ ప్రయత్నమువలనే ఆర్యమతగ్రంథములను, మరి కొన్ని యితర మతములలోని గ్రంథములను చదివియు అప్పటప్పటికి మానవాభ్యుదయము సర్వతోముఖముగ సాధించుటకు మార్గముల బోధించు నైతిక, ఆధ్యాత్మిక రచనలను వారు సంప్రీతితో జీవితాంతమువరకు చదువుచుండిరి. ఈశావాస్యోపనిషత్తును, భగవద్గీతయు ఆర్యమత గ్రంథములలో ముఖ్యములైన ప్రమాణగ్రంథములుగ వారు గమనించి వారి చెంత నుంచుకొని పఠనము గావించుచుండెడివారు.

ఒక పర్యాయము నేను వారిని "ఈశ్వరుని ఎట్లు ఆరాధింతు" రని ప్రశ్నించగా 'ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించిత్ జగత్యాం జగత్' అను ఈశావాస్యోపనిషత్తునందలి ప్రథమ శ్లోకమునందలి ప్రథమ పాదమును మాత్రము చదివి యూరకుండిరి. ఇందువలన పరమాత్మ చరాచరసృష్టియం దంతటను వ్యాపించియుండునని విశ్వసించి ధ్యానించవలయునని వారి అభిప్రాయ మైనట్లు స్పష్టమైనది. ఆయనకు పరమాత్మ యనగా సత్యస్వరూపుడు. సత్యమే దైవము; దైవమే

సత్యము. అహింస యనునది సత్యమునకు ముఖ్యాంగము. అహింసాచరణమే సత్యమును సాధించుటకు మార్గము. ఇట్టి జ్ఞానము తోడనే ఆయన అంతఃకరణశుద్ధి గావించుకొని ఏ కార్యమును ప్రారంభింపవలచినను సర్వము ఈశ్వరాధీనమని తెలుసుకొని అంతర్వాణి యొక్క ప్రబోధము ననుసరించియే ప్రవర్తించుచుండిరి. కేవల జ్ఞాననిష్ఠయే గాక కర్మానుష్ఠానమును జీవితమునందు ఆవశ్యకమని గమనించి నిత్యమును లోకహితార్థముగ చేయదగిన కార్యము లన్నిటియందును స్వయముగ ఫలాపేక్ష కోరక తన శక్తికొలది పాల్గొనుచుండెడివారు. కావున ఆయన జ్ఞానయోగి మాత్రమే గాక కర్మయోగియు నై యున్నారు. జ్ఞానమునకు భక్తియు ముఖ్యసాధనముగ గ్రహించి ప్రాతఃకాలములందును, సాయంసమయములందును ప్రార్థనలు గావించుచుండెడివారు. పలువురతో కలిసి ప్రార్థన చేయుట అధికముగ ప్రయోజనము కలదని తలంచి ప్రార్థనలను, రామభజనను గావించుచుండెడివారు. ఇతర సమయములలో కూడ అప్పుడప్పుడు రామ, రామ యనుకొనుచుండెడివారు. 'రామ' యనగా కేవలము దశరథుని పుత్రుడనియే కాదు; అది పరమేశ్వరునికి పర్యాయపదముగ భావించి స్మరించుచుండెడివారు. నిష్కామకర్మాభిమానము కలవారగుటచేత దేశసేవయు, మానవసేవయు తనకు కర్తవ్యముగా గమనించి ముమ్మొందు తన జన్మభూమియగు భారతదేశమునందలి ప్రజల అభ్యున్నతికి కావలసిన కార్యములన్నియు సాధించి భారతజాతిమూలముగ లోకకల్యాణము సమకూర్పవలయునని ఆశయము కలిగియుండెను. భారతీయులకు స్వాతంత్ర్యము లభించిననే గాని, వారు సాంఘికముగను, ఆర్థికముగను, నైతికముగను అభివృద్ధి చెందలేరనియు, తాను తలంచిన ఆశయములను నెరవేర్పజాలరనియు గ్రహించియే వారికి స్వరాజ్యము లభింపజేసి నిర్మాణకార్యక్రమమును నిర్ణయించి వారిని సర్వసమర్థులజేయుటకై పలువిధముల ప్రయత్నము గావించి లోకపూజితులైరి.

మహాత్మాగాంధీ యంతటి మహనీయు డెట్లు లయ్యెనో యోచింపదగియున్నది.

గాంధీమహాత్ముని తలిదండ్రులు ధర్మచింతయు, భగవద్భక్తియు, పవిత్రచారిత్రమును కలవారు. తండ్రిగారు పురాణశ్రవణమునందును, భగవద్గీతాపారాయణయందును అభిరుచి కలిగి సదాచారప్రియులుగా నుండిరి. తల్లిగారు వ్రతములను, ఉపవాసములను చేయుటయందు ఆసక్తి గలిగియుండిరి. ప్రతిదినమును సూర్యుని దర్శించి, నమస్కరించినపిమ్మటనే భోజనము చేయుట ఆచారముగ నభ్యసించుచు, సూర్యదర్శనము గాంచలేని నాడు ఉపవాసము చేయుచుండెను. ఆమె గర్భవతియై యుండగా నొకదినమున ఆకాశము మబ్బుగ్రమ్మి సూర్యబింబము గనుపడకపోయెను. అందుకు ఆమె నిరశనవ్రతము బూనెను. ఆరోజుననే మహాత్ముడు జన్మించెనని చెప్పుదురు. కాబట్టి యిట్టి తలిదండ్రులకు పుత్రుడుగా జన్మించుటమూలకముగను, పూర్వజన్మసుకృతవిశేషములనుబట్టియు ఆయనకు సద్బుద్ధిసదాచారములు లభించినవని యూహించవచ్చును.

కాని విద్యార్థిగానున్న కాలములో దుష్టసాంగత్యమువలన ప్రేరితుడై, కొన్ని దుష్కార్యములు తలపెట్టి, మరల స్వయముగ బుద్ధి మరల్చుకొని, వానినాచరింపక తప్పించుకొనినట్లు వారి ఆత్మకథవలన తెలియవచ్చుచున్నది.

దుష్టతలంపులు తలపక, దుష్టచేష్టలను చేయక, మనస్సు యథేచ్ఛావిహారము సల్పకుండ ఇంద్రియములను స్వాధీనమందుంచుకొని సద్భావములను, సదాచారములను అభ్యసించి సత్కార్యములు చేయుటయే తనకు నిత్యనిష్ఠగా బూని దినములవెంట నిట్టి ఆత్మశిక్షణయందు ఆరితేరి, సామాన్యమానవులకంటె మించి మిక్కిలి అతీతమైన అంతఃకరణశుద్ధియు, జ్ఞానసంపత్తియు గడించుటచేతనే మహాత్ముడను బిరుదము వారియందు సార్థకమైనది.

ప్రవేశపరీక్షలో కృతార్థుడైనపిమ్మట, బారిష్టరుపరీక్షకు చదువుటనిమిత్తము ఆంగ్లేయదేశము పోవుటకు తల్లిగారి అనుమతి బడయుటకు మద్యపానము, మాంసభక్షణము, వ్యభిచారము చేయనని గట్టి ప్రమాణములు చేసెను. లండనుపట్టణము చేరినపిమ్మట తాను చేసిన ప్రమాణములను దృష్టియందుంచుకొని,

రవంతరైన మీరబాయిని పవిత్రాచరణరూపమైన అసిధారావ్రతచర్యకు పై నడిపిన ఆత్మనిగ్రహమే సాధనము.

బారిష్టరు పరీక్షయందు కృతార్థుడై బొంబాయి పట్టణమున హైకోర్టులో న్యాయవాదిగా ప్రవేశించి ప్రప్రథమమున న్యాయాధిపుల యెదుట నిలిచి తాను చేబట్టిన అభియోగమునుగూర్చి చెప్పవలసిన వాక్యములు చెప్పుట కారంభించి, సభాకంపముచేత నేమియు చెప్పజాలక, తొట్రుపాటు చెందిన యువకుడే పిమ్మట కాలములలో పేరోలగములందు పండితులును, పామరులును చేరిన వేలకొలది ప్రజాసమూహములకు మహోత్సాహమును గల్పించి ధారాళముగ నుపన్యసించ గలిగెను.

దేశమునందు ప్రజలవలనను, ప్రభుత్వమువలనను సంప్రాప్తములైన దుర్ఘటపరిస్థితులనుబట్టి పలుమారు వారు బూనిన నిరశనవ్రతదీక్షలతో ప్రాణోపద్రవములను సయితము తప్పించుకొనగలుగుట మహోత్కృష్టశ్రేణినే ననుష్ఠింపబడు అసిధారావ్రతచర్యలలో చేరినదే.

ఇట్టి మహత్తరమగు నింద్రియనిగ్రహముతో పాటుగ తనయందు, నఖిలభూతములయందు నొక భంగి సమహితత్వంబున జరుపువాడను ప్రఖ్యాతిగాంచిన, విష్ణుభక్తాగ్రేసరుడైన ప్రహ్లాదునకువలెనే వారి హృదయమున పరమోదారస్వభావము చిన్ననాడే అంకురితమై, నానాట విశాలమై ప్రవర్తిల్లినది.

కావుననే వారు దరిద్రనారాయణసేవాతత్పరులై మెలంగెను. హిందూసంఘములో చేరినవారైనను, చిరకాలమునుండి అణగద్రొక్కబడి, నీచముగ చూడబడుచు దారిద్ర్యమందును, అజ్ఞానమందును మునిగియున్న హరిజనుల నుద్ధరించుటకు బూని, అస్పృశ్యతానివారణోద్యమమును సాగించి, అగ్రజన్ముల మని చెప్పుకొనుచుండు బ్రాహ్మణులు సయితము వారితో కలసి మెలసి యుండునట్లు చేసి, దివ్యస్థానములని పేరు గాంచిన దేవాలయములలో వారికి ప్రవేశస్వాతంత్ర్యమును సాధించెను.

మఱియు తా ననుష్ఠించిన అహింసాసిద్ధాంతమే ప్రాతిపదికగా గల సత్యాగ్రహ దివ్యాస్త్రము చేత బూని, లోకమున బలిష్ఠరాజ్యములలో నొక్కటియైన ఆంగ్లేయ ప్రభుత్వముతో నిరువదియైదు సంవత్సరములు శాంతిసమరము గావించి నలుబదికోట్ల భారతీయులను దాస్యశృంఖలములనుండి విముక్తులజేసి స్వరాజ్యము చేకూర్చెను. ఇట్టి అనన్యమును, అపూర్వమునగు అహింసామార్గమున ఏ కాలమునగాని, ఏ దేశమునగాని స్వాతంత్ర్యమును సాధించినవారు లేకపోవుట చేత ఈ భారతస్వరాజ్యసంపాదన లోకచారిత్రమునం దొక మహాద్భుతమును, విచిత్రము నగు గొప్ప సంఘటనగ పరిగణింపబడుచున్నది. ఈ మహత్తరమగు కార్యమును సాధించిన సాత్త్వికవీరుడు గాంధీమహాత్ముడు లోకమున శాశ్వతముగ స్తోత్రపాత్రుడై వెలయుచున్నాడు.

మన దేశమున హిందువులు, ముసల్మానులు, క్రైస్తవులు మొదలగు వివిధజాతులమధ్య సామరస్యము సమకూర్చి వారి నందరిని ప్రత్యేకప్రత్యేకమతాభిమానములు, జాత్యభిమానములు మఱచి అందరము భారతమాతసంతాన మను ఐక్యభావముతో మెలంగజేసి ఒక్క బలిష్ఠ భారతజాతిగ నొనర్పవలె నని నిరంతరము బోధించుచు మతదురభిమానమువలన హిందూమహమ్మదీయుల మధ్య నప్పటప్పటికి సంఘటిల్లుచున్న దురంతముల నణచుటకై గాఢమగు కృషి సల్పుచుండెను. ఈ రెండు మత సంఘములవారును రెండు ప్రత్యేకజాతులను విపరీత సిద్ధాంతము మహమ్మదీయ నాయకుడగు జిన్నాప్రముఖుడు ప్రతిపాదింప సాగినతోడనే యీ సంఘములమధ్య సంఘర్షణములు పెచ్చరిల్లుటయు, భారతదేశవిభజనము గావింపబడి పాకిస్థాను స్థాపించబడినపిమ్మటనే, నొకహాలీ, కలకత్తా, బీహారు, ఢిల్లీనగరములలో చెలరేగిన దురంతములను తన యహింసాసత్యమార్గములచే నుపశమింపజేయుటకు బూని, ఎన్నియో కష్టములకు లోనై రనువిమయమును వినియోగించుచున్నారు. తూర్పు బంగాళమునందు పల్లెపల్లెకును కాలినడకను పొలములగుండ పోవుచు, ముళ్లు గ్రుచ్చుకొనినను లెక్కపెట్టక, సంచారము గావించి బీహారునందలి హిందువులను మంద

లించియు, కలకత్తాలోను, ఢిల్లీలోను నిరశనవ్రతములను సాగించి శాంతిని నెలకొల్పి వార్ధాకు పోవలెనని నిర్ణయించుకొని జనవరి ౩౦వ తేదీసాయంకాలము బిర్లా భవనమునుండి ప్రార్థనాస్థలమునకు పోయి వేదికపై నెక్కుచుండ, గుండుదెబ్బకు గురియై జీవితసమాప్తి చెందుటతో దేశమునకు తీరని విపత్తి వాటిల్లెను. హిందూముసల్మానులమధ్య మతవైషమ్యములను మాన్పి అన్యోన్యత సిద్ధింపజేయుటకై వారు సలిపిన మహత్తరమైన కృషియే వారికి మరణకారణముగ పరిణమించుట అత్యంత శోచనీయముగ నున్నది. అట్టి మరణమును కల్పించినవాడు హైందవుడై యుండుట హిందూసంఘమునకంతకు తలవంపులు గావించినది.

భారతదేశాభ్యున్నతిమూలముగ ఎల్లయెడల శాంతిస్థాపన గావించి లోకకల్యాణము సాధించుట వారి మహదాశయమై యుండుటచే అట్టి ఆశయమును నెరవేర్చుటకు వారు సాగించిన మహోద్యమము పూర్తి గావించుట మనకు పరమధర్మముగా ఉన్నది.

ఆ యుపభౌతికశరీరము అదృశ్యమైనను వారి ఆత్మ అత్యంతప్రకాశమానమగు శాంతికిరణములు ప్రసరించు దివ్యజ్యోతియై వెలుగుచు మనకు సత్యధర్మములు సాధించుటకు మార్గమును జూపుచున్నది గాన, మనమందరము అట్టి మార్గమున నడచి కృతకృత్యుల మగుదముగాక!



# కడుపుమంటలు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

పశుపతిని రెండుమూఁడుతడవలు నేను నొక్కియడిగితిని. అతఁ డెప్పుడు మనసు విప్పి తన జీవితవిషయములు చెప్పినవాఁడు కాలేదు. కొన్నేండ్లుగా నా కతనితోఁ బరిచితి యున్నది. ఆ పరిచయము చిత్రతరమైనది. దినదినము మేము విధిగాఁ గలసికొందుము. సమయము సాధారణముగాఁ బ్రాతఃకాలము. సాయంసమావేశము కాదాచిత్కము. కలసినప్పు డెప్పుడును, పదినిమిషములకుఁ బైగా మాటాడుకొనుట పడదు. ఆ మాటలు నోటినుండి వెలువడునవి కావు. మానసికములు. మా కలయిక కొక విజనస్థల మున్నది. సమయము కాఁగనే యచటికి నేను పోవుదును. నాకంటె ముందుగనే పశుపతి యం దుండును. ముమ్మొదట నేనే యతనిని గదపుదును. అతఁడు కదపినవెంటనే కదలు స్వభావము కలవాఁడు కాఁడు. అతఁడు హృదయము విప్పినతరువాత నేనిఁక నోరు విప్పలేను. అపుడు మా యుభయులమధ్య నేత్రావధానము. అవధానమైనపిమ్మట నతఁడు మఱి నిలవఁడు.

ఈ విచిత్రపరిచయముతో నతనిని గూర్చి తెలిసికొనుట యెంత కష్టము! కష్టపడి యతని తత్త్వము నెఱుఁగుటకు యత్నించితిని. నా యత్నము సంపూర్ణముగా ఫలింపలేదని యెఱుఁగుదును. అతనినిగూర్చి నాయెఱుక పరమాణు ప్రమాణము. బహుశః పశుపతిది సి. ఐ. డి. ఉద్యోగము. బాహ్యముగా నతఁ డెంత వెఱ్ఱివాఁడో, అంతరముగా నంత గడుసుమానిసి. ఒకరి జోలియు, సొంటియు నతని కక్కఱలేదు. ఒక్కొకపుడు తన కక్కఱలేని బరువు తలపైఁ బెట్టుకొనును. ప్రతివిషయము నను పూసికొని తిరుగువానివలె నగపడును. కాని నిర్లిప్తుఁడు. అవినయము గనఁబఱచువారల కతఁడు బూచి. అడఁకువ గలవారికి సురధేనువు. అతనికుత్తుకలో విషకలశ మున్నటులు కనిపించినను, హృదయము సుధాభాండము. నమ్మిన మిత్రుల హృదయములపై నతఁడు మేలిచందనము పూయును. నమ్మని శత్రువుల గుండెలపై శూలములతోఁ బొడుచును. దార్ఢ్యగరిమున కతఁడు గండకత్తెర. అతని జుట్టు, అతని బట్టలు విపరీతములైనవి: అసలు, స్వతః పశుపతి కోటికిఁ బడగలెత్తిన ధనికుఁడఁట. ఔద్యోగికముగా నతని వేసము బిచ్చగాని వేసము. అంత ధనవంతున కీయుద్యోగ మేలనయ్యా యని ప్రశ్నింతురు. ఉద్యోగమతని కొక లీల. పశుపతిది పైయధికారి లేని యుద్యోగము. అతనిని గాదన్నవారియెడల రుద్రుఁడైపోవును. తన తాండవమునకుఁ దాళము వేయుచున్నవారిపట్ల వెన్నెలలు

వెదచల్లును. విశిష్టమైన ప్రతివ్యక్తికడ నతఁడున్నటులుండి, కనఁబడకుండ వారి ప్రేవులు లెక్కించును. నలుగురు చేరినచోట విధిగా పశుపతి చేరును. అతని ప్రవృత్తి యద్భుతమైనది. ప్రభుత్వధర్మములకు వ్యతిరేకించి సంచరించువానిని పట్టి యతఁడు శిక్షించును. ధర్మబద్ధుఁడైనవానినిగూర్చి 'ఆంక్ష' తీసికొనఁడు. అతని రహస్యపరిశీలనమునకుఁ బట్టువడనివాఁడు లేఁడు. కొన్ని వేలమందిని 'టోకడాలు' కొట్టించినాఁడు.

పశుపతికి పెద్ద సంసార మున్నది కూడ. ఆ బైరాగివేసమును జూచి యితనికి భార్యాపుత్రు లుందురా యని చాలనాళ్లు సందేహించితిని. అతని రెండవకుమారుఁడు 'కమాండర్ ఇన్ ఛీఫ్'గా నున్నటులు తెలిసినది. జ్యేష్ఠపుత్రుఁడుకూడ నేదో గొప్ప యుద్యోగములో నుండెనఁట. పశుపతిభార్య మంచి చదువు చదువుకొన్నదని, పతివ్రత పరాయణయని, గొప్ప గడుసుది యని నా వినికి. ఆమె పేరు విశాలాక్షమ్మ. ఒకటి రెండు తూరులు పశుపతిపార్శ్వమున నుండఁగా నా యమ్మను బరికించుట తటస్థపడినది. అతఁ డెంత యనాకారియో, ఆమె యంత సుందరి. సౌందర్యమునకుఁ దగిన సౌశీల్యము. నిరంతరము పశుపతిప్రక్కనే యామె యునికి. అత్యాప్తులయినవారికి మాత్రమే విశాలాక్షి యగపడును. నేను విశాలాక్షిని చూచి, నను గన్నతల్లిని మఱచిపోయితిని. ఆతల్లి వేనలి నడుమనడుమ నరవెండ్రుకలతో నుండి, తిలతండులములు కలసిన తీరున నున్నది. ఆమెచూపులనుండి యమృతము వచ్చి నాహృదయముపై పూఁతపూసినది. ఆ ముత్తయిదువ వేదపురాణశాస్త్రముల వర్ణనములకు అందివటులుండి యందని మహామాతవలెఁ దోఁచినది. నా స్తుతులామెపట్ల నణువులు. విశాలాక్షిది, పశుపతిది యొకటే శరీరము, ఒకటే హృదయము. ఆ పుణ్యదంపతుల గార్హస్థ్యము యావత్ప్రపంచమునకు ఒరవడిదిద్దఁగలతీరున నున్నదనుట యథార్థము. ఆ దంపతులను నిరంతరముగా నెందఱో సేవించుచుందురు. వారి సేవకులలోఁ బండితులు, పామరులు, భిక్షుకులు, ధనికులుకూడ నుందురు. ఎట్టి సేవకునైనను సమానప్రతిపత్తితోఁ జూతురు. ధనిక-దరిద్రభేదము పశుపతిదృష్టిలో లేదు. విశాలాక్షిదృష్టి కసలే లేదు. ఆలుమగ లిరువురును ముందు సేవకు వచ్చిన మానిసిని కత్తులపైఁ బరీక్షించి, మఱి స్వీకరింతురు. వారి నౌకరీకి వచ్చి,పరీక్ష కాఁగలేక పోయినవారెందఱో యున్నారు. సేవాపరీక్షలో నుత్తీర్ణులయినవారు నూటికిఁ గోటికిని. సేవార్థిని నలపిచంపుటలో విశాలాక్షినిమించినవాఁడు పశుపతి, పశుపతిని మించినది విశాలాక్షి.

౨

పశుపతికి 'బెనారసు'లోఁ బెద్ద భవనమున్నది. అతఁడు తద్భవనములో నిత్యనివాసి కాకపోయినను,విశాలాక్షి సదా యందుండును. పశుపతినివాసస్థానము 'బెనార'సని పేరుగాని, అతనికొక యిల్లు వాఁకిలి లేదు. వేయిండ్ల పూజారి. పశుపతిసేవకులు 'బెనారసు'లో నెందఱో యున్నారు. వారిలో 'వ్యాసమూర్తి' పెద్దవాఁడు. అతఁడు చాలఁ జదువుకొన్న చతురుఁడు. పశుపతిదగ్గఱ వ్యాసమూర్తిపని పురాణముచెప్పుట. పశుపతి కెప్పుడును బురాణశ్రవణమునకుఁ

దీటిక యుండదు. ఇఁక శ్రద్ధగాఁ జెవులిచ్చునది విశాలాక్షమ్మ. ఆమెతోపాటు మఱికొందఱును వేళకు వచ్చి వినుచుందురు. 'వ్యాసమూర్తి' కర్మఠుఁడైన పౌరాణికుఁడు, వేదవేత్త. కవిత్వముకూడ ధారాళముగా వ్రాయఁగలవాఁడు. అట్టివాఁడు పురాణము కంఠమెత్తి చదువునపుడు సభ్యులు ముగ్ధులగుదురు. విశాలాక్షి పరవశ యగును. వ్యాసమూర్తిపురాణము వినుటకు 'బెనారసు'లోని ప్రజావళి యువ్విళులూరుచుండును. కాని, అజ్ఞలేకుండ పశుపతియింటికి వెళ్లుట వారికి వెఱపు. చనుమానము గల వారు కొందఱికే యచటఁ బ్రవేశము.

వ్యాసమూర్తియింటిపేరు పురాణము వారు. చక్కఁగాఁ బురాణములు చెప్పుచుండు నలవాటు వారి వంశీయుల కున్నది. దానినిబట్టి ఆ గృహనామము క్రమముగా నిరూఢమైనది. అసలు, వ్యాసమూర్తివలననే 'పురాణ'మను ని.టిపేరు అర్థవంతమైనదని పెక్కుమంది యనుకొందురు. పురాణము వ్యాసమూర్తిగారి పేరు చివర 'శాస్త్రి' పదము చేరిచి కొందఱు పిలుతురు. 'మూర్తి' పదముస్థానే 'శాస్త్రి' యాదేశముగా వచ్చినది కొందఱి మతములో మొత్తముపై కొందఱు వ్యాసమూర్తి యందురు. కొందఱు వ్యాసమూర్తిశాస్త్రి యందురు. మఱికొందఱు వ్యాసశాస్త్రి యందురు. పశుపతియు, విశాలాక్షియు 'వ్యాసమూర్తిని' పిలుచు పిలుపు 'పురాణభట్టారా!' అని. ఒక్కొక్కప్పుడు 'భట్టారుఁ' డనియే పిలుపు. భట్టారుఁడు నైష్ఠికుఁడు. అతని కర్మపరతలో నొక వైశిష్ట్యమున్నది. ప్రత్యూషమున లేచి త్రిషవణస్నానము చేయును. అతని స్నానమెప్పుడును 'చక్రపుష్కరిణి'లోనే. సంధ్య వార్చి, గాయత్రిని జపించి, అగ్నికార్యము తీర్చుకొని, యాశ్వరార్చనము చేసికొని, పశుపతి గృహమునకుఁ బోవును. అచట 'స్కాందపురాణము' చెప్పును. రెండు మూఁడుగంటలు ఆ కాలక్షేపమైన పిమ్మట మాధుకరమునకుఁ బోయి వచ్చి, భిక్షాన్నమును భుజించును. భట్టారునకు శిష్యులు పెక్కురు. అతఁడు కొందఱకు శాస్త్రములు, కొందఱకు వేదము, కొందఱకుఁ బురాణములు పాఠములు చెప్పును. అతని పాఠగతికి ముగ్ధులై యెండతెందఱో శిష్యులు గుమిగూడి వినుచుందురు. మరల మధ్యాహ్నము పశుపతిభవనములో భారత కాలక్షేపము. ఈ కార్యక్రమము దైనందినము. ఒకనాఁడు పశుపతియు, విశాలాక్షియు శ్రద్ధగా పురాణము వినుచున్నారు. భట్టారకుఁడు భారతములో 'శాంతి'పర్వము చెప్పుచున్నాఁడు. ఏదో కథాసందర్భము వచ్చినది. వ్యాసమూర్తి యందుకొని ముక్తకంఠముతో క్రోధమువలనఁ గలుగు చెడుగులను గూర్చి యుపన్యాసము మొదలుపెట్టెను. ఆ యుపన్యాస మఱు లరగంట సాగినది. ఈ యప్రసక్తముతో అసలుకథ యడ్డి కూరుచున్నదని విశాలాక్షి కరికాలిమంట నెత్తికెక్కినది. పశుపతికూడఁ గనుబొమలు చిట్లించుకొన్నాఁడు. కొంతసేపునకు పురాణము శాస్త్రులుగారి ధోరణి పూర్వకథలోనికి వచ్చినది. విశాలాక్షి యన్నది:

"భట్టారకులవారికి క్రోధముమీఁద మక్కువ యెక్కువ కాఁబోలు!"

పశుపతి యందుకొన్నాఁడు:

"ఎన్ని మాటలైనను చెప్పవచ్చు. క్రోధము జయించుట దుస్సాధము." విశాలాక్షి మరల ఎత్తుకొన్నది.

"మన శాస్త్రిలుగారికి క్రోధము లేదు పాపము!"

పౌరాణికునకు శూలము గ్రుచ్చినటు లయినది. అతఁడు ఆగలేకపోయినాఁడు.

"అమ్మా! మావంటి శాస్త్రజ్ఞులకు క్రోధము......"

విశాలాక్షియు, పశుపతియు పౌరాణికుని గర్వ మర్దము చేసికొన్నారు. ఆనాఁటికి పురాణకాలక్షేపము ముగిసినది.

3

పౌరాణికుఁడు శిష్యులతో మాధుకరమునకు బయలుదేఱినాఁడు. 'బెనారసు' పట్టణమున కంతకును అతని పేరు సుధాఝురి. పౌరాణికులు వచ్చుచున్నా రనఁగా, ప్రతిసాధ్వియు భిక్షము పెట్టెడిది. శిష్యులకుఁ గాని, గురువులకుఁగాని యొక వీథిఁ దిరుగునరికి కావలసినంత భిక్ష.

నేఁడు పౌరాణికుఁ డిల్లిల్లు తిరిగినాఁడు. ఒక సాధ్వియుఁ బట్టెఁడన్నము పెట్టిన పాపానఁ బోలేదు. ఒకతె 'వంట యగుచున్నదయ్యా' యనెను. ఒకతె 'మరల దయచేయుఁ' డనెను. 'మాయింట దేవతా కార్యము' అని యొకతె సమాధానము. వేరొకయిల్లాలు ద్వారకవాటము తెఱవనే తెఱవదు. పౌరాణికుఁడు నాలుగైదిండ్లకు వెళ్లెను. భిక్ష పుట్టలేదు. నివాసమునకు వచ్చి వేసెను. పౌరాణికుని శిష్యకోటియుఁ దిరిగి తిరిగి తిరిపెము పుట్టక వచ్చివేసిరి. పొట్టలు కాలుచున్నవి. ఆచార్యుఁడు మన మీనాఁడు పెట్టిపుట్టలేదని శిష్యులను సాంత్వనించెను.

మఱునాఁడు, మూఁడవనాఁడుకూడ భిక్ష దొరకలేదు. శిష్యు లాచార్యుని సాంత్వనింపవలసి వచ్చెను. 'బెనారెస్' పట్టణములో మాధుకరవృత్తిజీవనులు కొన్నివే లుండురు. ఎన్నివేలమంది యున్నను భుక్తికి కొఱత యుండదు. బెనారసునకు 'వల్లకా' డను నొక పేరు పెద్దలు పెట్టిరి. ఆ పేరు మనపౌరాణికుని విషయములో సార్థకమైనది.

ఈవిచిత్రమేమి? ఇంతపట్టణములో భిక్షపుట్టకుండుట యేమి? పౌరాణికున కర్థముకాలేదు. కడుపు మాడుచున్నది. శిష్యులు క్షుధార్తులై కొట్టుకొనుచున్నారు. పౌరాణికునకు బెనారసుపై కడుపుమంట పుట్టినది. అతని శాంతము గంగలో కలిసినది. ధనమదము, వేదవిద్యామదము, మోక్షలక్ష్మీమదము బెనారసులో ముదిరిపోయినవి. కానిచో నన్ను— నా శిష్యులను క్షుధాబాధతో నిట్లు పరితపింపఁజేయుట కెన్ని గుండెలున్నవి? పౌరాణికునికన్నులు జేగుఱు వాఱినవి.

౪

ఆనాఁడే సరిగా, పశుపతిభవనములో 'స్కాందము'లో నీఘట్టము పురాణము.

"అని పౌరాణికయ్యందు క్షుత్పిపాసాపరవశుండయి శపియింపం జూచు నవసరంబున నొక్క విప్రభవనంబు వాకిట విశాలాక్షి ప్రాకృతవేషంబున—

వేదపురాణశాస్త్రపద
వీనదవీయసియైన పెద్దము
త్తైదువ కాశికానగర
హాటకపీఠశిఖాధిరూఢ, యా

యోగ్యదిమశక్తి సంయమివ
రా! యిటు రమ్మని పిల్చె నా స్తనం
ధ్యాదరలీల రత్నకట
కాభరణంబులు ఘల్లుఘల్లనన్.

వ. చేరంబిల్చి యమ్మత్తకాశిని సాత్యవతేయున కిట్లనియె—

శా. అకంఠంబుగ నీవు మాధుకరభి
క్షాన్నంబు భక్షింపఁగా
లేకున్నన్ గడు వంగలార్చెదవు చే
లే! అన్న! కాఁతుండవే
నీకంటె న్మతిహీనులే కటకటా!
నీవారముష్టింపచుల్
శాకాహారులుఁగందభోజులుఁశిలోం
ఛవ్రతముల్ తాపసుల్.

తే. ఓమునీశ్వర! వినవయ్య యున్నయూరఁ
గన్నతల్లియు నొక్కరూ పన్నరీతి?
యటు విశేషించి శివుని యర్ధాంగలక్ష్మి
కాశి యిట్టిదిమీఁద నాగ్రహము దగదు.

ఉ. ఎట్టు పురాణముల్ పదియు
నెన్మిది చెప్పితి, వెట్టు వేదముల్
గట్టిగ వేర్పఱించి, నాడి
కారవు సాం పెసలార భారతం
బెట్టు రచించి, తీవు బుషి
వెట్టయి, తొక్క దినంబు మాత్రలోఁ
బొట్టకు లేక తిట్టెదవు
పుణ్యగుణంబుల రాశిఁ గాశికన్.

క. క్రోధంబు ఫలమె నిర్మల
బోధమునకుఁ? దీర్ఘవాసమున కర్హంబే
క్రోధము? వారాణసికైఁ
గ్రోధించిన విశ్వకర్త కోపింపఁడొకో?"

౫

పురాణకాలక్షేపము అంతలో ముగిసినది. పశుపతికి దొంగ పట్టువడిపోయెను. అతనికి శిక్ష యిది—

"కాశి నుండంగ నర్హుండు గాఁడు వీఁడు
వెడలిపొమ్మను మాటలు వేయునేల?
క్రోధనం బెట్లు! కైవల్యకులగృహంబు
నానివాసంబు కాశికానగర మెట్లు?"

దీనితో పశుపతికి, పౌరాణికునకు కడుపుమంటలు చల్లారినవి.



# ఆధునికాంధ్రవాఙ్మయమున భావము, భావగీతములు

శ్రీ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి

లాక్షణికమతానుసారము, విభావానుభావ సంచారివ్యభిచారిభావసముల్లసిత మయిన యాస్వాద్యమగు స్థాయిభావము రస మనిబడు నిర్వచనము. అంతటా, కావ్యమున, ప్రకృతిలో చేరిన యొక వస్తువు భావస్వరూపమును దాల్చి యభివర్ణింప బడుచున్నది. ఇట్టియ్యది విభావాదిరసావయవముల నుండి విడివడి, భక్తిభావము, బాలభావము (Songs of Devotion and Innocence) భావసంజ్ఞితము లగుచు, సంప్రదాయసిద్ధములైనవి. పరమేశ్వరుని బాలునిగ భావించి, వాత్సల్యరసమును పొంగి పొరలింప జేయునది భావమని సాంస్కృతిక లాక్షణికుల మతము. కౌసల్యాయశోదలు రామకృష్ణులు సాక్షాద్విష్ణుస్వరూపు లని తెలియజాలియు, మాయామోహిత లయి, తనయు లని లాలించి పాలించిన విధానము లభివర్ణించునది భావము, బాలభావము, లేక ముగ్ధభావ మయినది. ఇట్లే పరమేశ్వరుని పతిగా, మిత్రునిగా, సోదరునిగా, ప్రభువుగా, నిట్లెద్దియేని బాంధవ్యము కల్పించి, యభివర్ణించి, యాయా భావములతో నాతనితోడి సరససల్లాపము లనుభవించుట భక్తి, ప్రేమ భావము లయినవి. ఇట్లే ప్రకృతిలోని వృక్ష గిరి నదీ లతాదికములకు మానవస్వభావస్వరూపము లాపాదించి యభివర్ణించినదియు భావమని పేర్కొనబడినది. ఇయ్యర్థమున, సంస్కృతమున విలసిల్లిన ఋగ్వేదగీతికలు, ఉపనిషద్వాణి, స్తోత్రమాలికలు సాక్షాద్భక్తి భావవిలసితములు. రామాయణ మొక మనోహరమయిన యుదాత్తభావము. కాళిదాసుని మేఘసందేశము, మయూరుని సూర్యశతకము, జయదేవుని గీతగోవిందము, అష్టపదులు, నారాయణతీర్థులవారి తరంగములు, త్యాగబ్రహ్మకీర్తనలు—ఈ కోటికి చేరిన వన్నియు భావమున జెల్లును.

నవరససముల్లసితములగు కావ్యవస్తువులన్నియు క్రమముగా భావము లని పిల్వబడజొచ్చినవి. ఇయ్యర్థమున నుత్తమరసవద్ఘట్టములన్నియు భావములైనవి. దీనిని పురస్కరించుకొనియే పలువురు నేటి కవిత్వమునకు భావకవిత్వ మను నామ మొసగగా 'భావము లేని కవిత్వ ముండునా? ఈ భావకవిత్వ మన నేమియో' యని శంకించినారు. రానురాను నేటి ఖండకావ్యములను, గేయగుచ్ఛములను చేర్చి, అందలి వర్ణితవస్తువెట్టిదైనను సరియే యద్దానిని పాటింగొనక, యొకే కోటికి గుదిగ్రుచ్చి భావకవిత్వ మని యనినారు. అల్లిన దంతయు కవిత్వ మన నెవ్వ రంగీకరింతురు? అట్లే భావకవిత్వ మని వెలయుచున్న సముద్రమున నభావ తరంగము లనంతము లున్నవి.

ప్రాచీనలాక్షణికమతమున భావ మన నెద్దియో తెలిసికొంటిమి. ఆద్యులయిన నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాథ, నాచనసోమనాది పేర్వడసిన కవుల కావ్యములలో, కథావస్తుప్రవాహమున, నందందు రసభావతరంగములు కానవచ్చును. వీరి కావ్యములయందు సాక్షాద్భావమును జూపవలయు నన్న, విరళవిరళముగ కానవచ్చును. అతిప్రయత్నమున నితర కావ్యములయందును, భాగవతమున కొంత విరివిగాను నియ్యది యభివర్ణితము. కృష్ణుని శైశవాది ప్రౌఢదశాం

తము వర్ణింపబడిన ఘట్టములలో పలుతావుల భావము సువిదితము.

రసవద్భావమే ఉపాదేయ మను దృష్టిలో, కావ్యములలోని రసవద్ఘట్టము లన్నియు, నాటకసంవిధానమున కనబడు రసాతిరేకసన్నివేశము లన్నియు భావము లనబెల్లుచున్నవి. నేటి నాటకములు, చిట్టికథలు, ఖండకావ్యములు, గేయసంపుటములు నివి యన్నియు భావకవిత్వమై విరాజిల్లుచున్నవి. కథలు కవిత్వమా యన (Prose poetry) గద్యముకూడ కవితాకోటికి చెల్లునది యను మతమున. కవియొక్క సాక్షాదాత్మానుభావము, స్వాభిప్రాయములు, అనుభూతభావతరంగములు నిర్వచింపబడినచే భావ మన వలె నని సుప్రసిద్ధనిర్వచనము. ఇత్యర్థమునచే, నట్టివియే రసవద్ఘట్టము లగుచుండుటచే, కావ్యప్రవాహమున వర్ణితవస్తువుల యంతరాంతరమున విరాజిల్లుచు హృదయమునకు సంచలనము, ఆవేగము, ఆనందము సమకూర్చు రసవద్భావతరంగములే భావము లన తిరస్కరింప నను వుకాదు.

నేటి వాఙ్మయమున ముఖ్యముగా కవులు కావ్య నాటకాదిరచనావిశేషములందు తమ శక్తినంతయు వర్ణితవస్తువును, అంగాంగిస్వరూపవిలాసవర్ణనలను చాల తగ్గించి, రసవద్భావమందు దృష్టిని కేంద్రీకరించి, చిన్న ఖండికలు, కథలు, గేయములు రచించుటచే నేటి వాఙ్మయమును భావకవిత్వ మనుట సత్యదూరము కాజాలదు. ఉత్తమకవికోటికి చేరినవారెల్లరు తమ శక్తిసామర్థ్యములను, సంఘసంస్కరణకో, భాషాసంస్కారమునకో, మతాచారసంప్రదాయములలోని పొరపొచ్చెములను దిద్దుటకో, సత్యసుందరస్వరూపమును వెలిబుచ్చుటకో వినియోగించుచువచ్చినారు.

గురజాడవారి ముత్యాలసరములు, కన్యాశుల్కము నీ దృష్టియందు రచించినవే. తిరుపతికవుల శ్రవణానంద ముదాత్తము, సజ్జ్వలము. చిత్తసంస్కృతి యను ప్రధానకావ్యోద్దేశమును లక్ష్యమం దిడికొని రచించిన యుత్తమభావకావ్యము. మేఘసందేశమున శుద్ధి యనదగినది కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షము. కవిసమ్రాట్ వారి కిన్నెరసానిపాటలు, వేదుల, వేంకటపార్వతీశ్వరకవుల భక్తిభావాంజలులు, నేటి భావకవిత్వసంప్రదాయమున నుత్తమములు. రాయప్రోలువారి స్వప్నానుభూతి, ప్రబోధగీతికలు గురజాడవారి తరువాత పెన్నదగినవి. తిరుపతికవులతోపాటు పేర్కొనదగినవా రయినవా రుదాత్తకవికోటికి చెందినవారి కావ్యములన్నియు నగ్రస్థానమును వహించునవి గలవు. కవిసార్వభౌములు, కళాప్రపూర్ణులు వారిని ప్రత్యేకించి పేర్కొనవలయునా? జగ మెఱిగిన బ్రాహ్మణులకు జందెమేల? వారిని తడవుటంబనిలేదు. విమర్శకుని దృష్టి ఎంత సునిశితముగా పోగల్గినను వారు హిమవచ్ఛిఖరముల కైలాసమునంబలె నిల్వజాలినవారు. అనుయాయులం గాంచినచే ననినట్లు అభావతరంగకోటిలో విరళవిరళములయి భావ మను చిలుకూటకాల్వలు గాంచనైయున్నవి. దువ్వూరి, జాషువా, మొక్కపాటి, చింతా, నండూరి — మరువరాని కల్పనలు అందించినారు. కాలమున నిల్వరించుకోగల్గిన నాటికి వేఱ నిల్వగట్ట నవసరము లేదు.

అత్యంతసమీపమునకు రాగారాగా, నా ప్రేయసి, నాప్రణయిని ధోరణిలో లెక్కకు మిక్కిలి కన్పట్టుచున్నవి. అభ్యుదయరచయితలు దేశస్వాతంత్ర్యము సంపాదించుటకై పాశ్చాత్యదేశములలో నెట్టి ప్రణాళికలములలో పెట్టబడినవో, యందు వారి కెద్ది యభిమతమో నిర్ణయించుకొని, గేయఫణితిని చేపట్టి, యుద్రేకపూరితముగ వ్రాయుచున్నారు. కార్మికులు, ఆకలిమంటలు, జమీందారీవిధ్వంసనము, అస్పృశ్యతానివారణము, జాతిమతవిభేదరాహిత్యము, ఆకాశమంత కంచము, అందరు కలియబడి తినట ఇత్యాదిభావములతో దేశస్వాతంత్ర్యము, పరప్రభుత్వనిరసనము, సహాయనిరాకరణము, విప్లవక్రియాకలాపము బుర్రకథలద్వారా ప్రచారము సాగుచున్నది. ఇయ్యవి తాత్కాలికములై ఉద్దిష్టమైన క్రియాకలాపమునకు చేయూత నొసగినను, స్థిరవాఙ్మయమున నిల్వనేర్చునవి వీనిలో చాల తక్కువ. అయ్యది కాలము, రానున్నతరము తేల్చగలదు.

ఉదాత్తవస్తు సముల్లసితములయిన రచనలు ఖండికలు కానిండు, నాటకములు, నవలలు, చిట్టికథలు,

గేయములు-నిం దేహ్వరూపమున చిత్రింపబడినను సరియే, నిల్కడగాంచు ననుటలో పెట్టి సంశయమును లేదు. భావమును, భావయు నతి పేలవములై, యుజ్జ్వల సౌకుమార్యమాధుర్యాదిగుణరహితములై కేవలము శ్రుతి కింపగునంతమాత్రమున నవి చిరము నిల్వజాలవు. కవిత్వము, సంగీతము, నను రెండును భిన్నకళలు. ఉద్దేశ్యములును భిన్నములు. ఒకటి ముఖ్యముగా నర్థ సంపత్తిచే గౌరవము సంపాదించుకొనును. అన్యము నాదప్రధానము; శ్రోత్రేంద్రియగ్రాహ్యము. కల నాదము శ్రుతిపుటముల నింపుచో, నర్థసంపత్తి భాసించు నవకాశము చాలతక్కువ. సాహిత్యమునందు పదపదార్థసంఘటనమున భావించతగ్గ సారాంశము బుద్ధికి విషయము. సంగీతమునకై త్యాగరాజకృతుల యర్థమును ధ్వంసము చేయుచు పాడబడుచున్న పాటలు ఆస్వాద్యములై చెల్లుచున్నవి. సంగీతసాహిత్యము లన్యోన్యసహకారమున శోభించుట సహజమే. కాని రామాయణాదికావ్యములు, నేటి ఖండికలు పఠించుటలో నానందమీయ సమర్థములు. త్యాగబ్రహ్మకృతులు, తీర్థులవారి తరంగములు, గీతగోవిందము, అష్టపదులు పఠించిన నానందమీయ నసమర్థములు. కావ్యములు చదివి ఆనందించుటకు సంగీతము రా నవసరము లేదు. త్యాగరాయకృతులు పాడగా విని, ఆనందించ తగినవి. ఈ హేతువుచేతనే గేయఫణితిని కావ్యగుచ్ఛములు వ్రాసినంతమాత్రమున నవి కావ్యానందము నీయజాలవు. కావ్యత్వ మందున్ననే, ఉజ్జ్వలభావ సమన్విత మయిననే యవి యుపాదేయములు. కావ్యత్వ సిద్ధికి వలయు పరికరములు సువిదితములు.



# మొదటి చాళుక్యభీమమహారాజు సీసలి శాసనము

— శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ —

(గతసంచిక తరువాయి)

మొదటి చాళుక్య భీమమహారాజు శాసనములు ఇంతవఱకు ఈ సీసలిశాసనముతో గలిపికొని తొమ్మిది దొరకినవి. వీటిలో ఆఱు తామ్రశాసనములు, రెండు శిలాశాసనములు. సీసలి తామ్రశాసనము గాక మిగిలిన ఐదు తామ్రశాసనములు ఇవి: (౧) బెజవాడశాసనము1; (౨) అత్తిలిశాసనము2; (౩) కశింకోటశాసనము3; (౪) మద్రాసు మ్యూజియము శాసనము4 (దీనికి నరసాపురము శాసన మనియు, పెడతలూరు శాసన మనియుగూడ వ్యవహారము కలదు); (౫) పండిపాకశాసనము5. వీటిలో పండిపాకశాసనపు రేకు లింతవఱకు గానరాలేదు. ఈ శాసనపు ప్రతి యొకటి ఇలియటు శాసనసంపుటములలో నుండగా దానిని చూచి ప్రతి వ్రాసికొని కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారు అత్తిలి శాసనమును ప్రకటించు సందర్భమున దానిని అనుబంధముగ ప్రకటించినారు6. పూర్వోక్తములైన అయిదు శాసనములలోను కశింకోట, మద్రాసు మ్యూజియము శాసనములుమాత్రము ఇంతవఱకు ప్రకటితము కాలేదు; గవర్నమెంటుశాసనశాఖవారు వీటిని తమ సాంవత్సరికశాసననివేదికలలో సమీక్ష చేసియున్నారు. మిగిలినవి మూడును శిలాశాసనములు, ఒకటి బెజవాడలోని ఇంద్రకీలపర్వతము శాసనము7. దీనిని కీర్తిశేషులైన జయంతి రామయ్యపంతులుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో ప్రకటించినారు. చాళుక్యభీమమహారా జిందు సర్వలోకాశ్రయశ్రీవిష్ణువర్ధనమహారాజు అని పేర్కొనబడెను. ఈ మహారాజు ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరము పదిరెండగునేంట చట్టప అనునతడు ఇంద్రకీలపర్వతముమీద పార్థేశ్వరుని ప్రతిష్ఠించినట్లు ఈ శాసనము తెలుపును. రెండవది ఈ మహారాజు ధర్మవరముశాసనము8; అతని ప్రవర్ధమాన

---

1. Ep. Ind., Vol. V. pp. ౧౨౮ ff.
2. ఆం. సా. ప. ప., సం. ౬, ఫుట ౨౨౮.
3. Cp. No. ౧౪ of ౧౯౦౭-౧౯౦౯. దీనిని కూడ త్వరలో నే ప్రకటింపగలను.
4. Cp. No. ౧ of ౧౯౧౩-౧౯౧౪.
5. ఆం. సా. ప. ప., సం. ౬, ఫుటలు ౨౫౬-౨౫౮.

సూవెల్ దొర 'లిస్ట్ ఆఫ్ ఆంటిక్విటీస్' (సం. ౧) అను గ్రంథము ౩౮ వ ఫుటలో ఈ చాళుక్యభీమమహారాజుమండపాకతామ్రశాసన మొకటి యున్నట్లు వ్రాసియున్నది. ఇది ప్రాయికముగ పండిపాకతామ్రశాసనమే కాదగునని నా యూహ. ఈ మండపాకతామ్రశాసనపు రేకు లింతవఱకు కానరాలేదు.

6. ఫుటలు ౨౫౬-౨౫౮. ఈ శాసనమున చాళుక్యభీమమహారాజుతల్లి వేంగాంబిక యనియు, ఆ మహారాజు రట్టబలమును జయించి రిపుకులమును నిర్మూలముచేసి పట్టము గట్టుకొని భూమిని పాలించె ననియు తెలుపబడినది.
7. ఆం. సా. ప. ప., సం. ౮, ఫుటలు ౨౨౮-౨౨౯.
8. భారతి, సం. ౫ (ధర్మవరము శాసనములు, ఫుటలు ౬౧౩-౬౨౦; ౧౯౨౭, ఏప్రిల్ సంచిక), ఫుట్సు౬౯.

విజయరాజ్యసంవత్సరము [పది (?)*][రే(?)ను] పదునైదవ సంవత్సరము నాటిది. ఇందు అయ్యపరాజు తమ్ముడు వెజయరాజు ఉత్తరాయణసంక్రాంతినిమిత్తమున నిల్పిన ధర్మస్థితినిగురించి తెలుపబడినది. మూడవది కొలనిశాసనము9. ఇది హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలిప్రచురణమైన 'తెలంగాణా శాసనము'లను గ్రంథమున ప్రకటితమైనది. ఈ శాసనము చాల తప్పులతో ప్రకటింపబడినది. అదియునుగాక శాసనమున నడుమనడుమ గొంతకొంత భాగము పోయినది. అందువలన దీని భావము సరిగా దెలియవచ్చుటలేదు. రణమర్దాన్వయకులతిలకుడును, చాళుక్యభీమమహారాజున కాప్తుడును అయిన కుసుమాయుధుని పెద్దకొడుకునకు సంబంధించిన దీ శాసనము; ఇతని నెచ్చెలి శిలాస్తంభంబు ప్రతిష్ఠించి నిల్పిన ధర్మస్థితిని దెలుపును.

చాళుక్యభీమమహారాజుకరింకోటశాసనమువలన నితడు యువరాజువిక్రమాదిత్యుని జ్యేష్ఠతనయుడని తెలియుచున్నది. ఇందువలన నితనికి ఇంకను సోదరులు కల రనుట స్పష్టము. గుణగవిజయాదిత్యుని మరణానంతరము వేంగిసింహాసనమునకై ఈతనికిని, ఇతని సోదరులకును, దాయాదులకును యుద్ధము జరిగెను. ఈ భీమమహారాజునుగురించి ఈతని సంతతివారి శాసనములవలన మనకీ క్రిందివిషయములు దెలియుచున్నవి:

భీమమహారాజునకు పాలిచ్చి పెంచిన నాగిపోతి యను దాది యొకతె కలదు. నాగిపోతికూతురు గామకాంబ. ఈమెకొడుకు మహాకాలుడు భీమమహారాజుసేనాధిపతియట. ఇతడు "శత్రుఖడ్గములు రాపిడివలన అగ్ని ప్రజ్వలించెడి చోట్ల నెల్ల తన స్వామి కంటె పూర్వమే ప్రత్యక్షుడై ఎన్నితడవలో శత్రువులను రూపుమాపెను." భీమమహారాజు ననంతరము ఆతని పౌత్రుడు మొదటి అమ్మరాజరాజమహేంద్రుని కూడ మహాకాలుడు సేవించెను10.

గుణగవిజయాదిత్యుని మరణానంతరమున సూర్యుడస్తమించిన వెనుక తిమిరపటలమువలెనే రట్టసేనలును, దాయాదబలమునుగూడ వేంగీమండలమున అభివ్యాప్తమయ్యెను. అప్పుడు ద్రోహార్జున డను అపర నామము గల యువరాజవిక్రమాదిత్యతనయుడైన చాళుక్యభీమాధిపుడు ఖడ్గైకసహాయుడై స్వవిక్రమమువలన ఆ బలములను జయించి వేంగీదేశమునకు అధిపతియై ముప్పది వర్షములు భూమిని పాలించెను. కృష్ణవల్లభుని మహాసేనను దాయాదకులను జయించెను. దేవమునిద్విజాతితనయులకు తఱచుగా నర్థము నొసగెను. రాజ్యము అకంటకము చేసి ప్రజారంజకముగ భూమిని ముప్పదేండ్లు పాలించెను. ఈ భీమమహారాజునకు రమారమి నూటయేబది సంవత్సరముల తరువాత నుండిన చాళుక్యవంశజుడు మల్లపదేవమహారాజు మూడువందల అఱువదియుద్ధములలో విజయము పొంది మన భీమమహారాజు తన పేర చాళుక్యభీమేశ్వరదేవుని ప్రతిష్ఠించి ఆ మహాదేవుని కొక యాలయమును నిర్మించెనని తెలుపుచున్నాడు11. ఈ చాళుక్యభీమేశ్వరాలయము చామర్లకోటదగ్గర నున్న చాళుక్యభీమవరములో నున్నది.

రట్టు లనువారు కర్ణాటాధిపులు, మాల్యఖేటపు రాష్ట్రకూటరాజులు. వీరు వల్లభు లనియు, బల్లహులనియు ప్రసిద్ధులు. మొదటి చాళుక్యభీమమహారాజు పెత్తండ్రి గుణగవిజయాదిత్యభూవరునికి సమకాలికులైన రాష్ట్రకూటనృపాలు రిద్దఱు—అమోఘవర్ష భూధవుడు, అతని కుమారుడు కృష్ణభూవరుడును. అమోఘవర్షునికి నృపతుంగు డనియు, కృష్ణవల్లభునికి అకాలవర్షు డనియు నామాంతరములు. కృష్ణవల్లభనామము వహించిన రాష్ట్రకూటజనపతులలో ఇతడు రెండవవా డగుటచేత ఇతనిని రెండవ కృష్ణరా జందురు. కృష్ణశబ్దము వికృతి కన్నరపదము. ఈ కారణమున కృష్ణరాజునకు కన్నరభూపతి యనియు పేరు. ఇతడు క్రీ. శ. ౯౧౧ వఱకు,

9. తెలంగాణా శాసనములు, పుటలు ౧౬౩-౧౬౪.
10. Ep. Ind., Vol. V, p. ౧౩౭, VV. ౫-౭,
11. Ibid, Vol. IV, p. ౨౩౫.

అనగా ౮౩౩ వ శకవర్షము వఱకు పాలించుచుండి నట్లును, మొదటి చాళుక్యభీమమహారాజు ౮౧౪ వ శకవర్షమున పట్టాభిషిక్తుడై ముప్పదివత్సరములు, అనగా ౮౪౪ వ శకవర్షము వఱకు రాజ్యముచేసినట్లును తెలియవచ్చుటచేత భీమభూపతికి మొదటి ఇరువదిసంవత్సరములపాటు కృష్ణరాజు సమకాలికు డనుట నిశ్చయము. భీముని దాయాదులు వేంగీసింహాసనమును సంపాదించుకొనుటకు రాష్ట్రకూటకృష్ణరాజు సాయము కోరిరి. వారి సాహాయ్యార్థము కృష్ణభూపతి తన సేనలను దీసికొని వేంగీదేశముమీదికి దండెత్తివచ్చెను. ఈ రీతిని చాళుక్యభీమమహారాజురాజ్యము రాష్ట్రకూటులతోను, తన దాయాదులతోను యుద్ధములతో నారంభమయినది. చివరకు భీమభూపతి తన శత్రువుల నందఱి నోడించి వేంగిని కైవసము కావించుకొని జనరంజకముగ పాలించెను.

ఈ విషయములే చాళుక్యభీమమహారాజుశాసనములలోను దెలుపబడినవి. ఇతని తామ్రశాసనములు కొటిలోను అవి యిచ్చిన సంవత్సరము లేదు. ఒక్క అత్తిలితామ్రశాసనమమాత్రము చాళుక్యభీమమహారాజు ౮౧౪-వ శకవర్షమున, అనగా క్రీ. శ. ౮౯౨ లో పట్టాభిషిక్తుడయ్యెనని తెలుపుచున్నది. కాని యీ శాసనము భీమమహారాజు ఏ విజయరాజ్యసంవత్సరమున నీయబడినదో మనకు దెలియదు. ఇచ్చిన సంవత్సరము తెలియకపోవుటవలన ఈ తామ్రశాసనములలో ఏది ముందుదో, ఏది వెనుకటిదో నిశ్చయించుటకు వీలులేదు. అయినను కొంచెము హెచ్చుతగ్గుగ వాటి ముందువెనుకలు సూలదృష్టిని నిర్ణయింపవచ్చును. ఒక్క బెజవాడశాసనమునమాత్రము ఈ రాష్ట్రకూటసంగ్రామప్రస్తావము లేదు. ఈ శాసనము గుణిరైన కుసుమాయుధుని చేత సంప్రార్థితుడై భీమమహారాజు నిజపట్టబంధసమయమున కొండిన్యగోత్రుడును, ఉమ్మరకంఠిబోళుడును, వేదవేదాంగపారంగతుడును అయిన దేవమయ్యకొడుకు పోతమయ్యకు కట్టంకిపట్టు[13] అను గ్రామమును అగ్రహారముచేసి యిచ్చిన విషయమును దెలుపుటకు పుట్టినది. అందు

---

12. కుసుమాయుధు డనునతడు ప్రార్థింపగా భీమమహారాజు ఈ దానము చేసె నని మొదట గుర్తించి నాకు తెలిపినవారు మిత్రులు శ్రీ డాక్టర్ ఏన్. వెంకటరమణయ్యగారు. ఈ విషయ మా శాసనమునందలి ప్రథమశ్లోకమున దెలుపబడినది. ఆ శ్లోక మిది:

శ్రీమాన్ కీర్తిశశాంకరశ్మివిశదీభూతాఖిలాశావని
ర్వ్యోమా శ్రీకుసుమాయుధేన గుణినా విద్వజ్జనానందనః,
వీరోఽసౌ నిజపట్టబంధసమయే సంతుష్టవాన్ శాశ్వతం
గ్రామం శ్రీజయధామభీమనృపతి స్సంప్రార్థితో దత్తవాన్.

ఈశాసనమును పరిష్కరించి ప్రకటించిన డాక్టరు కీల్హారన్ గారు ఈ శ్లోకమును ఆంగ్లమునకు "That glorious hero, by whose fame all quarters, the earth and the sky are whitened as by the moon's rays, and who gladdens the learned with the excellent god of Love" అని అనువదించి, ఫుట్టునోటులో "I do not see the exact force of this statement" అని వ్రాసినారు. కుసుమాయుధు డన్నది ఒక పేరని అప్పు డాయనకు స్ఫురింపలేదు. ఆయనకే కాదు, అప్పటినుంచి ఇప్పటివఱ కెవ్వరికిని స్ఫురింపలేదు. ఆంధ్రపత్రికభావ (౧౯౩౪) ఉగాదిసంచికలో నేను ఇండియన్ ఆంటిక్వరీ (౧౯౦౩) పత్రికలో సి. బెండల్ గారిచే ప్రకటితమైన ముదుగొండచాళుక్యవంశజుడైన కుసుమాయుధుని తామ్రశాసనమును ప్రకటించినతరువాత ఈ బెజవాడశాసనమునకు ప్రాముఖ్యము కలిగినది. పై శ్లోకములో కుసుమాయుధుని గుర్తించి నాకు తెలిపినందుకు శ్రీ డాక్టరుగారికి నా కృతజ్ఞతావందనములు.

13. దానమిచ్చిన గ్రామమును కీల్హారన్ గారు కూకిపట్టు (కూకిపట్టు నామ గ్రామః—పంక్తులు ౨౭-౨౮) అని చదివినారు. ఈ పాఠము తప్పు. కట్టంకిపట్టు అని యుండవలెను. అనుస్వారము మొదటి రెండక్షరములకు నడుమ పంక్తి కొనను న్నది. కట్టంకిపట్టు కట్టంకి పాడయి నేడు కంకిపా డయినది. ఈ గ్రామమునకు పూర్వపు ఎల్లావధి 'పోతయ్యంగరిచెఱువు' అని యీయబడినది (పం. ౨౯). పోతయ్యంగరి చెఱువు అని

వలన చాళుక్యభీమమహారాజశాసనము లన్నిటిలో బెజవాడశాసనమే మొదటి దనుటకు సందియము లేదు. తన దాయాదులతోఁగూడ కృష్ణవల్లభబలమును ఈతడు జయించినట్లు అత్తిలి, కలింకోట, పండిపాకశాసనములు తెలుపుటవలన రాష్ట్రకూటసంగ్రామములు ముగిసిన వెనుకనే ఇవి యియ్యబడిన వనియు స్పష్టము. ఇక ఈ నాలుగును పోఁగా మిగిలినవి మద్రాసుమ్యూజియము, సీసలిశాసనములు. మద్రాసుమ్యూజియముశాసనము వలన భీమమహారాజు కృష్ణవల్లభుని బలమును, అతని మిత్రవర్గమునుగూడ నోడించె ననియు, దుర్వారులైన కర్ణాటలాటభూపతులు అతనిముందు వెలుతురుముందు తిమిరపటలమువలెనే పరుగిడిపోయి రనియు, పదునాలేండ్ల యీడు గల అతని కుమారుడు తన యేనుగు నెక్కి నిరవద్యపురరణమున కరితురగధనుర్ధరోదగ్రమైన వల్లభసైన్యమును సింహము లేళ్లనువలెనే వేటాడి చంపి, పెరువంగూరుగ్రామసంగ్రామమున వల్లభదండేశుడైన గుండయ 14 అను పేరుగలవానిని వధియించి తాను మృతినొందె ననియు, భీమమహారాజు ఇఱిమతిగండడయిన తన కొడుకుకు పారలౌకికక్రియలు నిర్వర్తించి విద్యాస్థానపారావారపారగులై (విద్యాస్థానపారావారపారగేభ్యః), వేదవేదాంగవిదులైన నలువదిరెండుగురు బ్రాహ్మణులకు ఉత్తరకండేఱువాటి విషయములోని వెడతలూరును దాన మిచ్చె ననియు దెలియుచున్నది. ఇందువలన నీ శాసనము రాష్ట్రకూటులతోడి సంగ్రామకాలమున నీయబడినట్లు విదిత మగుచున్నది. ఈ మద్రాసుమ్యూజియముశాసనముతరువాతిది మన సీసలిశాసనము.

మన సీసలిశాసనమువలన మొదటి చాళుక్యభీమమహారాజునకు ఇఱిమతిగండ డను కుమారుడుమాత్రమేగాక విజయాదిత్యు డను తనయుడుకూడ నుండె నని తెలియుచున్నది. నిరవద్యపుర, పెరువంగూరుగ్రామసంగ్రామవిశేష మసలుచే లేదిసో మనకు దెలియుట లేదు. ఇఱిమతిగండ డన్నది అతని బిరుదమే కాని పేరుగా కనబడదు. భీమమహారాజు రెండవ కొడుకయిన విజయాదిత్యునికి కొల్లభిగండభూపతి యనియు, కలియర్తృంక భూపతి యనియు, కొల్లభిగండభాస్కరుడనియు, కలియత్రిగండ డనియు, కొల్లభిగండ విజయాదిత్యు డనియు బిరుదనామములు. ఇఱిమతిగండ, కలియత్రిగండ భూపతు లిరువురిలో కలియత్రిగండడే చాళుక్యభీమనృపాలుని జ్యేష్ఠతనయుడట. తన తండ్రి జీవించియుండగనే ఈ నాలుగవ విజయాదిత్యుడు వైరివర్గమును నాశముచేసి యతని మెప్పు పొందెనట. ఇతడు కళింగాధిపతులను జయించి 'హేమకల్పితతులాకోటి' దూగి, విరజాపురమున కీర్తిస్తంభమును 'ప్రతిష్ఠించి యాఱు మాసములుమాత్రమే రాజ్య మేలి దివంగతు డయ్యెను. ఇతడు కళింగాధిపతులను జయించుట, విరజాపురమున కీర్తిస్తంభమును ప్రతిష్ఠించుట, బంగారుతులాభారము తూగుట—ఈవిషయములు ఈతనితరువాత వేంగీదేశము నేలిన చాళుక్యభూనాథులు తమ శాసనములలో పేర్కొని యున్నారు.

మన శాసనమున ఈ విజయాదిత్యుడు గంగులను నిర్జించె ననియు, కాళింగులను జయించె ననియు గలదు. గంగులు మైసూరులోని గంగవాడిదేశమును పరిపాలించుచుండిన పశ్చిమగంగభూపులు. కాళింగులు కళింగదేశవాసులు. కాళింగులను జయించె ననగా, ఆ దేశము నేలుచుండిన తూర్పుగంగరాజులను జయించె నని యర్థము. మన శాసనమున పాండ్య, పల్లవ, చోళ, కేరళనృపతులు కానుకలు తెచ్చి విజయాదిత్యుని సేవించు

---

యుండవలెను. ఇట్లే ఈ గ్రామమునకు ఈశాన్యపు పరిహద్దుగ నిచ్చిన 'ఐరివియగుణ్ణ' (పంక్తి ౩౨) అను పాఠము తప్పే. అది 'బరివియగుణ్ట' అని యుండవలెను. ఉమ్మరకంఠి బోళు అనగా ఉమ్మరకంఠి గ్రామము 'భుక్తి' అని యర్థము. 'బోళు' గౌరవవాచకబహువచనము. దీని ఏకవచనము బోఁడు.

14. "పెరువంగూర్గ్రామరణే వల్లభదణ్డేశ గుండయాఖ్యం హత్వా" అని శాసనము. 'వల్లభదండేశం గుండయాఖ్యం' అని శాసనపాఠమును సవరించిన సరియైన యర్థము వచ్చును; కాని 'దండేణగుండయ' అన్నది కూడ సరియైన పాఠమేమో యని యనుమానింప నవకాశము కలదు. ఏలయన, పండ్రెండవ శతాబ్దివాటిది కాదగు నొక శిలాశాసనమున 'దండేన గుండయకాలువ' అని కలదు. అందువలన 'దణ్డేనగుణ్డయ' యన్నది సరియైన పాఠమయినచో 'వల్లభం దణ్డేన గుణ్డయాఖ్యం' అని పాఠమును సవరింపవలసియుండు ననుకొందును.

చుందు రన్నది అతిశయోక్తిగ గన్పట్టును. వేంగీచాళుక్యులకు కేరళులతో సంఘర్షము కలుగుటకు ఏవిధమైన యవకాశమును లేదు. పాండ్యులు మధుర రాజధానిగా నేలిన పాండ్యనరపతులే. పల్లవులు కాంచీపురపల్లవులు. మొదటి చాళుక్యభీమమహారాజు సింహాసన మెక్కు నాటికే కాంచీపురపల్లవుల పరిపాలన అంతమైనది. చోళవంశజు డయిన రాజకేసరివర్మబిరుదాంచితుడు మొదటి ఆదిత్యవర్మ చాళుక్యభీమమహారాజు రాజ్యకాలము ప్రథమార్థభాగమున పల్లవరాజ్యము నాక్రమించుకొని తొండమండలమువఱకు వచ్చెను. అప్పటి పరిస్థితుల ననుసరించి పాండ్య,చోళభూవరులకును, వేంగీచాళుక్యులకును రాజకీయముగ సంఘర్షణము జరిగినట్లు కాని, అందు వేంగీచాళుక్యభూపతులే విజయులైనట్లు కాని యూహించుటకు మన కాధారములు లేవు. ఈ కారణముననే విజయాదిత్యునికి పాండ్య పల్లవచోళకేరళులు మణులు మొదలైనవానిని కానుకలుగా నిచ్చి సేవించుచుండి రన్నది అతిశయోక్తి యని భావింపవలసివచ్చుచున్నది. విజయాదిత్యుడు కాళింగులను జయించుట సత్యము కావచ్చును. గుణగ విజయాదిత్యుని తండ్రి కలివిష్ణువర్ధనునినాటినుండి చాళుక్యభూధవులు వేంగిని త్రికళింగదేశసహితముగ పాలించినవారే. గుణగవిజయాదిత్యుని మరణానంతరము వేంగీమండలము శత్రుబలాక్రాంతమయి నప్పుడు కళింగగంగరాజులుకూడ భీమమహారాజుపరిపాలనము ప్రారంభకాలమున చాళుక్యాధికారమును ధిక్కరించి స్వతంత్రులై యుండవచ్చును. భీమరాజ తనయుడు కొల్లభిగండవిజయాదిత్యుడు కళింగముపై నెత్తి వెళ్లి కాళింగులను యుద్ధమున నోడించి అచ్చట మరల పూర్వచాళుక్యాధికారమును స్థాపించియుండవచ్చును. భీమమహారాజుకాలమున కళింగము చాళుక్యుల చేయిజారిపోలే దనుటకు అతని కళింకోట శాసనమే తార్కాణము. ఈ శాసనము భీమమహారాజు ఎలమంచి కళింగదేశమునందలి గ్రామమును దానము చేసిన విషయమును దెలుపును. అదియునుగాక విజయాదిత్యనంతరము పుట్టిన చాళుక్యశాసనములు అతడు త్రికళింగాటవీయుక్తముగ వేంగీదేశమును పాలించినట్లు 15 తెలుపును.

విజయాదిత్యనామాంచితులలో మన చాళుక్యభీమమహారాజుకొడుకు నాలవవా డగుటచేత ఇతనిని చరిత్రమున నాల్గవ విజయాదిత్యు డందురు. ఇతనికి పూర్వోక్తములయిన బిరుదములేకాక జగత్త్రక్కడు, ఆసెగల్లాధిపుడు అను మరి రెండు బిరుదములుకూడ గలవు. జగత్త్రక్కడనగా ప్రపంచమున కంతకు సూర్యునివంటివా డని యర్థము. ఇతని రెండవ బిరుదము ఆసెగల్లాధిపు డనుదానిలో ఆసె యనగా ఏనుగని యర్థము. ఆసెగల్ల, కరిగల్ల పదములు సమానార్థకములు. రెండవ విజయాదిత్యుని తనయుడగు కలివిష్ణువర్ధనునికి కరిగల్ల బిరుద మున్నట్లు గుణగవిజయాదిత్యుని సాతలూరుశాసనము16 లోని యీ క్రింది—

"గురుతరదీనభాగవతమానవమానితకల్పపాదపః
వరకరిగల్లభూమిపభుజాసి రిహోర్జితభువి ప్రభాసతే"

అన్న శ్లోకార్థమువలన దెలియుచున్నది. విష్ణువర్ధనుని అహదనకర తామ్రశాసనమున 17 ఈ పదము వచ్చును. అచ్చట నిది 'కరిగళ్ల' అని యున్నది. ఈ యహదనకరశాసనము ,పృథివీపల్లవపట్టణంబున ఊరి వారు ఊరిస్వాములు కరిగళ్లవడవరికి ఇచ్చిన స్థితిని దెలుపును. 'వడవరు' అను పదము 'ఉడయవర్' అను ద్రవిడపదమునుండి పుట్టిన దనియు, దానికి 'వేల్పు', 'స్వామి' అని యర్థమనియు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పినది సమంజసముగ దోచుచున్నది. కలివిష్ణువర్ధనునికి ఈ పే రుండుటవలన అతడే తనపేర పృథివీపల్లవపట్టణంబున ఈ కరిగళ్లస్వామిని ప్రతిష్ఠించియుండవచ్చును. గల్ల యనునది తప్పనియు, గళ్ల అని యుండవలె ననియు కరిగళ్ల, ఆసెగళ్ల, ప్రియగళ్ల మొదలైనవి 'కామినీచిత్తచోర', 'నవనీత

15. Ep. Ind., Vol. V. p. ౧౩౧.

16. భారతి, సం. ౧, సం. ౧, పుట ౧౦౪, పంక్తులు ౨౨-౨౫.

17. భారతి, సం. ౫, పుట ౯౭, పం. ౧౯ (౧౯౨౮, జూలై సంచిక).

చోరావంటి కర్ణాటభాషాపదము లనియు, గళ్లపదమునకు చోరు డని యర్థ మనియు, కరిగళ్ల యనగా కరులను దొంగిలించువాడు, ఏనుగుల మనస్సు నాకట్టి వాటిని తన యధీనము చేసికొనువాడని యర్థ మనియు శ్రీయుత శేషయ్యంగారివలన తాము తెలిసికొన్న విషయము నా కెఱుగఁజెప్పినందుకు శ్రీ డాక్టరు యన్. వేంకటరమణయ్యగారికి కృతజ్ఞుడను. కరిగళ్ల పదమునకు అతిలోకప్రభావమున ఏనుగులను స్వవశము చేసికొనువా డను నర్థమే సరియైనదిగ దోచును.

ఇక భీమమహారాజశిలాశాసనములలో అతని ధర్మవరముశాసనము ౮౨౮-౨౯ శకవర్షమునాటిది; ఇంద్రకీలపర్వతశాసనము ౮౩౦-౩౧ శకవర్షము నాటిది. కొలనిశాసనము ఎప్పటిదో స్పష్టముగ తెలియకపోయినను భీమమహారాజ రాజ్యకాలమునాటి దనుట నిజము. ఈ శాసనమున పేర్కొనబడిన కుసుమాయుధుడు రణమర్దాన్వయకులతిలకు డట. ఈతడు కన్నరబల్లహానికి వశపడిన రణమర్దకశ్రీని (? రణమర్దకరాజ్యమును) తన భుజబలపరాక్రమమున దెచ్చి, భీమమహారాజున కిచ్చి "కంతియం గట్టి పట్టం బెత్తి ఖడ్గసహాయుండై నేల యెల్లం గావంబూనె" నట. ఈతని పెద్దకొడుకు పే రున్న శాసనభాగము చెడిపోయినది. మొత్తముమీద చూడగా కుసుమాయుధుడును, ఇతని పెద్దకొడుకును, ఇతని చెచ్చెలులును భీమమహారాజున కతడు గోల్పోయిన రాజ్యమును సంపాదించుటలోను, శత్రుసంగ్రామములలోను తోడ్పడి రని ఈ శాసనమువలన విదితమగుచున్నది. ఈ కుసుమాయుధుడు ముదుగొండచాళుక్యతామ్రశాసనము 18 వలన దెలియవచ్చినవారి సంబంధి యనుటకు సందియము లేదు. ఆ శాసనదాతయైన కుసుమాయుధుడు ముదుగొండచాళుక్యకులాలంకరిష్ణువు ముదుగొండ చాళుక్యవంశమున ఆ తామ్రశాసనముప్రకారము రణమర్దనామము గల భూపతి పుట్టెనట. శ్రీ సి. బెండల్ గారు ప్రకటించిన ఈ శాసనపాఠము తప్పులతడికగ నుండుటవలన ఈ ముదుగొండచాళుక్యులవంశవృక్షము వేయుటకుగాని, శాసనపాఠమును పరిష్కరించి సరిగా అన్వయించుటకుగాని వీలు కాకయున్నది. ఈ రణమర్ద వంశజులు మంచికొండ, 19 కొండపల్లివిషయములను పాలించినవారు. మంచికొండవిషయము తెలంగాణాలోనిది. రణమర్దకసంతతిలో కుసుమాయుధనామాంచితులు చాలమంది గలరు. మొదటి కుసుమాయుధుని కొడుకు విజయుడు. ఇతనికొడుకు రెండవ కుసుమాయుధుడు. ఇతనికి వినీతజనాశ్రయబిరుదము కలదు. రెండవ కుసుమాయుధుని తనయుడు విజయాదిత్యుడు. ఇతని యాత్మజుడు మూడవ కుసుమాయుధుడు. ఇతని కుమారుడును (నాలుగవ) కుసుమాయుధాభిధుడే. మొత్తము మీద నీ శాసనమున కుసుమాయుధనామము అయిదు తడవలు పేర్కొనబడుటవలన ఈ శాసనమును ప్రకటించిన బెండల్‌గారు అయిదుగురు కుసుమాయుధులు గల రనియు, శాసనదాత అయిదవ కుసుమాయుధు డనియు అభిప్రాయపడిరి. నాకు జూడగా మొత్తముమీద నీవంశమున కుసుమాయుధాఖ్యులు నలుగురే కలరనియు, నాలుగవ కుసుమాయుధుడే శాసనదాత యనియు దోచుచున్నది. వీరిలోనివాడే మన చాళుక్యభీమమహారాజు బెజవాడశాసనమున పేర్కొనబడిన కుసుమాయుధుడు. ఈతడును, కొలనిశాసనపు కుసుమాయుధుడును ఒక్కరే. ఇతడు కుసుమాయుధనామాంచితులలో రెండవవాడో, మూడవవాడో కావచ్చును. ఈ ముదుగొండచాళుక్యవంశజులు వేంగిచాళుక్యరాజ్యమూలస్తంభములై యామహారాజులను విశ్వాసముతో గొలిచినవారు. బెజవాడశాసనమునకే కాక కొల్లభిగండవిజయాదిత్యుని పౌత్రుడయిన రెండవ అమ్మరాజవిజయాదిత్యుని కలుచుంబఱ్ఱు (కంచుమఱ్ఱు) శాసనమున 20 కూడ మఱియొక కుసుమాయుధుడు వచ్చును. ఈతడును

18. Ind. Ant., for ౧౯౦౩; Ed. C. Bendal; ఆంధ్రపత్రిక భావ ఉగాదిసంచిక (౧౯౩౪).

19. తెలంగాణాశాసనములలో ప్రకటితమయిన కొలనిశాసనములోని మడికొండనా డన్నది 'మంచికొండనా' డన్నదానికి తప్పుపాఠ మని తోచుచున్నది.

20. "అస్య గ్రామస్య గ్రామకూటత్వం కట్టలాంబాత్మజః కుసుమాయుధాయ దత్తం శాశ్వతమ్"— పంక్తులు ౪౦-౪౧. Ep. Ind., Vol. VII, P. ౧౯౭.

ముదుగొండచాళుక్యవంశజుడే కావచ్చును. రెండవ అమ్మరాజవిజయాదిత్యుడు దానముచేసిన కలుచుంబర్రుగ్రామకూటకర్త్వము కట్టలాంబాళనాథవుడయిన కుసుమాయుధునికి శాశ్వతముగ నీయబడినది. ఇదివర కూహించినట్లు ఈతడును ముదుగొండచాళుక్యవంశజుడే యైనచో ఈ వంశమువార్లు రెండవ అమ్మరాజవిజయాదిత్యుని (క్రీ. శ. ౯౪౫-౯౭౦) నాటికి తెలంగానా లోని తమరాజ్యమును గోల్పోయి ప్రాగాంధ్రదేశము నకు వచ్చి స్థిరపడిరని యూహింపవచ్చును. రెండవ అమ్మరాజ విజయాదిత్యుని అనంతరము వేంగీసింహాసనము నధిష్ఠించిన యతని సోదరుడు దానార్ణవభూపతి ఈ ముదుగొండ చాళుక్యవంశజులకు తన రాజ్యము లోని పొత్తపినాడును [21] సర్వకరపరిహారము చేసి యొసగి వారిని బహూకరించెను.

ప్రతిగ్రహీత హారితసగోత్రుడు వెన్నమార్యుడు. ఇతడు చాళుక్యవంశగురుడట. ఇతని శిష్యుడు విజయాదిత్యరాజకుమారుడు. శిష్యపదమును పొంది ఈతడు తన తండ్రిని ప్రార్థింపగా భీమమహారాజు అతని గురువు వెన్నమార్యునికి అదువాడతోగూడిన చీంచెల్లి గ్రామమును ఉత్తరాయణపుణ్యకాలమున సర్వకరపరిహారము చేసి యొసగెనట. నాటినుండి వెన్నమార్యుడు సీసలిలోనే యుండియుండవలెను.

దాన మిచ్చిన ప్రధానగ్రామము చీంచెల్లి. ఈ చీంచెల్లి యిప్పటి సీసలిగ్రామమే. సీసలిగ్రామము ప్రాచీననామము చీంచెల్లి. చీంచెల్లి సీంసెలి అయి నేటికి సీసలి అయినది. సీసలితోగూడ నిచ్చిన యుపగ్రామము అదువాడ. దీనిని అడువాడ యనియు జదువవచ్చును. అదువాడ కాలక్రమమున అద్వాడ, అద్దాడ, అడ్డాడ అయి, చివరకు అజ్జాడగా మారవచ్చును. సీసలి ప్రాంతమున అదువాడకాని, దాని వికృతి అయిన అజ్జాడకాని యున్నదేమో నాకు తెలియదు. సీసలి సమీపమున నున్నట్లు చెప్పబడిన దర్భపూండి, పల్లవపురములు గుర్తింపగుదురట లేదు. కొండుకపూండి ఇప్పటి శైవక్షేత్రము గునుపూడిగ దోచుచున్నది. కొండుకపూండి కాలక్రమమున కొణుకపూడి, కొణుపూడి, గొణుపూడి యై నేటికి గునుపూడిగ మారినది. దత్తగ్రామము క్షేత్రసీమావధులయిన కారెమికనుము, ద్రోవదిచెఱువు, తల్లీంద్ర మొదలైనవి స్థానికులైన సీసలిగ్రామవాసులు గుర్తింపగల రేమో తెలియదు.

21. Jour. Andh. Hist. Res. Soc., Vol. XI. pp. ౯౨ ff.



# విజయనగరసామ్రాజ్యము-చరమదశ

(ఫిబ్రవరి నెల సంచిక తరువాయి)

## శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

శ్రీ. శ. ౧౬౨౮. కర్ణాటకమున (శ్రీరంగతిరుమల) రామరాజానుజుడు, సీతిరామనామధేయుడు రాజాయె. సయామదేశవరపాలుడు స్వర్ణపత్రముపై నొక యుత్తరమును వ్రాయించి పంపెను.

కేంద్రప్రభుత్వహీనముగుటవలనను, స్థానిక ప్రభువు లెవ్వరి కిచ్చవచ్చినట్లు వారు వర్తించుచుండినందువలనను పలికటరక్షణ దాని దుర్గబలముమీదనే యాధారపడవలసి వచ్చినది. సీతిరాముడు రాజైనపిమ్మటకూడ ఇతెరాజు ప్రాబల్యము తగ్గలేదు. ఆ పలికాటున కొడయ డగుట వలన, నతని కాలుదారుడైన పెదరాజాముఖాంతరమున నా యచట దన యధికారమును నడపుచు పన్నులను రాబట్టుకొనుచుండెను; కాని యచటినుండి యింక నెక్కువ ధనమును వసూలుచేయవచ్చు నని యెంచి, పన్నుతందు నెపమున పెదరాజును చెఱబెట్టి యతని యాస్తిని, భార్యలను దన సంరక్షణక్రింద నుంచుకొనవలసిన దని క్రొత్త కాలుదారుడగు రఘునాథరాజున కాజ్ఞాపించెను.

ఇట్లుండగా జాతిచే బ్రాహ్మణుడును, ఇతెరాజునకు చక్కని జవరాండ్రగూర్చు కుంటెనగాడును నగు వెంకటరాజునకు పలికాటును స్వాధీనముచేసికొనవలయు నను దురాశ పుట్టినది. అతడు త్జపరాజుపోకెపిళ్ల లను నిద్ద అనుచరులకు చెరియొక ౧౦౦౦ భటుల నిచ్చి యుత్తరమునుండి (పలికాటు) ద్వీపమును, నది యుత్తర పార్శ్వమున నుండుదానికి చెందిన భూమిని వశపఱచు కొనుటకొఱ కంపెను. వీరు ౧౬౨౮ జూను ౧౩వ తేదీన శ్రీహరికోటగ్రామమును దగ్ధము గావించి యచటి జనులను బాఱదోలిరి. ఈ జనులు కొన్నమునదీమార్గమున దప్పించుకొనిపోయి, యొక ద్రోణెతోడను, పడవతోడను (డచ్చిఫ్యాక్టరు) ఇజ్నబ్రాంట్సుచే సంరక్షింపబడుచుండిన యొక కోటయందు శిల దాచుకొనిరి. పెదరాజుభటు లనేకులు రేఱు దాటి వచ్చి త్జపరాజు నోడించి యతని యనుచరులను శెక్కండ్రను జంపి, త్జపరాజుతో మఱికొందఱిని చెఱబట్టుకొనిరి. అటు వెనుక మఱియొక గ్రామముగూడ దగ్ధము సేయబడినది. ఇది జరుగుటకు కొన్ని దినములముందు త్జప కొన్నము గ్రామమున నివసించుచుండిన పెదరాజున కాప్తులైన కొందఱు నాయకులయొక్క గొఱ్ఱెలను, పశువులను, ధాన్యమును దోచుకొనిపోయియుండెను.

పైజెప్పిన నాయకులు దమ స్త్రీలను, బిడ్డలను పలికటున కంపిరి. పలికటున బంధీకృతుడైయుండిన త్జపరాజు రఘునాథునితోగూడ కుట్ర చేసి, 'ఇజ్నబ్రాంట్సు పలికటపట్టణమును ఏచపనాయకునికి వశపఱచుట కుద్యమించియున్నా డనియును, నతని యత్నమును భగ్నముసేయుటకు దగిన దండును పంపవలయు ననియు' నొక కృత్రిమసందేశమును ఇతెరాజున కంపిరి. పలికటవాస్తవ్యులను పెదరాజుప్రజలను మోసపుచ్చి తప్పించుకొనిపోవుటకు మంచి యుక్తిని గని పెట్టితి నని తజప తలచెను. కాని ఇజ్నబ్రాంట్సే పడి వెలిగి, పలికటునుండి రావలసిన పన్నును వసూలుచేయుట కచటికి వచ్చియుండిన ఇతెరాజు కార్యకర్తను నతని యజమానునితో వార్తను విశ్వసించ తగదనియు, పట్టణసంరక్షణయందు దన యావచ్ఛక్తిని వినియోగపఱతు ననియు నచ్చజెప్పుటకొఱకు తక్షణమే బయనముచేసి పంపెను.

త్జప రఘునాథ వేంకటు లేకీభవించి యేటి యుత్తరమున నుండు ద్వీపమును మొదట వశపఱచుకొని, గల్డ్రి

యూకు రెండుసుండు పెట్లదూరమున నుండు సంతోజి పళ్లెయం దొక కోటను గట్టి, యటువెనుక శాంథోమే లోని పోర్చుగీసులను దోడు పిలిచి వారి సహాయమువలన (పలికట) పట్టణమును, నందలి జనులను స్వాధీనము జేసి కొనుట కుద్యమించుచున్నా రనియు, నందువలన వారు రెండులక్షల వరహాల ధనమును బొందగల రనియు, కావున జాగరూకతతో నుండుట యుక్తమని యు హెచ్చరించుచు ౧౮వ తేదీనా డొక జాబిక్స్ బ్రాంట్సుకు వచ్చిచేరినది. ఇట్లే శాంథోమెనుండి యచటి బిషపు సీతిరామునకు ౩౦౦ వరహాలను గానిక పెట్టి పలికటుకు బ్రతికూలముగ పెద్దిరేవియు నొక కార్యమును నడపుట కతని బురికొల్పుచున్నా డని సమాచారము వచ్చినది. ఇట్టి ధనసంపన్నమైన పట్టణమన్ని పార్శ్వములనుండియు జాట్టుకొనబడెను; కాని (డచ్చి) కంపెనీవారి వ్యాపారమును కెడనీయక గాపాడుకు పట్టణసంరక్షణ మావశ్యక మని ఇక్స్‌బ్రాంట్సు తలచెను.

౨౧ వ తేదీనాడు మఱియొక విశేషము జరిగినది. ఇతెరాజు పంపినవారేమొ, ఇరువురు మనుష్యులు వచ్చి దర్వాజాబీగములను, పెదరాజుయొక్కయు, నతని యనుచరులయొక్కయు సొత్తును, వారి స్త్రీలను దమ కప్పన సేయవలయు నని కోరిరి. పెదరాజుస్త్రీలను దాను గాపాడెద నని ఇక్స్‌బ్రాంట్సు వాగ్దత్త మొనర్చి యుండినందువలన వా రడిగిన చొప్పున సేయక నిరాకరించెను. మఱియు బన్నును నిర్ణయించు కొలును దానప్పుడు చెల్లించబోవు పైకమును వారే స్వయముగ నితెరాజుకడకు గొంపోనొడంబడుపక్షమున దర్వాజా బీగముల నిచ్చెదనని యిక్స్‌బ్రాంట్సనెను. వా రందులకు సమ్మతింపరైరి. ఏలనగా, నట్లు సమ్మతించిన దమకు వలసినంత ధనము దొరక దని వా రెఱుగుదురు.

పెదరాజును చెఱబెట్టిన తరువాత పలికటకు జెందిన ౩౨ గ్రామముల రైతులును పాఱిపోయిరి. వ్యవసాయదారులు లేకపోవుటచే భూములు బీడువడెను. పైపేర్కొనినవా రిరువురును ఇతెరా జిక్స్‌బ్రాంట్సును సలహో యడుగుచున్నా డను నమ్మక మతనికి గలిగింపవలయు నని యత్నము జేసిరి. కాని క్రమక్రమముగా నాయుధపాణులైన భటులను దాదాపు మున్నూర్గురిని పట్టణములోనికి బ్రవేశపెట్టిరి. వారి వాస్తవోద్దేశము పెదరాజు ప్రజలను బట్టుకొని పట్టణమును గొల్లగొట్టుటయే యని తెల్లమాయెను. ఇక్స్‌బ్రాంట్సు పట్టణమును దాను గాపాడుదు ననియు, దక్కనవానిని రక్షించు మార్గము నితెరాజే యారయవలయు ననియు చెప్పి, యితెరాజునకు నేబదివేనుల శ్రీగంధపుచెక్కలను గానుకగ నిచ్చి వారి నంపివేసెను. కాని ఇతెరాజుకడకు బోవుటకు మారు పాశ్నైరికి దమ్ము బంపిన వెంకటరాజుకడకు బోయి చేరిరి.

ఈ పన్నుగడ యిట్లు భగ్నమగుటవలన, వెంకటరాజు బలముచే బలికటను సాధింపదలచెను. అతని భటులు సుమారు నాలుగైదువందలమంది జాలై ౧౦-౧౨ తేదీలమధ్య పట్టణముమీదికి వచ్చిరి; కాని వారు తిరుపాలూరుసమీపమున నోడి పటాపంచలైపోయిరి. ౧౪వ తేదీనా డిట్లే మరల వచ్చి ౧౨౦౦ మందిగూడ పరాజితులై పాఱిపోయిరి. ఆ సమయమున 'ఫ్రీడ' యను నావ ప్రయాణమునం దగచాట్లపాలయి కుదకట్లో రేవునకు వచ్చిచేరెను. దానినుండియు పెదంట్లికు నుండియు దనకు సహాయము సేయుటకొఱకు వీరైనంద ఱెరి నావికులను ఇక్స్‌బ్రాంట్సు దింపించుకొని యెను; ౧౫ వ తేదీన 'ఫ్రీడ' మచిలీపట్టణమునకు బయలువెడలిపోయినది. 'కశ్వేరు' నాయకుడిక్స్‌బ్రాంట్సుకు దోడుపడెద నని యుత్తరము వ్రాసి పంపెను. ౧౬ వ తేదీన వెంకట రాజు మరలవచ్చి యొక గ్రామమున శేషించియుండిన యిండ్ల నన్నిటిని గాల్చివేసెను; కాని యుద్ధమున నోడి పలువురు భటుల గోల్పోయి, క్షతగాత్రుల నేకులతోగూడ పలాయితుడాయెను. ఆ మరునటి దినమునం దతడు యేటి యవ్వలిదరికి మరల దనమనుష్యులను బంపుటకు బ్రయత్నమొనర్చెను; కాని నదియం దొక దోనెపై నిలిచి ఇక్స్‌బ్రాంట్సు వారిపై తుపాకులను గాల్చి వెడలనడచెను.

వెంకటరాజు తిరుపాలూరునందు నిలచి యితర నాయకుల సహాయమును సంపాదించుటకు దలపెట్టెను; కాని, వారి కిచ్చుటకు (తన కొలువుగాండ్రకు నెల జీతము లిచ్చుటకే యతనికడ పైకము లేదట!) అతని

యొద్ద ధనము లేకపోవుటచేతనో, లేక గెల్డిరియా కోటను గాపాడుచుండిన ౪౦౦ వృద్ధగాత్రుల నెదుర్కొనుటకు జాలినందలు దొరకకపోవుటవలననో యతని కడక నెఱవేరదాయె. పట్టణప్రజలు ఆగస్టు ౭వ తేదీన కోట వెలుపడి వెంకటరాజుతో పోట్లాడ నుద్యమించిరి; కాని యొక్కైన నీ యుద్ధము నాపివేయుట యుక్తమని నిశ్చయించి ఇజ్‌బ్రాంట్సు, పట్టణము వెలుపడిన పక్షమున నటుతరువాత వారిని తాను రక్షింపజాల నని బెదరుపెట్టి వెనుకకు మరల్చెను. కడపట ఆగస్టు ౧౨వ తేదీనా డీ యుద్ధము ముగిసినది. పాలకు ఇతెరాజానకు ౩౦౦పర్దనుల పన్ను చెల్లించునట్లును, కొలు మాత్రము నామకార్థము వెంకటరాజు పేర వ్రాసియిచ్చునట్లును నేర్పాటు గావించి పట్టణమును విడుదలజేసెను; మఱియు వెంకటరాజుపరువును గాపాడుటకొఱకు కతని భటులు పదిమంది కోటవాకిట గాపుండుట కేర్పాటు సేయబడెను. లిపరాజు చెఱనుండి విముక్తుడాయె. అతడును, రఘునాథుడును గలిసి యటుపిమ్మట శాంతికి భంగము గలిగించమని మాట యిచ్చిరి.

యువకుడగు సీతిరామనాయకుని (రాయలు) ప్రథమ రాజకార్యము మధురనాయకునితో యుద్ధము. ఈ యుద్ధమున తంజావూరి నాయకుడు రాయలకు బ్రాపై నిలచెను. ఇతెరా జతని (రాయల) వెంట యుద్ధరంగమునకు నడచెను. వెంకటరాజు ఇజ్‌బ్రాంట్సు ముందు తాను దేశమునకు రాజైనట్లు ప్రవర్తింపదొడగెను. పెదరాజును చెఱనుండి విడిపించుటకై ఇజ్‌బ్రాంట్సు ప్రయత్నము జేసెను. కాని యతని కడక కొనసాగలేదు.

వెంకటరాజు, నూతనముగ బొందిన రాజప్రాతినిధ్యపదవి బడి, విజయనగరసామంతుడైన తిమ్మానాయకుడు మఱియొక నాయకునితో గలిసి యొత్తివచ్చుచున్నా డనియును, బలికటుపురమందలి యుద్ధభటుల నందఱిని దనకు సహాయ మంపవలయు ననియు నవంబరు ౨౮నా డొక జాబు నిజ్‌బ్రాంట్సుకు వ్రాసెను. కాని యతనికి (ఇజ్‌బ్రాంట్సుకు) ఎవ్వరితోడను విరోధము పెట్టుకొనుట కిష్టము లేకపోవుటచే నత డందుల కియ్యకొనలేదు.

పట్టణద్వారమునకు సంబంధించిన యొక వ్యవహారమునుగూర్చి డిసంబరు ౧౭వ తేదీనా డొక యుత్తరము వ్రాసిరి; దానికి ప్రత్యుత్తరముగ, నే డెనిమిది మాసములనుండి వెంకటరాజు మొదలగువారు పలికటను స్వాధీనపఱచుకొనుటకు యత్నము సేయుచుండుటచే బట్టణమునకు వాస్తవముగ పాలకు డెవ్వడో తెలియకున్నది; విషయమును దనకు విశదపఱచవలసిన దని ఇజ్‌బ్రాంట్సు వ్రాసెను. వారు దానిని గూర్చిన సమాచార మప్పుడె ఇతెరాజున కంపె నని జవాబు వ్రాసిరి. కాని ఇది వారు వెంకటరాజును పలికట యందు స్థాపించుటకొఱకు జేసిన యుక్తియై యుండవచ్చును.

పెదరాజు తుదకు చెఱనుండి విముక్తుడాయెను; రఘునాథరా జతనివలన దనకు ముప్పు రాగల దని జంకి క్రీ. శ. ౧౬౨౫ ఫిబ్రవరి మొదటి తేదీనాడు పలికటనుండి పాఱిపోయి వెంకటరాజును గూడెను. అప్పటి కాతని యొద్ద తజపయు,నల్పసంఖ్యాకులు మఱికొందఱు నాయకులు మాత్ర ముండిరి; వారియందు పెదరాజు చెఱయం దుండునపు డతనికి బదులుగ భారుపత్య మొనర్చిన కిష్టన్నరా జొక్కడు. ఈర్ష్యాళువులగు నీ నాయకుల నొండొరులతో బోట్లాడనీయక ఇజ్‌బ్రాంట్సు మరల మే నెలలో సమాధానపెట్టవలసివచ్చెను.

అక్టోబరు ౨౯, క్రీ. శ. ౧౬౨౮ జింజివారు తేనాంపట్టణమును దోచుకొనిరి. (క్రీ. శ. ౧౬౨౩ డిసంబరులో జింజినాయకుడు మృతి నందెను. అతని శవముతోగూడ నతని భార్యలు ౨౬౩ మంది సహగమన మొనర్చిరి).

క్రీ. శ. ౧౬౨౫ ఫిబ్రవరి. తంజావూరిరాజ్యమున మలబారు పరతుల రకపోకలకు ముఖ్యస్థానమగు పేటను మధురనాయకుడు దోచుకొని తగులబెట్టెను.

మే నెలయందు సీతిరామ ఇతిరాజులదండు మధుర రాజ్యమునందలి శ్రీశిరపురమును ముట్టడించినది; కాని యుద్ధ మచిరకాలమందె ముగిసినది. ఈ తరుణమున సుల్తాను ఖోరాము (ఖుర్రము) ఇంకను గోల్కొండ రాజ్యమునకె తొరియుండెను; అతని సోదరు డా రాజ్యముపై దన పట్టును బిగియించెను; అతడు

(ఖుత్తము) గడి ప్రాంతమందలి కరపరకు వచ్చెను; మార్చి నెల మొదటి తేదీనా డతడు కొండపల్లి భాగనగరముల మధ్య నుండు ఇబ్రహీముపట్టణము జేరెను; అతని గోల్కొండవారు తనకు బట్టి యీవలయునని చక్రవర్తి యాదేశ మొనర్చెను.

విజయనగర సామంతుడును, చెంగల్పట్టూరు (చెంగల్పట్టు)న కధిపతియు నగు సింగమనాయకుడు (సామంత) రాజు లందఱిలో ప్రముఖుడు. క్రీ. శ. ౧౬౨౫ ఆగస్టు ౫ వ తేదీనా డితడు ౧౦,౦౦౦ సైన్యముతో కాళహస్తి సమీపమునకు వచ్చెనని ట్రిస్ట్రాంట్సుకు వర్తమానము వచ్చెను. ఈ వార్తను విన గనే యతడు (పట్టణమునకు ?) దక్షిణపుపైపున నుండిన మెదంబ్లీసును మఱికొన్ని చిన్న యుద్ధనావలను బలిసున్న కటకు రప్పించెను. ఆసాయంత్రమే గెల్డరియా కొకమైలు దూరమున నుండు నందియంబాకదుర్గపాలకునికడనుండి మూడునాలుగుకందలమందిలో దన కోటకు రాత్రింపుచు పెదరాజున కొక జాబు వచ్చినది. కాని యా దుర్గాపతి సింగమకు రక్తసంబంధముగల బంధు వగుట వలన, నతని ప్రార్థన పలికటకు గా పెవ్వరిని లేకుండ సేయుటకు బన్నిన కుతంత్రమై యుండు నను తలంపు గలిగినది; కావున నిజము దెలిసికొనుటకై ఇన్గ్లీ ప్రాంట్సు పలికటపరిసరప్రదేశములకు చారుల నంపెను.

ఇంతే కాదు; విజయనగర సామంతులలో మఱి యొకడగు పై పేర్కొనిన తిమ్మనాయకుడు పలికటు మీదికి వచ్చుచుండెను; కాని యత డచటికి జేరుటకు ముందు తిరువెంగళనాథరాజు రాష్ట్రమును దాటవలసి యుండినది. ఈ తిరువెంగళనాథరాజున కన్యసామంతులకంటె సీతిరామయిత్తెరాజులయెడ విశ్వాస మధికము; కావున వారి యాజ్ఞ లేక, తిమ్మనాయని దనరాష్ట్రము నుండ బోనిచ్చుటకు తడియ్యకొనలేదు. ఇట్లతడు సీతిరాముని యధికారమునకు హానికరమైన తిమ్మనాయక సింగమనాయకుల సంయోగమును భగ్నము గావించెను; మఱియు నీ తిరువెంగళనాథరాజు కొండలరాజు చిన్నోబ్రా జను నిరువురు రాజులను గూడి తన ప్రభువు యొక్క హక్కులను గాపాడుటకు నడుము బిగి యించెను.

సింగమనాయకునికి ప్రాత గ్రొత్తదండు వచ్చి చేరినది; ౧౦వ తేదీనా డతడు గెల్డరియాకు $\frac{3}{8}$ మైలు దూరమున నుండు కాటూరున విడిసెను. ఇన్గ్లీ ప్రాంట్సు బోగరెమెడిరోపై కను యుద్ధనౌకలలోని భటులను కోటలోనికి రప్పించుకొనిరెను. మెదంబ్లికు ౧౪వ తేదికిముందు రాలేదు. పలికటను ముట్టడించుటకు సమయ మనుకూలముగ నుండినను సింగమ యట్లు సేయ లేదు. ౨౦వ తేదీన సింగమ దన స్వదుర్గమగు చెంగల్పట్టూరునకు మరలిపోయెను; ఇతరరాజులుగూడ నట్లే వెనుదిరిగిపోయిరి. ఇన్గ్లీ ప్రాంట్సు యథాపూర్వము వర్తకవ్యవహారములను నడపుకొన నారంభించెను. పోర్చుగీసులవలన నెూసపోవుటచేతను, బలికటద్వీపనగరముయొక్కయు గెల్డరియాకోటయొక్క బలాధికత గని వెరగందుటచేతను, సింగమనాయుడు కాళహస్తి మీద నెత్తిపోవుటకు దనతో గలిసిరమ్మని పిలిచెను.

క్రీ. శ. ౧౬౨౬ ఫిబ్రవరిలో సుల్తాన్ మహమదు అమీను మరణము; ౧౩ యేండ్లప్రాయమువాడగు నతని పుత్రుడు డబ్దుల్లాయొక్క రాజ్యాభిషేకము.

దక్షిణకోరమండలమున రాజులయొక్కయు, నాయకులయొక్కయు పరస్పర వైషమ్యమువలన గంపెనీవర్తకము సాఫుగ నడవదాయె. గెల్డరియాకోట దినసరి పుస్తకమున క్రీ. శ. ౧౬౨౬ ఏప్రిలు ౨౬ తేది క్రింద, తిమ్మనాయడు ౨,౦౦,౦౦౦ పగోడల విలువ గల రెండు పందికడియములకొఱకు శివప్పనాయకుని స్థానమగు పోలూరుకోటకు ముట్టడి వేసినట్లు వ్రాసి యున్నది.

ఈ సంవత్సరమందే జూన్ నెలలో సీతిరామ ఇతిరాజులు తిరవిరు (తిరువూరు) పరిసరములందు తమ దళములతోగూడ విడిసియుండిరి; పురుచేరిమిట్టలమీది యేచపనాయకుని కుమారుని సీమపై బడి జింజిమధుర నాయకులు వల్దావూరుకోటపర్యంతము దనుబెట్టి సీతిరామ ఇతిరాజులను బాధింపదొడగిరి; తరువాత పైకోట ముట్టడింపబడి క్రీ. శ. ౧౬౨౪ ఏప్రిలు ౧౭ వ తేదీనాడు జింజినాయకునికి వశపడెను. అటుపిమ్మట నతడు కాళహస్తి మేరలకు గల తీరదేశమున కధిపతియైన కస్తూరి రంగపకడనుండి కూనిమూరును స్వాధీనపఱచుకొన దల పెట్టెను; కాని యతడు కడుప్రయాసపై జింజినాయకు

పెదిరించగలిగెను. అప్పుడు తిరువెంగళనాథరాజు రేలుబడిక్రింద నుండిన పొన్నేరినుండి వెంకటరాజు ౧౦౦౦౦ పగోడలను నిర్బంధించి కొనెను. సర్వత్ర బలాత్కార ధనాపహరణ సామాన్యమని ఇజ్న్బ్రాంట్స్ వెంబ.

ఫిబ్రవరి క్రీ. శ. ౧౬౨౮. శ్రీహరికోటమొదలు కరవెదలకు గల ముప్పదిమైళ్ళ ప్రదేశములో డచ్చివారు వర్తకమును నడుపుకొనటకు దగు వసతుల గలిగించుచున్నాడ వని వెంకటపతినాయకుడు ఇజ్న్బ్రాంట్సున కొక జాబు వ్రాసెను. ఇజ్న్బ్రాంట్సు వెంకటపతినాయకుడు నివసించు కాళహస్తికి దన బ్రాహ్మణగుమాస్తా నంపెను. ఆ గుమాస్తా వెంకటపతినాయకునివద్దనుంచి యొక కౌలును, డచ్చివారికడనుండి యర్ధసుంకము పుచ్చుకొవలసిన దని గ్రామాధికారుల కొక యాదాస్తునుగొని మార్చినెల ౧౩ తేదీన మరలి వచ్చెను. ఆంగ్లేయజేమవర్తకుల వియపోటిని నివారించుటకు ఎత్తుగడలు.

ఖానిసవ్యాపారము—ఒక్క కానిమూరునందే యొక నెలలో ౨౨౮ ఖానిస లమ్ముడుపోయిరి.

పోర్చుగీసుల యధికారమును నాశముచేయుట కొఱకు పెరషియానుంచి బిజాపురగోలకొండలకు రాయబారుల రాక.

తన సామంతు లాండరులతో దగవులాడుచుండ వారిపై దన యధికారమును నెలకొల్పుటకు బ్రయత్నము సల్పుచుండిన సీతిరాముడు చిట్టచివరకు విశ్వాసపాత్రుడైన ఇతెరాజుసహాయమువలన క్రీ. శ. ౧౬౨౯ జూలై నెలలో గడు పెంపంది రాజ్యమునంతటిని దన యేలుబడిక్రిందికి దెచ్చుకొన నారంభించెను. జింజి నాయకుడుగూడ నతనిపక్షమున జేరెను. కస్తూరిరంగప్పయు, సింగమనాయకుడును బరాజితులై సంధిచేసికొనిరి. సంధిషరత్తులప్రకారము వారు తమ దుర్గములగు (వందవాసి మద్రాసుపట్టణములమధ్యనుండు) కరుంగొలిపాళెమును, సెంగల్పట్టూరును, మఱికొన్ని చిన్నకోటలను స్వాధీనపఱచిరి. ఇతెరాజుకుమారుడు పలికటకు చూపుమేఱయందుండు తిరుబతూరును వందియం బాకకొటూరులతోగూడ సాధించెను. అప్పుడు రాయల సైన్యమున ౧,౦౦,౦౦౦ సైనికు లుండిరి. విజయనగర లేక కర్ణాటకరాజ్యమునందలి పూర్వోత్తరభాగము నంతటిని దన యాధిపత్యము క్రిందికి దెచ్చుకొని యుంచిన వెంకటపతితో యుద్ధము సేయవలసి యుండెను; కాని యుద్ధప్రసక్తి లేకయే యతడు రాయలకు వశవర్తియాయెను.

ఇంతవఱకు గెల్డ్రియాకోటచే సంరక్షింపబడుచుండిన పలికట పట్టణముగూడ సీతిరాముని యధికారముక్రిందికే వచ్చెను.

క్రీ. శ. ౧౬౨౯ అక్టోబరు ౨౧. సీతిరాముడు ౬౫,౦౦౦ దళముతో తిరుత్తనికడ విడిసియుండగా నిజ్న్బ్రాంట్సుచే బంపబడిన వార్తావహు లొక యేనుగునున్న, ౬౮౦ పౌనుల భారముగల శ్రీగంధపు చెక్కలు, ౮ పీగెలలు (? దర్పణములు), ౨ మూటల తెల్లచక్కెర, ౨౩ ముత్తెపు ముత్యక్క, ౬ గుండ్రపు టద్దములు మున్నగు కానుకలు గొనివచ్చి యతని దర్శనము జేసికొనిరి. అదే సమయమున వెంకట ౧౫,౦౦౦ మందితో వచ్చుచున్నాడని రాయ లతని కెదుర్కొలు సేయ బయలువెడలెను.

అక్టోబరు ౨౮. (ఇజ్న్బ్రాంట్సుయొక్క రాయబారియగు) రేనీర్సు సీతిరాముని దర్శనము జేసికొనెను. అప్పు డతడు డచ్చివారిని దేశమునుండి తఱిమివేసిన యెడల పోర్చుగీసులు దనకు విస్తారము ధన మిత్తు మని సంకేత మంపి రనియు, దానికి దా నొప్పుకొనలే దనియును జెప్పి, యిరువురు విదేశీయులును దన రాష్ట్రమునం దొండొరులతో మైత్రి గలిగియుండుట శ్రేయస్కర మనియు దన యభిప్రాయమును వెలిపుచ్చెను. రెండు రోజులు గడచినవెనుక నతడు శాంతోమె కెట్టి యుపద్రవమును గలుగజేయమని డచ్చివారిని కరారుసేయుమని కోరెను.

క్రీ. శ. ౧౬౨౯ అక్టోబరు ౩౧. సీతిరాముడు డచ్చివారి యోగ్యతను జక్కగ గ్రహించెను. వారికి సుంకవిరహితముగ వర్తకము నడుపుకొను హక్కుతో గూడ మఱికొన్ని మర్యాదలను బ్రసాదించి వీడ్కొలిపి వేలూరునకు బయలువెడలెను.

క్రీ. శ. ౧౬౩౦ మే, ౨౮. సీతిరాముని మరణము. అతని చితిపై ౪౩ స్త్రీలు సహగమనము జేసిరి; మరణకాలమప్పు డతని వయస్సు ౨౦ యేండ్లు; బిడ్డలు లేరు; సోదరులును లేరు; సోదర (సోదరీ ?) పుత్రుడగు అనిగొనయ్య యనువానిని దనపిమ్మట రాయపట్టమునకు నియమించెను. (సశేషము)

# తాళంచెవులు

[కథానిక]

'మధుమూర్తి'

"చేతిగడియారాన్ని కొనిపెట్టవే అమ్మా" అని అమాయికంగా రఘు తల్లిని అడిగాడు. పుత్రుని కోరికను నెరవేర్చడం అంత తేలిక కాదు. ధనం మూలుగుతున్న ఆ ఇంట్లోనివారికి చేతిగడియారాలు కొనడం అంటే అంత కష్టమైన పనీ కాదు. ఏమిటీ వైరుధ్యం అంటే-దానికి జవాబు తాళంచెవుల గుత్తి ఇంకా ముసలాయన బొడ్డునే ఆశ్రయించుకొని ఉండడమే.

రఘుకు ఈ కోరిక కలిగినవెంటనే ముందుగా తననే అడిగాడని పార్వతమ్మకు తెలుసు. ఆ ఇంట్లో రఘుకు ఆమె తల్లి కావడమే అందుకు కారణం. పుత్రులు తమ కోరికలను ముందుగా మాతృహృదయానికి నివేదించడం సహజమే. ఈ సంగతి పార్వతమ్మకూ తెలుసు. కాని పట్టణం పోయి కొనవలసిన ఈ వస్తువును ముందుగా తననే రఘు ఎందుకు కోరాడో అని ఆమెకు బాధ కలిగింది. ఇంతకుముందు అప్పుడప్పుడు పల్లెలోని మంచివస్తువులు కావాలని కోరిక పుట్టడం, వాటిని తల్లిద్వారానే తీర్చుకోవడం అతనికి అలవాటయింది. అలవాటుప్రకారం అడిగాడని అనుకుంది. ఆ గడియారం తనద్వారా రాదని చెప్పి తండ్రిని అడగమందా మనుకుని ఆమె "నాన్నను అడగరా అబ్బాయి!" అని రఘుకు జవాబు చెప్పింది.

రఘుకు ఇది సరికొత్త పని. ఎన్నడూ ఇంతవరకూ చంద్రయ్యను కొడుకు ఏమీ కోరలేదు. కొడుకునకు కోరికలు ఉన్నాయని అతనికి తెలుసు. ఐతే వాటిని నెరవేర్చే బాధ్యత ఇంకా తనమీదకు రానందుకు సంతోషిస్తూండేవాడు. చంద్రయ్యకూడా ఒక కొడుకుకు తండ్రి అయినప్పటికీ అతనింకా తండ్రిచాటు కొడుకుగానే ఉండిపోయాడు. ఇంకా తాళంచెవులు తనచేతికి అందకపోవడమే ఈ స్థితికి కారణం. ఇంట్లోకి చీపురుపుల్ల కావలసినా దానిని తెప్పించే భారం చంద్రయ్యకు కలగలేదు. ఇంకా ముసలి రాఘవయ్యే ఈ శ్రమను పడుతూంటాడు. రఘుకు ఈ సంగతులను అర్థంచేసుకునే వయస్సు లేకపోయినా తండ్రిని చేతిగడియారం కావాలనీ, కొనిపెట్టమనీ అడగడానికి జంకాడు. అలవాటు లేకపోవడమే ఈ భయానికి కారణం.

కాని చేతిగడియారం అతనికి కావాలి. అది అతని తీవ్రవాంఛ. అది నెరవేరాలంటే తల్లివల్ల జరిగే పని కాదని అనుకున్నాడు. "తాతనే అడిగితేనో?" అనుకున్నాడు రఘు. అనుకున్న మరుక్షణంలోనే అతనిలో ఆనందం ఉబికింది. తిన్నగా తాతగదిలోకి వెళ్ళాడు. "తాతా! చేతిగడియారం కొనిపెట్టవూ?" అన్నాడు. అత నెంత జాలిగా అడిగాడో చెప్ప తరంకాదు. కాని తాతకూ, జాలికీ చాలా క్రోసులదూరం. ఐతే తాతయ్య మరుక్షణంలోనే మనుమనికి జవాబు చెప్పలేదు.

రఘుప్రశ్న తాతకు అలవాటయిన ప్రశ్న కాదు. ఈ ప్రశ్నతో తాత చాలా తబ్బిబ్బయాడు. ఎన్నడూ తనను ఏదీ కోరలేదు. ఏదికి, పెద్దకోర్కెలు లేవుకులేవని సంతోషిస్తూండేవాడు. చిన్న చిన్న కోరికలు ఏవి

కలిగినా అవి తనవరకూ రాలేదు. తోపుడు బండి తల్లి చేయించింది. దానిని ఆమె తన పుట్టింటినుంచి తీసుకొని వచ్చింది. తన కేమీ ఖర్చు కాలేదు. యూనాం సిల్కు జుబ్బాలూ, జోళ్లూ కావాలంటే అవీ పార్వతమ్మ తన అన్నగారిద్వారా సంపాదించింది. ఈనాడు వీళ్ళందర్నీ వదలి, రఘు తనవద్దకు చేతిగడియారం కావాలంటూ రావడం ఏమిటా అని రాఘవయ్య ఆశ్చర్యపోయాడు. ఇదేదో కోడలు చూపిన కార్యక్రమం అనుకున్నాడు.

"మీ మామయ్యని అడగలేకపోయావా?" అని మనమణ్ణి ప్రశ్నిద్దామనుకున్నాడు కాని ఆ ప్రశ్నను మార్చి "మీ అమ్మను అడిగావా?" అన్నాడు.

"అడిగాను తాతయ్యా!" అన్నాడు రఘు.

"ఏమంది?"

"నిన్ను అడగమంది" అన్నాడు రఘు.

అబద్ధాన్నే పలికాడు రఘు. కాని ఆ అబద్ధం ఎంత ప్రమాదాన్ని కలిగిస్తుందో ఆ లేత మనస్సుకు తట్టింది కాదు. రాఘవయ్యకు మాత్రం ఈ సమాధానం నచ్చింది. కోడలి కార్యక్రమం అని తను ఊహించడం నిజమేనని ఈ అబద్ధం బలపరిచింది. దీనికి మరొక ఎత్తు ఎత్తాలని రాఘవయ్య మనమనితో "ఒకేయ్! నాన్న నడుగు" అన్నాడు.

తండ్రిని అడిగే అవసరం ఉండదు కదా అని సంతోషపడ్డ రఘుకు తాతజవాబు గాభరా పెట్టింది. ఎంతో ఆశతో, నాన్నను అడగక్కర్లేదు కదా అని చేసినపనికి ఇలాంటి ఫలితం కలిగినందుకు రఘు దిగులు చెందాడు. తాతసూచనవల్ల ఏమీ ధైర్యంకలగలేదు. మళ్ళీ అమ్మదగ్గిరికి పరుగెత్తాడు.

"ఏం రా! నాన్న నడిగావా?" అందామె.

"లేదమ్మా, తాత నడిగా"

"ఏమన్నారు?"

"నాన్న నడగమన్నాడు"

పార్వతమ్మా, రాఘవయ్యా ఒకే సలహాను సూచించారు. కాని ఒక్కొక్కరి సలహా వెనుక భారతమంతటి అర్థా లున్నాయి. ఇవి రఘుకు తెలియవు. కాని పార్వతమ్మకు తెలుసు. కాని కుర్రవాడు తండ్రిని అడగడానికి భయపడి తాతను అడిగినందుకు మామగారి తత్వం కూడా బైటపడింది. అందుకు ఆమె సంతోషించింది. కాపరానికి వచ్చి పదిహేను సంవత్సరాలైనా కూడా పార్వతమ్మకు మామగారి తత్వం తెలియక పోలేదు. కాని, మనమడన్నా, మనమని కోరికలు తీర్చడమన్నా సరదాగాని, వాత్సల్యంగాని ఆయనలో లేవన్న సంగతి మాత్రం ఈ రోజునే తెలిసింది. అందుకే ఆమె ఆనందించింది. కాని ఎదురుగా దిక్కుమొహంతో కూచున్న రఘుకు ఏం జవాబు చెప్పాలి? ఎంతగానో ఆమె ఆలోచించింది. ఆ ఆలోచనతో ఆమె మౌనంగా ఉన్నప్పుడు రఘు "మామయ్యను అడగనా? అమ్మమ్మను అడగనా? పిన్నిని అడగనా?" అని తనకు వీలైన మార్గాలన్నింటినీ వెల్లడిచేస్తూ ప్రశ్నించాడు. అన్నింటికీ కూడా ఆమె వద్దన్నట్లు తల ఆడించింది. అంతతో రఘుకు ఓర్పు తక్కువై "నా కీవేళ చేతి గడియారం తప్పకుండా కావాలి" అంటూ ఏడవడం ప్రారంభించాడు.

పదేళ్ళ కుర్రవానికి చేతిగడియారాన్ని ఉపయోగించడం తెలియకపోవచ్చు. కాని ఆ సరదా తీర్చడానికి శ్రమలేని గొప్పతనం ఈ ఇంటికి ఉండడం చేతనే పార్వతమ్మ తనకుమారుని అశక్తతను మరోవిధంగా భావించలేక పోయింది. అదీగాక, పుత్రుని కోరికలు తీర్చడానికి ఎన్నాళ్లు తను పుట్టింటివారిని ఉపయోగించుకుంటుంది? రాఘవయ్యగారి లుబ్ధత్వం తనవారికి తెలుసుకాబట్టి, ఆడబడుచు ఎక్కడ ఇబ్బంది పడుతుందో అని తనవాళ్లు బాధపడతారని తెలుసు కనుక తన కోరికలు, పుత్రుని కోరికలు, భర్త కోరికలూకూడా నెరవేరుతున్నాయి. "మూలుగుతూన్న డబ్బును మామగారు కదపడు. ఇది ఎంతకాలం సాగగలదు!" అనే భావాలు ఆమెలో పుట్టి తిరిగి మరొకసారి కొడుకుతో "నాన్ననే అడుగు నాయనా! ఈ వేళ కాకినాడ వెళ్లి గడియారం కొనిపెడతారు" అని ఓదారుస్తూ చెప్పింది. రఘుకు గడియారం కోరికతో బాటు కాకినాడ చూడాలనే కోరికకూడా కలిగింది. పాతకోరిక కొత్తకోరికతో మరింత ప్రకాశవంతంగా కనిపించింది. ఆ ఉత్సాహమే తండ్రిని అడగడంలోని భయాన్ని వెనక్కి నెట్టింది. తిన్నగా రఘు తండ్రిగదిలోకి వెళ్లాడు.

"నాన్నా ! నన్ను కాకినాడ తీసుకొని వెళ్ళి నాకో చేతిగడియారాన్ని కొనిపెట్టవూ ?" అని ఘట్టిగానే అడిగాడు రఘు. కొడుకులో కోరికలు ఐదేళ్ళనుంచీ కలుగుతున్నాయని చంద్రయ్యకు తెలుసు. కాని ఇంతవరకూ తనకు తెలియకుండానే వాని కోరికలు నెరవేరుతున్నాయి. అందువల్ల ఈ వేళ ఈ ప్రశ్న అతనికి చాలా గాభరా కలిగించింది. తన సందేహాలను ఇలా తీర్చుకున్నాడు.

"అమ్మనడుగు" అన్నాడు.

"అడిగాను"

కొంచెంసేపు ఆగి చంద్రయ్య "తాత నడుగు" అన్నాడు.

"అడిగాను" అన్నాడు రఘు.

చంద్రయ్యకు గాభరా ఎక్కువైంది. ఇదేదో తనమీదకు తండ్రీ, భార్యా పంపిన దండయాత్రలాగే ఉందనుకున్నాడు. తన కింక మార్గం ఏమిటి ? "చేతిగడియారం ఇప్పుడిప్పుడే నీకు ఎందుకురా? పెళ్ళినాటికి అలకమంచంమీద కోరుకుందువుగానిలే" అని సర్దిచెప్పడానికి చంద్రయ్యకు ధైర్యం చాలలేదు. రఘు అలవాటులేని పనులను రెండింటిని చేయడమే ఈ అధైర్యానికి కారణం. తననూ, తాతనూ రఘు అడగడం వింతే! అందులోనూ తొలిసారిగా కొడుకు తనను అడగడంచేత చంద్రయ్యలో పుత్రవాత్సల్యం కొత్తగా పుట్టుకొచ్చింది. రఘుచేతికి గడియారం పెడితే వాని చిరునవ్వులో తనకు ఆనందం ఉన్నట్లు చంద్రయ్య కొత్తగా ఊహించాడు. "పుత్రోత్సాహము తండ్రికి" అన్నదానిలోని అర్థాన్ని ఈవేళే చంద్రయ్య గ్రహించాడు.

"సరే నాయనా......కొంటాలే" అన్నాడు చంద్రయ్య.

"కాకినాడ నేనూ వస్తా నాన్నా"అన్నాడు రఘు.

"అలాగే".

రఘు ఇంక అక్కడ నిమిషమైనా నిలబడలేదు. చంద్రయ్యకుమాత్రం నిస్పృహా కలిగింది. చేతిగడియారం కొనిపెడితే, ఇంక మాటిమాటికీ వచ్చి ఇది కావాలి, అది కావాలి అని తనను పోరుపెడతాడేమో అనుకుని చంద్రయ్య భయపడ్డాడు. ఐనా ఈ చేతిగడియారం కొనాలంటే తనదగ్గ డబ్బేది? నాన్న చిల్లిగవ్వ ఇవ్వడు. ఎక్కడో అప్పు తేవాలి. ఇప్పుడు అప్పులు ప్రారంభమైతే అవి అలా పెరిగిపోతూనే ఉంటాయేమో అని దిగులుచెందాడు. కాని పుత్రుని—తొలిసారిగా తనకు కలిగిన ఈ బిడ్డ—అందచందాలకు ఖర్చుపెట్టకపోతే వాడు కలిగినందుకు తనకు వేరే ఆనందం ఏదీ అనే మరో ఆశాభావం చంద్రయ్యలో జనించగానే పెదవిమీద చిరునగవు ఉదయించింది.

మరునాడు చంద్రయ్య రఘును వెంటబెట్టుకుని కాకినాడ వెళ్ళాడు. ప్రక్కింటి సీతారామయ్యదగ్గర నూరురూపాయలు చేబదులు తీసుకుని చంద్రయ్య పట్టణం వెళ్ళాడన్న సంగతి రాఘవయ్యకు తెలిసింది. ఆ క్షణంనుంచీ ముదిగన్నుల్లో విప్లవం రేగింది. పట్టాలను తప్పించుకుని రైలు నడుస్తూంటే మరి ముసలిపట్టాలకు కోపం రాకుండా ఉంటుందా ?

"వీడు అప్పులు చేయడం ప్రారంభించాడూ ? ఇకనేం ? నేను హరీ అనేటప్పటికి నా శ్రమంతా హారతికర్పూరం ఔతుంది" అనే విషాదం వెలిసే ఆగ్రహం రాఘవయ్యను ఆవహించింది.

సీతారామయ్యను పిలిచి "ఇంకెప్పుడూ మా వాడికి అప్పు ఇవ్వకోయ్"అని చెబుదామనుకున్నాడు రాఘవయ్య. కాని పిలవక్కర్లేకుండానే సీతారామయ్యే ముసలాయనదగ్గరకు వస్తున్నాడు. సీతారామయ్యకూ తెలుసు—చంద్రయ్యకు ఇవ్వడం ప్రారంభించిన అప్పు కురుక్షేత్ర సంగ్రామాన్ని తీసుకొనిస్తుందని.

సీతారామయ్యకూడా రాఘవయ్యతో సమంగా తూగగల ఆస్తిపరుడే! గ్రామస్థులంతా ఈయనను దయకలవాడంటారు. అంటే కాస్త పరోపకారబుద్ధి ఈతనిలో ఉందని అర్థం.

సీతారామయ్యను చూడగానే రాఘవయ్య తనే సంభాషణ ప్రారంభించాడు. "మావాడికి అప్పులు తీసుకోవడం నేర్పుతున్నావా ?"అని ప్రశ్నించాడు.

"నేను నేర్పేదేమిటి ? అవసరం ఎంతవాడిచేతనైనా చేయి చాపిస్తుంది."

"మావాడి కేమీ అవసరం లేదే!"

"కుర్రవానికి చేతిగడియారం కొనిపెట్టడం అవసరం కాదూ ?"

"బొడ్డూడని పిల్లకు గడియారా లెందుకు చెప్పు"

"మరి ముద్దూ, మురిపెమూ అంటే ఏమిటి రాఘవయ్యా ?"

"డబ్బు తగలెయ్యడం ముద్దా ఏమిటి ?"

సీతారామయ్య అనుకున్నట్టే ముసలాయన ప్రశ్న బయటపడింది. ఇంక ఆగకుండా ఉపన్యాసం సాగించాడు.

"ఎవరి ముద్దుకోసం డబ్బు తగలెడుతున్నాడు ? ఊళ్ళోవాళ్ళ ముద్దుల్ని చెల్లించడానికి కాదు. తన కన్న కొడుకు ముద్దు చెల్లించడానికి. అతనుకాక మరెవ్వరు ఆ కుర్రవాని కోరికను తీరుస్తారు ? ఆ కుర్రకుంక కూడా అసహజంగా ఏమీ కోరలేదు. ఇంత డబ్బు ఉన్నవాళ్ళే పిల్లల ముద్దుల్ని తీర్చకపోతే, ఆ మన సుబ్బయ్య తన కొడుక్కి ఇలాంటివి కొనిపెట్ట గలడా చెప్పు".

సుబ్బయ్య పేరు చెబితే రాఘవయ్యకు ఒళ్లు మండిపోతుంది. సంపాదన తక్కువైనా సుబ్బయ్య శ్రమపడి తెచ్చిన డబ్బు హాయిగా అనుభవిస్తాడు. రాఘవయ్య అరవై ఏళ్ళ కాలంలోనూ ఇలాంటి అనుభవాన్ని చూపకపోవడంవల్ల ఊళ్ళోవాళ్ళంతా రాఘవయ్యలుబ్ధత్వంమాట వచ్చినప్పుడు సుబ్బయ్య ప్రస్తావన తెచ్చి అతన్ని పొగుడుతూవుండడం కొన్ని పుష్కరాలనుంచి జరుగుతోంది. ఈ అస్త్రం రాఘవయ్యకూ వినిపిస్తూంటుంది. ఇప్పుడు సీతారామయ్య తిరిగి మరోసారి వినిపించాడు. అందుచేత మాట పెకల్లేదు. సీతారామయ్య తనఎదుటినుంచి వెళ్ళిపోతే బాగుండు నన్న చూపు అతని ముఖంలో కనిపిస్తోంది. కాని సీతారామయ్య అలా వదిలే ఘటం కాదు. తను వదులుదామనుకున్న అస్త్రాల్లో ఇంకొక్కటి మిగిలిపోయింది.

"నీలాగ మీ అబ్బాయికి లుబ్ధత్వం లేదనుకోకు రాఘవయ్యా. నీ లుబ్ధత్వం నీవాళ్లమీదే ప్రయోగించ బడుతూంది. మీవాడు ఓమెట్టు ముందుకు వచ్చాడు. తనవాళ్ళకూ తనకూ ఖర్చుపెడుతున్నాడు. కాని ఇతరులకు ఖర్చుపెట్టడంలో మీవాడు నీ కుమారుడే!"

"ఎందుకు సీతయ్యా! ఇంక నన్నేమీ అనకు. అప్పు ఇవ్వడం, పుచ్చుకోవడం ప్రారంభమైంది. దీన్ని పెరగనియ్యకుండా మొక్కగా ఉన్నప్పుడే వంచెయ్యాలి. దీనికి ఏదైనా మార్గం ఉందా అని ఆలోచిస్తున్నాను." అన్నాడు రాఘవయ్య.

"అప్పు అనే పదం ప్రస్తుతం మొక్కగాని... మీవాడు...మహావృక్షమే అయ్యాడుకదూ! ముప్ఫయ్యేళ్లవయస్సు వచ్చినవాడిని ఎలా వంచలేవో అప్పుల మాటనూ వంచలేవు. అదీగాక ఇన్నాళ్లూ చంద్రయ్య ఓపిగ్గా ఊరుకున్నాడు. ఇంక ఊరుకోకూడదనే ఉద్దేశం అతనికి కలిగింది. దానికి కారణంకూడా బాగానే ఉంది."

"చేతిగడియారం కొనవలసిరావడమేనా కారణం ?" అన్నాడు రాఘవయ్య.

"నువ్వు మహా బతికితే పదేళ్లు బతుకుతావు. ఇలాంటి అవసరాలకే అతను డబ్బుకు వెతుక్కోవలసి వస్తుంది. పదేళ్ళలోనూ అతను మహాఅయితే పదివేలు అప్పు చేస్తాడే అనుకో. నువ్వు ఆనాటికి పోగుచేసే దానిలో అయిదోవంతు ఉండదు. ఔనంటావా ? ఇదే మీవాడి ఉద్దేశ్యం" అన్నాడు సీతారామయ్య.

"ఇక్కణ్ణుంచి వెళ్లిపో బాబూ!" అని అనగలిగాడు రాఘవయ్య. సీతారామయ్యకు ఇంక ఉండవలసిన అవసరమూ తీరింది మహాఅస్త్రాన్ని వదిలి తుండుకడ్డ బుజాన్ని తగిలించుకొని సీతారామయ్య నిష్క్రమించాడు.

రాఘవయ్యకు ఒళ్ళు తెలియని విచారంవచ్చింది. రాత్రల్లా బాధపడ్డాడు. మరునాడు జ్వరం వచ్చింది. చంద్రయ్యా, కొడుకూ తిరిగివచ్చేటప్పటికి రాఘవయ్య మంచంమీదే ఉన్నాడు. చంద్రయ్యకు ఈ అవస్థకు కారణం తెలిసివచ్చింది. ఐతే ముసలాయనలో మార్పు వస్తుం దనుకున్నాడు కాని తాళంచెవు లింకా పండంటి శరీరాన్నే అంటిపెట్టుకొనిఉన్నాయి. గుప్పిట్లోనే వాటిని గట్టిగా పట్టుకుని రాఘవయ్య పదిరోజులు గడిచాక ప్రాణాలను వదిలాడు. పాపం! అంతగా ప్రేమింపబడినందుకైనా తాళంచెవులు తనివెంట నడవలేకపోయాయి. చంద్రయ్య చేతిలో పడిపోయాయి. తాళంచెవుల గుత్తిని గట్టిగా చప్పుడుచేస్తే తాతయ్య ఓసారి పరకాయించి చూస్తాడనే నమ్మకం ఆఇంట్లో వారందరికీ ఉంది. అందుకే ఆ ఇంట్లో తాళంచెవులు నాట్యంచేయడం లేదు. వాటిని చంద్రయ్య భద్రంగా దాచిపెట్టిన భోషాణానికి ఉన్న తాళంచెవిమాత్రం శరీరాన్ని అంటిపెట్టుకొనే ఉంటుంది.




# జంతువుల విచిత్ర ఇంద్రియశక్తులు

"వాడి! ఏనుగుకండ్లు రా" అంటూంటాము అప్పుడప్పుడు ఎవరైనా చూపెట్టి. ఇలా అనే వారికి నిజంగా ఏనుగుకుండే దృష్టిశక్తిని గూర్చి తెలియనే తెలియదన్నమాట. దగ్గరలో ఉండే గుండుసూదినైనా చూడగలదుకాని, ఏనుగు ఇరవైగజాల పైన వుండే చెట్టునుగూడా చూడలేదు. కాని దాని ఘ్రాణేంద్రియాలు బహుచురుకుగా పనిచేస్తాయి. అర్ధమైలు దూరంలో వున్న మనిషిని సులభంగా పసికట్టేస్తుంది; కాకపోతే, మనిషిమీదుగా ఏనుగుమీదికి గాలి వీస్తూండాలి. ఏనుగులను వేటాడేవాళ్ళు ఈ ప్రకృతిరహస్యాన్ని గమనించాలి; గమనిస్తారు.

ప్రాణికోటిలో మనుష్యజాతే ఉత్తమమని విర్రవీగుతూంటాము మనం. ప్రకృతి ప్రతినిముషమూ మనల్ని మోసగిస్తూ ఉంటుంది. విశ్వములో వినిపిస్తూండే శబ్దాలన్నిటిని మనము వినలేమని, మీలో ఎంతమందికి తెలుసు? కొన్ని ఈలలు మనకు వినిపించనే వినిపించవు; కుక్కలకు స్పష్టంగా వినిపిస్తాయి. అప్పుడప్పుడు ఎలుకలు సంగీతకచ్చేరీ జరుపుతూంటాయి. ఆ సంగీతాన్ని ఎలుకలమాత్రమే వినగలుగుతాయి. కాని, కొందరు మానవులుకూడా వినగలరట.

చిన్నప్పుడు మనము కథలు వినేవుంటాము— శిలావారాజకుమారుడికి అన్ని జంతువుల భాషలూ వచ్చునని. అవన్నీ ఇల్లాంటి ప్రకృతిరహస్యాలమీద ఆధారపడి రాసినవేమో ననిపిస్తుంది. ఇంతెందుకూ— పక్షుల కిలకిలారావాల పూర్తిశబ్దాన్ని వినగలిగితే, మన చెవులు గింగురుమనిపోవూ! అది పనిగా, ఏ చెట్టు క్రిందో కూర్చుని ఆనందిస్తే తప్ప, ఈ సృష్టిలోని సంగీతవిద్వాంసుల సంగీతాన్ని వినే భాగ్యం లేదు మనకు.

మన దురదృష్టము ఇంతటితోటి ఆగిందా? తేనెటీగలు చూడగలిగే రంగు లెన్నో మనము చూడలేము. ఇంద్రధనుస్సులోని రంగులను చూచి మానవుడు పద్యాలు కట్టాడు. మిగతా రంగులను చూడగలిగితే, మానవుడు కవికన్న గొప్ప, గాయకునికన్న గొప్ప, చిత్రకారునికన్న గొప్ప కావచ్చు. సృష్టిరహస్యాల నన్నిటినీ అనుభవించగలిగితే సాధారణమానవుడు అధునిక అత్యుత్తమకవి, అత్యుత్తమగాయకుడు, అత్యుత్తమచిత్రకారుడూ కాడూ! అట్టి సంఘములోని ఔన్నత్యముముందర ఎవరెస్టుశిఖరము చిన్న తిన్నెగాబోలు!

రాత్రుళ్ళు గదుల్లో కూర్చుని ఏదైనా పుస్తకము అతిశ్రద్ధతో చదువుకుంటాము. వున్నట్లుండి నల్లటి జంతువొకటి మన కండ్లముందర వాయువేగముతో పరుగెత్తుతుంది. ముందరముందర మనల్ని ఆకర్షించదు. గదిలో ఆగోడనుంచి ఈగోడకు, నేలమీద నుంచి కప్పుకు విరామం లేకుండా ఒకటేపనిగా తిరుగుతూంటే, ఒకవిధమైన వేదన అనుభవించ ప్రారంభిస్తాము. ఇక దాన్ని ఏ గుడ్డతోనో తరమ నారంభిస్తాము. ఎంత ప్రయత్నించినా అది దొరికితేగా? ఇదుగో, ఈమారు! అంటూండగానే, మనదగ్గరకు వచ్చి అతిచురుకుగా తిరిగిపోతుంది గబ్బిలము. నిజమేమంటే, వస్తువుల ఉనికిని గబ్బిలము 'వినగలదు'. మీరు ఇంకొంచెము జిజ్ఞాసువులైతే ఎప్పుడైనా గబ్బిలా న్నొకదాన్ని పట్టుకొని, దాని కండ్లకు గంతకట్టెయ్యండి. గదిలో తీగెల నొకదానిని తయారుచేసి గబ్బిలాన్ని వొదలండి. ఒక్కసారికూడా తీగకు తగలకుండా అది తప్పించుకుంటూ తిరుగుతుంది.

మనము భయపడినట్లు కనిపిస్తే చాలు, కుక్క మొరగనారంభిస్తుంది. భయపడ్డప్పుడు మానవుడు ఒక విధమైన వాసనకొట్టాడు. మానవుడు గ్రహించలేడు కాని, కుక్కమాత్రము భయముయొక్క వాసనను చూడగలదు.

ఎంగెల్‌మన్ అన్నే జర్మనుదేశస్థుడు జంతుప్రవర్తననుగూర్చి పరిశోధన చేసినాడు. ఆ కృషిఫలితంగా కుక్కలు, పిల్లులు, కోళ్ళు మనకన్న చక్కని శబ్దగ్రహణశక్తి కలిగియున్నాయంటాడు.

అయిస్టర్ (ఇది ఒకరకపు నత్తగుల్ల) అనే జంతువుకు కండ్లు లేనేలేవు. కాని నీళ్ళలో దానిపైనున్న చిప్పు తెరుచుకొని ఆహారాన్ని సేకరిస్తుంది. ఇంతలో దానిమీదుగా దేని నీడైనా ప్రాకితే, చిప్పను మూసేస్తుంది. విజ్ఞానశాస్త్రము ఇటువంటి ప్రవర్తనలన్నింటినీ పెద్దపెద్ద మాటల్తోటి వర్ణించి నోరు మూసుకొన్నంటుంది.

ఆఫ్రికాదేశములో 'బాబూన్లు' అనే కోతులు మొక్కజొన్న పైరును నాశనము చేస్తూంటాయి. ఒక బాబూనును పట్టుకొని, దానికి పూసారంగు పూసి వొదిలేస్తే, పొలాలమీదికి బాబూన్ల దాడులు తగ్గుతాయనే కథ అక్కడి రైతుల్లో అములులో ఉంది. ఈ నమ్మకము ఎంతవరకు నిజమో తెలుసుకోడానిగ్గా, ఒక రైతు అతికష్టముమీద బాబూ నొకదాన్ని పట్టి నన్నగా గోరిగి, పూదారంగు కట్టించి వొదిలేశాడు. ఆ బాబూన్ని చూచి మిగతా బాబూన్లు ఆశ్చర్యాన్ని చూపెట్టడానికి మారుగా, అది తిరిగి గుంపులో చేరగలిగినందులకు సంతోషాన్ని వెలిబుచ్చాయి. అంటే బాబూన్లు పూదారంగును చూడలేవన్నమాట.

సృష్టిలో ఇల్లాంటి వైపరీత్యాలు యింకా యెన్నో!

—కాసుఖేల నరసింహారావు.

---

# వింతవింత పరిశోధనలు

## కృత్రిమఘృత పరిశ్రమ

సాధారణముగా కొవ్వులు fats) ద్రవరూపమున ఉండును. కాని, సబ్బుపరిశ్రమలోను, కొవ్వొత్తిపరిశ్రమలోను, మరియు కొన్ని తిండిపదార్థముల పరిశ్రమలోను ఘనీభవించిన కొవ్వులు కావలసియుండును. ౧౮౯౭-౧౯౦౫ సంవత్సరములలో సబేటియర్ (Sabatier) అనువారిడు "ద్రవరూపమునందున్న కొవ్వులలోనికి ఉదజనిప్రవాహము గాలించినచో, ఆ కొవ్వులు ఘనీభవించును" అని ఎన్నియో ప్రయోగములమూలమున కనుగొనెను. అట్లు కొవ్వుద్రావకములను (liquid fats) ఘనీభవింపజేయుటలో మిక్కిలి సహాయకారియగు నొక యోగవాహకము (Catalyst) ఉపయోగింపబడును. ఆ యోగవాహకము సాధారణముగా నికెలులోహము. ఈ పై ప్రణాళికే "కొవ్వు-ఉదజనీకరణము"(fat-hydrogenation)అని అందురు.

ఇప్పుడు కృత్రిమఘృతములు పైపద్ధతిప్రకారముగనే తయారుచేయబడుచున్నవి. ఈ కృత్రిమఘృతములకు మూలపదార్థములు పత్తిగింజలనూనె, కొబ్బరినూనె మొదలగునవి. ముఖ్యముగా పత్తిగింజలు ఈ పరిశ్రమలో నుపయోగింపబడుచున్నవి.

పత్తిగింజలనుండి తీయబడిన నూనె వెంటనే ఉదజనీకరణమునకు పనికిరాదు. మొదట దానిని శుద్ధపరుపవలెను. అట్లు శుద్ధముగావింపబడిన పత్తిగింజలనూనె (cotton seed oil) యోగవాహకముతో కలిపి కొంతవరకువెచ్చగావింపబడి, ఒక పెద్ద టాంకు(తొట్టి)లోనికి పంపబడును. ఆ టాంకులోనికే ఉదజనికూడ ప్రత్యేక మార్గముద్వారా పంపబడును. అటుతర్వాత ఆ నూనె ఇంకొక టాంకులోనికి చేర్చబడును. అచ్చట అది ఘనీభవించి నేయివలె తయారగును. ఇదియే కృత్రిమఘృత పరిశ్రమకు మూలసూత్రము.

## రాక్షసిబొగ్గునుండి వెన్న

రాక్షసిబొగ్గునుండి ఇప్పటికే ఎన్నియోరకముల వస్తువులు తయారుకాబడినవి. మందులు, ప్రేలుడుమందులు, రంగులు, పంచదారకంటె ౫౦౦ రెట్లు తీపికలిగిన సాకరీను మొదలగునవి ఈవరకే తయారుచేయబడినవి. విశేషమేమనగా, జర్మనుదేశీయులు ఈ రాక్షసిబొగ్గునుండి వెన్న తీయుపద్ధతి కనిపెట్టిరట!

## 'వింత పట్టు' (Artificial silk)

అసలుపట్టు పట్టుపురుగు కడుపునుండి వచ్చు పదార్థము. అదియే వస్త్రములుగా చేయబడును. కాని ఈ పట్టుపరిశ్రమలో పట్టుపురుగు లెన్నో ఉసురు పెట్టబడును. ఇది మిక్కిలి అసహ్యకరము. వింతపట్టు పరిశ్రమలో ఇటువంటి జీవహింస ఏమియు కావింప నవసరము లేదు. ప్రేలుడుమందులలో ప్రసిద్ధికెక్కిన 'గన్ కాటన్' (gun-cotton)నుండి తయారైన ఒకానొక వస్తువు కరిగించబడి, సన్నటిరంధ్రములనుండి చిమ్మబడినపుడు పొడుగాటి పట్టుదారములు ఏర్పడును.

ఇవి సహజముగ పట్టుదారములవలెనే నేయబడగలవు. కాని ఇంకను వింత ఏమనగా, ఈ పట్టుపురుగులు లేకుండగనే పట్టు ఎట్లు తయారగుచున్నదో, అట్లే నేయుటకు సాలెవాడు అవసరము లేకుండగనే పట్టు వస్త్రములు తయారగుచున్నవి. పైన చెప్పబడిన వస్తువుకే మరికొన్ని రాసాయనికద్రవ్యములను చేర్చి, ఏర్పడినముద్దను (paste) రోలరుయంత్రములలో పెట్టి త్రిప్పినచో, పట్టువంటి పట్టుగుడ్డ (కాగితపు యంత్రాగారములలో కాగితపు చుట్టవలె) తయారగును.

## అతిసున్నితమైన త్రాసు

పాశ్చాత్యదేశములలో ఒకచోట, ఒక వైజ్ఞానికశాస్త్రాగారమువారు ఒక అతిసున్నితమైన త్రాసును నిర్మించిరి. రెండు సమానబరువులను రెండుప్రక్కల నుంచినపుడు ఆ త్రాసు నికరముగా నుండును. కాని, ఒకప్రక్కనున్న బరువుపై మూడు పెన్సిలుగీతలు గీచిన మాత్రాన త్రాసు ఆప్రక్కకు ఒరిగిపోవును. ఆ మూడు పెన్సిలుగీతల బరువు ఊహా కందనంత స్వల్పము.

## ఆటంశక్తి—విమానాలు

ఆటంశక్తితో కారులు నడిపితే అవి కంటికి కనబడనేకనబడవు. కాని మిక్కిలి బరువైన విమానములు పరమాణుశక్తితో నడుపబడుటకు అవకాశము లున్నవని ప్రసిద్ధశాస్త్రజ్ఞుల అభిప్రాయమేకాక, దానికై వా రెంతయు పాటుబడుచున్నారు.

ఈ ఆటంశక్తితో విమానాలు నడుపబడుటయే నిజమైతే, గౌరీశంకరశృంగమును అధిరోహించుట సాధ్యము కావచ్చునేమో!

## క్రొత్త సినిమా

ఈ సినిమావిశేష మేమనగా, మామూలు సినిమాలలోవలె తెరపై ఏవో బొమ్మలాడుచున్నట్లుండక పోవుట; మరియు సాధారణ నాటకములలో మనుజులెట్లు గాన్పింతురో అట్లు కనబడుట. ఈ సినిమాలు చూచునపుడు మనకు తెర యగుపడదు. నిజముగా అచ్చట మనుజు లున్నట్లే భ్రమ కలిగించును. వీనినే 'three dimensioned pictures' అని అంటున్నారు.

## విశ్వామిత్రసృష్టి

మానవుడు చాలవట్టుకు విశ్వామిత్రునంతటివాడు కావడమేకాకుండా, అతనిని మించినవాడు కూడాను. సృష్టిలోనున్న ప్రతివస్తువునకు మారు తాను ఒక ప్రతి సృష్టించుచునేయున్నాడు. రోజురోజుకు క్రొత్తవేవో కనిపెట్టుచునేయున్నాడు. ఆఖరుకు మానవుడు మానవసృష్టికే ప్రయత్నించుచున్నాడు. సఫలుడైతేనా? భగవంతు డెందుకు? కాని అంతపని పుట్టకముందే ప్రళయము రావచ్చు. ఏమో! కానున్నది కాకమానదు. రానున్నది రాకమానదు.

—కొడవంటి నరసింహం.






— శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య —

ఫిబ్రవరి నెలలో జెకోస్లావేకియాయందు కమ్యూనిస్టు ప్రభుత్వము విప్లవముద్వారా స్థాపితమగుటయు అందుమూలమున రష్యావారి సామ్రాజ్యము ఐరోపాఖండములోని ఇంకొక దేశమునకు వ్యాపించుటయు పాశ్చాత్యయూరపులోని ఇంగ్లండు మొదలగు ప్రజాస్వామ్యరాజ్యములందును, ప్రపంచనాయకత్వమునకై రష్యాతో పోటీచేయుచుండు అమెరికాయందును ఎంతో అలజడి కలిగించెను. ఈ అలజడి మరింత తీవ్రమగుటకు ఇంకొక కారణముకూడ ఉండెను. జెకోస్లావేకియాను వశపరచుకొన్న తర్వాత కొద్దిరోజులకే రష్యావారు ఫిన్లాండు అను మరియొక చిన్న దేశమునకు, తమతో ఒక సైనికసంధిని చేసుకొనవలసినదిగా ఒక తాఖీదును పంపిరి. రష్యాను ఎదిరించగల శక్తి ఈ దేశమునకు లేదు. వారి తాఖీదు ఆజ్ఞవంటిదే. దానికి విరుద్ధముగ ప్రవర్తించుట ప్రమాదము. అందుచేత ఫిన్లాండువారుకూడ రష్యావారి అధీనములోనికి వచ్చుట తప్పదన్న సంశయము ఇతర దేశములవారికి కలిగెను. ఈ విధముగ రష్యావారి సామ్రాజ్యము అంతరాయము లేక వ్యాపించుచుండవలసినదేనా? లేక, దానికేమైన హద్దులు ఏర్పరచుటకు ప్రయత్నించవలసినదా? అన్న సమస్య బయలుదేరెను. ఆ సమస్యను పరిష్కరించుటకు ఇంగ్లండు, అమెరికా మొదలైన దేశములవారు చేసిన సన్నాహములే మార్చినెలలో గమనింపదగిన అంతర్జాతీయ వ్యవహారములు.

## పశ్చిమయూరపుదేశముల సమాఖ్య

ఈ సన్నాహములలో మొదటిది ఇంగ్లండు, ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు, లక్జెంబర్గు అను పశ్చిమయూరపులోని అయిదు దేశముల మధ్య ఏర్పడ్డ సమాఖ్య. ఈ అయిదు దేశముల ప్రతినిధులు బెల్జియం రాజధానియగు బ్రసెల్సులో సమావేశమై ఏబది సంవత్సరములకాలము అమలులో నుండదగు ఒడంబడికను ఒకదానిని చేసికొనిరి. జర్మనీమూలమునగాని, మరియే దేశముమూలమునగాని వీటిలో దేనికైన ప్రమాదము సంభవించినప్పుడు తక్కిన దేశములన్నియు వాటివాటి సైన్యములతోను, ఇతరసాధనములతోను దాని సహాయార్థము వెళ్ళుటకు ఈ అయిదుదేశములవారు అంగీకరించిరి. అనగా రష్యామూలమున వీటికి ప్రమాదము రానున్నదని శంకించి, ఈ దేశములవారు ఇట్టి ఒడంబడికలోనికి దిగిరి. దీనిని అనుసరించి సైనిక వ్యూహములు, ఆయుధములు, రక్షణవిధానము మొదలగువాటినిగురించిన సంప్రతింపులుకూడ జరుగుచున్నవి.

కాని ఈ సమాఖ్య అంత ఉపయోగకరముగ నుండునా అన్న సందేహము కలుగక మానదు. యూరపుఖండమునంతను వశపరచుకొను ఉద్దేశముతో గత నాలుగువందల సంవత్సరములనుండి అనేక దేశములవారు ప్రయత్నించిరి. ౧౬వ శతాబ్దములో స్పెయిన్ దేశపు రాజులు, ౧౭వ శతాబ్దములో ఫ్రెంచిదేశపు రాజులు, ౧౮వ శతాబ్దపు చివరభాగమునను, ౧౯వ

శతాబ్దపు ప్రారంభమునను ఫ్రెంచివిప్లవకారులు, వారికి నాయకుడైన నెపోలియన్ చక్రవర్తి, ౨౦వ శతాబ్దమున జర్మనీవారును ఇట్టి ప్రయత్నమునకు పూనిరి. గొప్ప సైన్యములను చేర్చుకొని, ఇతర దేశములపై దండెత్తి మామూలు క్రియామార్గమున వారి ఉద్దేశమును సాధింప ప్రయత్నించినవారు కనుక ఇతర దేశములవారు తమ స్వాతంత్ర్యమునకు వీరిమూలమున భంగము కలిగిన దని వారిపై తిరుగబడుటయు, వారిని ఓడించుటకై ఇతర దేశములవారితో కలియుటయు జరుగుచుండెను. యూరపులోను, ప్రపంచములోని ఇతర దేశములందును తమ సామ్రాజ్యాధికారమును సాధించుటకు రష్యావారి చదరంగపు ఎత్తులు ఇట్టివి కావు. ఇతర దేశములపై దండెత్తవలసిన అవసరము లేకుండ వారు వారి అధికారమును, పలుకుబడిని వ్యాపించుకొనగలవారై ఉన్నారు. అందుకై వారు సృష్టించిన సాధనము అన్ని దేశములలో కమ్యూనిస్టు రాజకీయపక్షము నొకదానిని లేవదీయుటయే. ప్రస్తుతము అన్ని దేశములలో ఇట్టి పక్ష మొకటి ఉన్నది. ఇందులో చేరినవారు రష్యావా రెట్లు చెప్పిన అట్లు నడుచుకొనువారు. వీరు ఏదేశమం దున్నను వీరి రాజభక్తిమాత్రము రష్యావారిపట్లనే ఉండును. ఈ పక్షమును బలపరచినయెడల ఇతర దేశములపై దండెత్తవలసిన అవసరము లేకయే వాటిని వశపరచుకొనుటకు రష్యావారికి సాధ్య మగును. ఈవిధముగ యూరపు ఖండమందలి ప్రతి దేశములోని కమ్యూనిస్టుపక్షమును బలపరచుటయే రష్యావారి ప్రస్తుతకాలపు విదేశ రాజ్యాంగనీతి. దేశములోని కమ్యూనిస్టుపక్షమునకును ఇతర రాజకీయపక్షములకును మధ్య వివాదములు కల్పించి, అందులో కమ్యూనిస్టులు గెలుచునట్లు చేసినయెడల యుద్ధ మవసరము లేకయే ఆ దేశమును వశపరచుకొనుటకు రష్యాకు వీలు కాగలదు. జెకోస్లావేకియా, హంగెరీ, రుమేనియా మొదలగు తూర్పుయూరపులోని దేశముల నన్నిటిని వారు రెండు సంవత్సరములమధ్య ఈవిధముగనే వశపరచుకొనిరి. పశ్చిమయూరపుఖండదేశముల సమాఖ్య రష్యావా రా దేశములపై దండెత్తివచ్చినపుడు ఉపయోగించగలదియేగాని, ఈ దేశములలో కమ్యూనిస్టులవలన ప్రమాదము కలిగినప్పుడు గాని, ఎన్నికలలో కమ్యూనిస్టులు విజయమును సంపాదించి దేశపరిపాలకులైనప్పుడుగాని ఉపకరించగలది కాదు. కనుక ప్రస్తుతము కావలసినది ఇట్టి సమాఖ్య ఒక్కటే కాదు. ఈ దేశములలో కమ్యూనిస్టులకు ఎన్నికలయందు జయము కలుగకుండునట్లు చేయుటయే కావలసినది. రష్యావారి సామ్రాజ్యము వ్యాపించకుండ చేయుట కిదియే ప్రధానసాధనము.

## కమ్యూనిస్టు ప్రమాదము

ప్రమాదమంతయు కమ్యూనిస్టుపక్షము వారి కుట్రలవల్లనే కలుగుచున్న దను అభిప్రాయము యూరపుఖండపు పశ్చిమదేశము లన్నిటియందును ప్రస్తుతము వ్యాపించియున్నది. అందుచేత వారిని అధికారములోనికి రాకుండచేయుట అవసరమన్న అభిప్రాయముకూడ ఈ దేశములలో కలదు. యూరపునకు ఉత్తరభాగమందు స్వీడన్, నార్వే, డెన్మార్కు అను మూడు చిన్న దేశము లున్నవి. ఇందులోనివారు ఒకేజాతికి (స్కాండినేవియన్) సంబంధించినవారు. వారు మాట్లాడు భాషలుకూడ దగ్గరి సంబంధ మున్నది. ప్రజాస్వామ్యవిధానమునందు వీరు ఆరితేరినవారు, స్వాతంత్ర్యప్రియులు. సామ్రాజ్యములు వీరికి లేకున్నను వీరు కష్టపడి పనిచేయువారగుటచేత సుఖముగ జీవింపగలవారై ఉన్నారు. సోషలిస్టిక్ పద్ధతిని చాల మట్టుకు వీరు తమ దేశములలో ప్రవేశపెట్టియున్నారు. వ్యక్తిస్వాతంత్ర్యమునకును, ప్రజాస్వామ్యమునకును విరుద్ధమగు కమ్యూనిజం వీరి కెంతమాత్రము గిట్టదు. ఈ దేశములలో కమ్యూనిస్టుపక్షమునకు చెందినవారి సంఖ్య చాల తక్కువ. కాని వారివల్ల ప్రమాదము ఎన్నటికైన కలుగవచ్చునని సందేహము ఈ దేశములవారికి లేకపోలేదు. అందుచేత వీటి ప్రధానమంత్రులు కొద్ది రోజులక్రిందట సమావేశమై కమ్యూనిస్టువిధానమును ఖండించి, దానినుండి తమ దేశములకు ప్రమాదము కలుగకుండుటకై కావలసిన చర్యలను తీసుకొనుటకు తీర్మానించిరి.

## మార్షల్ సహాయ ప్రణాళిక

ఇదే సందర్భమున మార్షల్ పథకము ననుసరించి అమెరికావారు చేయదలచిన ఆర్థికసహాయమును స్వీకరించుటకు సమ్మతించిన యూరపు ఖండములోని పదహారుదేశముల ప్రతినిధులుకూడ సమావేశమై ఆ పథకమునకు సంబంధించిన మరికొన్ని వివరములనుగూడ విమర్శించిరి. రెండవ ప్రపంచయుద్ధము మూలమున ఆర్థికముగ నష్టపడిన ఈ దేశములవారు తెప్పిరిల్లుటకు అమెరికావారి సహాయము—అచటినుండి వచ్చు ఆహారపదార్థములు, బొగ్గు, ఉక్కు, యంత్రములు, రాసాయనిక ఎరువులు—అత్యంతావశ్యమనియు, ఇట్టి సహాయము వారికి లభించని పక్షమున ఆ దేశములలో సామాన్యజను లనుభవించు దారిద్ర్యము కమ్యూనిస్టుల ప్రాబల్యమునకు దారితీయు ననియు, కమ్యూనిస్టులయొక్కయు, తద్ద్వారా రష్యాయొక్కయు, ప్రాబల్యము నణచుటకును ప్రజలు విప్లవావసరము లేకుండ ఆర్థికముగ బాగుపడుటకును ఇదియే తగిన మార్గమనియు అమెరికావారి అభిప్రాయము. ఈ కారణము చేతనే రష్యావారు మార్షల్ పథకమునకు మొదటి నుండి అడ్డుతగిలియుండుట. ఈమధ్య జరిగిన సమావేశములో రెండు సూచనలు చేయబడెను. వాటి ప్రాధాన్యమును గ్రహించవలసియున్నది. అందులో ఒకటి ఈ పథకము పశ్చిమజర్మనీకికూడ వర్తించవలెననుట. రెండవది స్పెయినుకుకూడ ఇది వర్తించవలెనని చెప్పుట.

## పశ్చిమ జర్మనీ

మార్షల్ పథకము పశ్చిమజర్మనీకికూడ వర్తించవలె ననుటలో ఉండు ప్రాధాన్య మెట్టిది? ఈ భాగము ఖనిజసంపదలో కూడియున్నది. బొగ్గుగనులు విపరీతముగ నున్నవి. ఇనుము ఉక్కు పరిశ్రమలకు ఆయువుపట్టు. జర్మనీయొక్క ఐశ్వర్యమున కంతకు ఇదియే మూలము. కాని జర్మనీయొక్క సైనికబలమునకు కూడ ఇదియే ఆయువుపట్టు. ఇచ్చటి పరిశ్రమలను సాధనము చేసికొనియే జర్మనులు, హిట్లరు వారి టాంకులు, బాంబులు, విమానములు మొదలైన ఆయుధములను తయారుచేసిరి. గత మూడుసంవత్సరములుగ పశ్చిమజర్మనీలోని గనులు గాని, పరిశ్రమలు గాని చక్కగ పనిచేయుట లేదు. యుద్ధమునకు పూర్వము పశ్చిమయూరపులోని ఇతర దేశములకు కావలసిన బొగ్గు, ఉక్కు మొదలైనవాటిలో చాలభాగము ఇచ్చటి నుండియే వచ్చుచుండెను. ప్రస్తుతమిచ్చట ఈ పనులు జరుగనికారణమున ఇతరదేశములకు ఈలాటి సామానులు లభించక ఆ దేశములలోని (ఫ్రాన్సు, హాలెండు, ఇటలీ మొదలైన దేశములలోని) ప్రజలు చాల బాధపడుచున్నారు. కాని ఈ పరిశ్రమలు వృద్ధిగాంచినయెడల జర్మనుల ఐశ్వర్యము వృద్ధిఅగుటయు, తద్ద్వారా వారి సైనికబలము పెరుగుటయు, మరియొక పర్యాయము వారి మూలమున ఇతరదేశములకు యుద్ధప్రమాదము వచ్చుటయు తప్పదు. ఇదియే ప్రస్తుతపు జర్మనీ సమస్య. వారి దేశములోని పరిశ్రమలు చక్కబడినగాని ఇతరదేశములవారికి కావలసిన సామానులు దొరకవు. కాని అందుమూలమున వారి బలముకూడ పెరుగును. వారి బలము పెరుగకుండునట్లుగను, పెరిగినను అది యుద్ధరూపమున దుర్వినియోగము కాకుండునట్లుగను చేయుటకు సాధనమేమైన ఉన్నదా? ఈ విషయమునుగురించి ఇంగ్లండు అమెరికా ఫ్రాన్సుమంత్రులు దీర్ఘాలోచన చేసి తుదకు అట్టి సాధన మున్నదని నిశ్చయపరచుకొనిరి. జర్మనీలోని బొగ్గుగనులు, ఇతరపరిశ్రమలు జర్మనుల యాజమాన్యమునగాక, ఈ మూడు దేశములయొక్కయు, హాలెండు బెల్జియం లక్జెంబర్గు లయొక్కయు సమిష్టియాజమాన్యమున జరుగవలయు ననియు, రాజకీయముగ జర్మనీయందు బలిష్ఠమైన కేంద్రప్రభుత్వము స్థాపితము కాకూడదనియు, ఈ రెండులక్షణములతో కూడిన విధానము ఆచరణలోనికి వచ్చినయెడల జర్మనీయొక్క ఐశ్వర్యముమూలమున ఇతరయూరపుదేశములకు లాభము కలుగు ననియు వారు తీర్మానించిరి. మార్షల్ పథకము మూలమున రానున్న సహాయమును జర్మనీఅభివృద్ధికి కూడ ఉపయోగించవలెననుటలో ఇదియే అంతరార్థము. ఈ కారణముచేతనే దీనిని రష్యావారు అంగీకరించుట లేదు. జర్మనులను నమ్ముటకే వీలులేదనియు ఆ దేశము ఆర్థికముగ అభివృద్ధిగాంచుట ప్రమాదకరమనియు వారి వాదము. ఈ వాదప్రతివాదములు

రెండు సంవత్సరములుగ జరుగుచునే యున్నవి. కొసకు తేలినది ఏమనగా, రష్యావారు ఇష్టపడినను, ఇష్టపడక పోయినను ఇంగ్లండు ఫ్రాన్సు అమెరికా దేశములవారు కలిసి, వారివారి అధీనమం దుండు పశ్చిమజర్మనీభాగముల నన్నిటిని మార్షల్ ప్రణాళిక ననుసరించి ఆర్థికముగ అభివృద్ధి చేయుటకు తీర్మానించుకొనిరి. రష్యాపై హిట్లరు గావించిన దండయాత్రలో ఉపయోగింపబడిన ఆయుధము లన్నియు పశ్చిమజర్మనీలో తయారైనవే. జర్మనీని ఆర్థికముగ అభివృద్ధి చేయుటకు ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, అమెరికావారు సిద్ధపడుట అనిన జర్మనీలో పూర్వమువలె ఆయుధములను తయారుచేసి, వాటితో వీరు రష్యాను ఎదుర్కొనుటకు సన్నాహము చేయుట అనియే రష్యావారు భావించుచున్నారు. వీరిమధ్య అనుమానము హెచ్చుటకు ఇది యొక ప్రబల కారణము.

## స్పెయిన్

మార్షల్ పథకము మూలమున స్పెయినుకు కూడ సహాయము లభించునట్లు అమెరికనులు ఇప్పుడు తీర్మానించిరి. ఇదికూడ గమనింపతగిన విషయము. స్పెయినులో ఫ్రాంకో అను నియంత పదిసంవత్సరములుగ అధికారమునం దున్నాడు. ఇతని పరిపాలన విధానము ఫాసిజం. హిట్లరుముసోలినీలు ఇతని మిత్రులు. వా రనుసరించిన నిరంకుశవిధానముచే ఇతడు అనుసరించి ప్రజాస్వామ్యమును, స్వాతంత్ర్యమును నిర్మూలము చేసెను. ఈ కారణముచేత ఇప్పటివరకు స్పెయినుకు ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వము లేకపోవుటయేగాక, ఐక్యరాజ్యసమితివారు ఆ దేశమును అన్ని విధముల బహిష్కరించియున్నారు కాని రష్యా సామ్రాజ్యము, కమ్యూనిజము పశ్చిమయూరపులోనికి వ్యాపించకుండచేయుట ఒక్కటే అమెరికావారి ఉద్దేశమగుట చేతను, అందులో స్పెయినుయొక్క సహాయము ఉపయోగకరముగ నున్నందునను ఫ్రాంకోకు కూడ అమెరికావారు మార్షల్ పథకమును వర్తింపజేయ నిర్ణయించిరి.

## ఇటలీ

కాలమునుబట్టి శత్రువులు మిత్రు లగుటయు, మిత్రులు శత్రువు లగుటయు జరుగుచున్నది. రెండవ ప్రపంచయుద్ధమందు శత్రువులుగ నుండిన జర్మనులు క్రమక్రమముగ ప్రస్తుతము ఇంగ్లీషువారికి, ఫ్రెంచివారికి, అమెరికనులకు మిత్రులగు స్థితిలోనికి వచ్చుచున్నారు. అప్పుడు మిత్రులుగ నుండిన రష్యావారు ఇప్పుడు శత్రుకోటిలో చేరుచున్నారు. ఈ మాత్రము ఇటలీవిషయమునగూడ సమన్వయమగు పరిస్థితులు ఏర్పడినవి. ముసోలినీ పరిపాలనమందుండిన కారణముచేత ఇటలీ అప్పుడు శత్రువర్గములో చేరియుండెను. అందుచేత ౧౯౪౪ సంవత్సరములో ఆ దేశముతో మిత్రమండలివారు (అనగా రష్యా, ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికావారు) శాంతిఒడంబడిక చేసికొనుటలో దానిపై అనేకకఠినషరతులను విధించిరి. నష్టపరిహారముక్రింద ఇటలీవారు వీరికి కోట్లకొద్ది ద్రవ్యము ఇయ్యవలసినవారైరి. వారి సామ్రాజ్యమునంతను వారు వదలుకొనవలసినవారైరి. వారి ప్రధానరేవుపట్టణములలో నొకటియగు ట్రీయస్టుపట్టణమును కోల్పోయిరి. ఇదంతయు జరిగి పదునాలుగుమాసము లైనది. కాని ఈ మధ్యకాలమున రష్యాకును, తక్కిన మిత్రమండలివారికిని విరోధము అభివృద్ధిగాంచెను. ఈ కారణముచేత ఇరుపక్షములవారు ఇటలీని తమ పక్షములో చేర్చుకొనుటకు విశ్వప్రయత్నము చేయుచున్నారు.

## ఇటలీలో ఎన్నికలు

ఇటలీలో ఈనెల ౧౮ తేదీన పార్లమెంటుకు (కేంద్రశాసనసభకు) ఎన్నికలు జరుగనున్నవి. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, క్రిస్టియన్ డెమాక్రాటులు, మరికొన్ని చిడిపక్షముువారు తీవ్రమైన పోటీ చేయుచున్నారు. రెండుసంవత్సరముల క్రింద జరిగిన ఎన్నికలలో పార్లమెంటునందలి మొత్తము ౫౩౬ సభ్యులలో క్రిస్టియన్ డెమాక్రాటులు ౨౦౮; సోషలిస్టులు ౧౧౫; కమ్యూనిస్టులు ౧౦౪; తక్కిన చిడిపక్షముల వారు ౪౦, ౩౦, ౧౦-ఈ లాగు స్వల్పసంఖ్యాకులుగను ఉండిరి. క్రిస్టియన్ డెమాక్రాటు నాయకుని ఆధ్వర్యమున మంత్రివర్గ మేర్పడెను. చిడిపక్షము వారు కొందరు, సోషలిస్టులలో ఒక శాఖవారు అతనితో కలిసిరి. కమ్యూనిస్టులు ఎదుటిపక్షములోనివారైరి. ఇప్పుడు రానున్న ఎన్నికలలో కమ్యూనిస్టులు, వారి స్నేహితులగు సోషలిస్టు శాఖవారు ఏలాగైన విజయము సంపాదించి అధికారములోనికి వచ్చుటకు ప్రయత్నము చేయుచున్నారు. వారి నాయకులు మంచి నేర్పరులు; తెలివి తేటలుగలవారు. ఉత్తరభాగమం దుండు ఫ్యాక్టరీ

కార్మిక లోకులు వారి పక్షమం దున్నారు. దక్షిణ ఇటలీలో చాలభాగము క్రిస్టియన్ డెమోక్రాటు పక్షమువారు. ఇదిగాక క్యాథలిక్ మతగురువగు పోపు వారియందు అభిమానము గలవారు. క్యాథలిక్కులకు కమ్యూనిజం అన్న ఏమాత్రమును గిట్టదు. ప్రధానములగు ఈ మూడు పక్షములవారికి అతితీవ్రమైన పోటీ జరుగు చున్నది.

## అగ్రరాజ్యములవారి జోక్యము

కాని ఈ పోటీలో అగ్రరాజ్యములవారు పరోక్షముగా ఎంతో జోక్యమును కలిగించుకొనియుండుట ప్రపంచమంతయు గమనించదగిన విషయము. ఏలాగైన కమ్యూనిస్టులు అధికసంఖ్యాకులుగ గెలుపొందవలయు నని రషియావారి అభిమతము. అది జరిగినయెడల ఇటలీలో విప్లవావసరము లేకయే కమ్యూనిస్టు మంత్రివర్గము ఏర్పడుటయు, రషియా ప్రాబల్యము అందులో కూడ వ్యాపించుటయు జరుగును. కమ్యూనిస్టులు అధిక సంఖ్యాకులుగ గెలుపొందకుండుటయు, వారి ప్రతిపక్షులగు క్రిస్టియన్ డెమోక్రాటుపక్షమువారు గెలిచి ఇప్పటి వలెనే మంత్రివర్గము నుండి పరిపాలకులు కావలెనని ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు, అమెరికనులు పోరాడు చున్నారు. ఇందులో విశేష మేమనగా— ఈ రెండు పక్షములవారు ఇటలీలోని ఓటర్లగు ప్రజలను మభ్య పెట్టుటకు ప్రయత్నించుటయే. యుద్ధనష్టపరిహారము క్రింద తమకు రావలసిన ద్రవ్యమును తాము వదలుకొను నట్లు కొన్నిరోజులక్రింద రషియనులు ప్రకటించిరి. ఇదిగాక రెండవ ప్రపంచయుద్ధమునకు పూర్వము ఇటలీవారు పాలించుచుండిన ఆఫ్రికాలోని రాష్ట్రము లను తిరిగి వారి ధర్మకర్తృత్వమున వారి పాలనలోనే ఉండునట్లు తాము ఒప్పుకొనుచున్నట్లు ప్రకటించిరి. దీనికి జవాబుగ ఇంగ్లండు, ఫ్రాన్సు, అమెరికాలవారు ట్రియస్టుపట్టణమును తిరిగి ఇటలీకి చెందునట్లు చేయు టకు, ఆఫ్రికాలోని రాష్ట్రములను వారి వశము చేయుట కును అంగీకారము సూచించిరి. ఇదిగాక కమ్యూ నిస్టుప్రభుత్వము ఏర్పడినయెడల ఇటలీకి తా మిది వరకు మార్షల్ ప్రణాళికక్రింద చేయదలచిన సహాయమును చేయజాలమని అమెరికావారు స్పష్టపరచిరి. ఈ సహాయము మున్నగాని ఆర్థిక ముగ ఇటలీదేశము చక్కబడజాలదు. కనుక ప్రస్తుతము ఇటలీ దేశస్థులు ఈ సూచనలను, వాగ్దానములను, బెదిరిం పులను విమర్శించుచున్నారు. తుదకు ఎన్నికల ఫలితము ఏట్లుండునో చెప్పజాలము. కమ్యూనిస్టులకే విజయము లభించినయెడల రషియాయొక్క సామ్రాజ్యము యూర పునం దంతట వ్యాపించిన ట్లన్నమాటే. దానిని నిరో ధించుటకై అమెరికావారు, ఇంగ్లీషువారు కట్టుచుండు కోటలు, చేయుచుండు ఏర్పాటులు, నిర్మించు సమా ఖ్యలు, సహాయములు కూలబడిపోయిన ట్లన్నమాటే. ఇటలీ మధ్యధరాసముద్రమునకు మధ్య నున్నది. అది రషియాపక్షమున చేరినయెడల గ్రీసు టర్కీ దేశములలో అమెరికావారు పలుకుబడి సంపాదించుటకు రెండు సంవత్సరములుగ చేయుచుండు ప్రయత్నమంతయు భగ్నమైనట్లే కనుక ఇటలీలో జరగబోవు ఎన్నికలు ప్రపంచముయొక్క దృష్టినంతను ఆకర్షించుచున్నవి.

## అమెరికాలో నిర్బంధసైనికవిధానము

ఇంగ్లండు, ఫ్రాన్సు, హాలెండు, బెల్జియం, లగ్జెం బర్గు దేశములు పశ్చిమయూరపుసమాఖ్యను నిర్మించు టకై ఒడంబడిక చేసికొన్న రోజుననే అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ కాంగ్రెసునకు ఒక సందేశ మంపెను. అది చాల ప్రధానమైన సందేశము. కమ్యూ నిజమూలమునను, రషియామూలమునను ప్రపంచమున కంతకు ముప్పు కలుగబోవుచున్న దనియు, దానిని నివా రించుటకు కావలసిన సదుపాయములు అమెరికా వారి కొక్కరికిమాత్రమే యున్న వనియు, ఆ భారము నంతను వహించుటకు వారు సిద్ధపడవలె ననియు, దానిని నిర్వహించుటకు నిర్బంధసైనికవిధానమును వెంటనే దేశమందు ప్రవేశపెట్టవలె ననియు అతడు నొక్కిచెప్పెను. యుద్ధములేని కాలములో— శాంతి కాలములో— పౌరులను నిర్బంధించి సైన్యములో చేర్చుకొనుట అమెరికావారి సంప్రదాయమునకు విరుద్ధము. ఇచ్ఛికముగ ఎవరు సైన్యములో చేరెదరో వారితో కాలక్షేపము చేయుట వారి ఆచారము. ట్రూమన్ సందేశముయొక్క గూఢార్థము అపరిమిత మైన సైన్యమును సమకూర్చినగాని రషియాను ఓడిం చుట సాధ్యము కా దనియు, అందుకై ఇప్పటినుండియే ప్రయత్నము చేయవలె ననుట. ఇట్టి సైన్యము తయా రగుటను చూచి, రషియావారు భయపడి, సామ్రాజ్య కాంక్షచే వారి ఇతర దేశములలోని కమ్యూనిస్టులను బల పరచు విధానమును మానుకొందు రని ట్రూమన్ యొక్క ఆశయము. అమెరికాలో నిర్బంధసైనికవిధానము వచ్చినయెడల ఆ దేశముతో యుద్ధము చేసి గెలుచుట

సులభము కాదు. దీనికితోడు ఆటంబాంబులు ఒక అమెరికావారి వశమందున్న దన్న మాటను మనము మరవరాదు.

## ఆటంబాంబు

ఆటంబాంబులను తయారుచేయు విషయమున ఏదేశమువారికిని స్వాతంత్ర్య ముండకూడ దనియు, అంతర్జాతీయకమిటీని ఒకదానిని నిర్మాణముగావించి దానిద్వారా ఆటంబాంబులు తయారుకాకుండ చేయునట్లు ఏర్పాటులు జరుగవలె ననియు భావించి దీనికి కావలసిన సూచన లన్నిటిని సమగ్రముగ పరిశీలించుటకై ఒక కమిటీని విశ్వరాజ్యసమితివారు రెండు సంవత్సరములక్రింద నిర్మాణము చేసియుండిరి. కాని ఈ కమిటీలో రష్యా ప్రతినిధులకును, తక్కిన దేశముల ప్రతినిధులకును తీవ్రములగు అభిప్రాయభేదములు ఉత్పన్నములగుటచేత ఎట్టి తీర్మానము చేయుటకు వీలు లేదయ్యెను. కమిటీ సభ్యులకు ఎక్కడలేని విసుగు కలిగి, తుదకు కమిటీని రద్దుచేయుటయే ఉత్తమమార్గమని కొద్దిరోజుల క్రిందట అందులోని అధికసంఖ్యాకులు సూచించిరి. బహుశః కొద్దిరోజులలో అది రద్దు కాగలదు. ఎట్టి ఆక్షేపణ లేక ఆటంబాంబులను అమెరికావారు ఇష్టానుసారముగ తయారుచేయుట, కప్పుడు మరింత అవకాశము కలుగును. రెండు సంవత్సరముల క్రిందట బీజరూపముగనుండిన అగ్రరాజ్యములమధ్య విరోధము ఇప్పుడు మహావృక్షమై ప్రపంచమునంతను ఆవరించినది. సమస్తసౌఖ్యములను, భోగభాగ్యములను అనుభవించుట కవకాశము గల మానవకోటి సుందోపసుందులవలె పరస్పరవినాశమునకు సన్నాహము చేయుచున్నది. ఇదియే కలియుగచరమదశలోని వైపరీత్యము.

## మధ్యప్రాచ్యమండలి ఎత్తులు

అగ్రరాజ్యములగు అమెరికాయొక్కయు, రష్యాయొక్కయు రెక్కలు బహువిశాలము లైనవి. అవి గరుత్మంతుని రెక్కలవంటివి. వాటి ధాటికి చిన్న దేశము లేవియు నిలబడలేవు. చిన్న దేశములతో సఖ్యము కలిగించుకొనకుండ, వాటి మానాన వాటిని వదలివేసినయెడల అందులోని ప్రజలు ఎంతో సుఖముగ జీవింపగలవా రగుదురు. అట్లు జీవింపలేకపోయినను వారి కష్టములను వారికి తోచినట్లు వారే తొలగించుకొందురు. కాని అగ్రరాజ్యములవారిలో ఇట్టి విశాలమనోభావము లేదు. మధ్యప్రాచ్యములో వారి చదరంగపుటెత్తుల మూలమున కలుగుచుండు సంక్షోభమే దీనికి తార్కాణము. పాలెస్తయినును విభజన చేయవలసినట్లు విశ్వరాజ్యసమితిమహాజనసభవారు చేసిన తీర్మానమును పునర్విమర్శనకు తేవలయు నని ప్రస్తుతము అమెరికావారు భద్రతామండలిలో ఒక తీర్మానమును ప్రతిపాదించియున్నారు. నాలుగుమాసముల క్రిందట విభజనముతప్ప పాలెస్తయినుసమస్య పరిష్కారమగుటకు సాధనాంతరము లేదని పట్టుబట్టిన అమెరికావారు వారి అభిప్రాయమునంతను ఈవిధముగ మార్చుకొనుట హాస్యాస్పదము; విశ్వరాజ్యసమితియొక్క ప్రతిష్ఠకు హానికరము. పునర్విమర్శనమూలమున జరుగబోవునది ఇప్పటివరకు జరిగినదానికంటె న్యాయముగను, ధర్మముగను ఉండునా? అరబ్బుల అభిమానము సంపాదించుటకును, తద్వారా తమ చమురుగనులకు ఉపద్రవము లేకుండ కాపాడుకొనుటకును అమెరికావారు గావించిన ప్రయత్నమే ఇది.

## పర్షియా

పర్షియాను కబళింపవలె నని ప్రయత్నము వందసంవత్సరములకు పూర్వమునుండి రష్యావారు చేయుచున్నారు. అప్పటి చమురుగనులు ఇంగ్లీషువారు, అమెరికావారు మాత్రమే గుత్తకు తీసికొని లాభము పొందుట వారి కిష్టము లేదు. ఈమధ్య పర్షియావారి సైన్యములను తర్ఫీదుచేయుటకు కొందరు అమెరికను ఉద్యోగస్థులను పర్షియాప్రభుత్వమువారు నియమించిరి. ఇదివరకు పర్షియాకును, రష్యాకును మధ్య జరిగియుండు ఒడంబడికకు ఇది విరుద్ధ మను నెపముచే తమ సైన్యములను ఉత్తరపర్షియాలో ప్రవేశపెట్టుటకు రష్యావారు సిద్ధపడియున్నారు.

## ఆఫ్గనిస్థానము

పర్షియాకు ప్రక్కననే ఆఫ్గనిస్థాన మున్నది. ఆఫ్గన్ ప్రభుత్వమునకు కొన్నికోట్ల రూపాయిల

ఋణము నిచ్చి అందులోకూడ తమ పలుకుబడిని స్థాపించుకొనుటకు ప్రస్తుతము అమెరికావారు సంప్రతింపులు జరుపుచున్నారు. అప్పటికూడ రష్యా అమెరికాల మధ్య ప్రబలిన వైరము ఆ దేశపు స్వాతంత్ర్యమునకు భంగకరముగ పరిణమించుచున్నది. పిల్లికి చెలగాటము, ఎలుకకు ప్రాణసంకటము అను సామెత ప్రకారము అగ్రరాజ్యములవారి చదరంగపు యెత్తులన్నియు అల్పరాజ్యములలోని ప్రజలకు ప్రాణసంకటము లగుచున్నవి.

## భరతఖండము-రాజ్యాంగవిధానము

రాజ్యాంగపరిషత్తువారు నియమించిన డాక్టరు అంబేద్కరు కమిటీవారు ఇదివరకు పరిషత్తులో జరిగిన చర్చలను, పరిషత్తువారు ఆమోదించిన సిద్ధాంతములను ఆధారముచేసికొని నూతనరాజ్యాంగప్రణాళిక నొకదానిని ప్రకటించిరి. స్వతంత్రభరతఖండము యొక్క పరిపాలన ఏ ఉద్దేశములతోను, ఎట్టి రాజ్యాంగములతోను జరుగునో ఈ ప్రణాళిక వివరించుచున్నది. దీని స్వరూపము సంతను ఇచ్చట వివరించుటకు అవకాశము లేదు. ఈ రాజ్యాంగవిధానమును తయారు చేయుటలో ఇతర దేశముల రాజ్యాంగవిధానములను, ౧౯౩౫ సంవత్సరములో బ్రిటిష్‌పార్లమెంటువారు మన దేశపరిపాలననిమిత్తమై నిర్మించిన శాసనమును చక్కగ పరిశీలించి, అందలి సుగుణముల నన్నిటిని అంబేద్కరు కమిటీవారు గ్రహించిరి. ప్రత్యేకముగ భరతఖండపు ప్రాచీనసాంప్రదాయముల ననుసరించిన భాగములు గాని, మహాత్మాగాంధీగారి విధానము గాని ఇందులో లేదని అనేకులు ఆక్షేపించవచ్చును గాని ఇరువదియవ శతాబ్దములో ప్రజాస్వామ్యవిధానలక్షణము లన్నియు ఇందు గలవు. కుల, మత, వర్ణవిభేదము లేక ప్రతివ్యక్తికి కొన్ని ప్రధానహక్కులు స్వతంత్రభరతఖండములో నుండును. వాక్స్వాతంత్ర్యము, మతస్వాతంత్ర్యము, సంఘములుగ చేరి వారివారి ఉద్దేశముల నెరవేర్చుకొనుటకు కావలసిన స్వాతంత్ర్యము అందరికి ఉండును. అల్పసంఖ్యాకులను అధికసంఖ్యాకులు బాధింతురన్న భీతి తొలగుటకు ఈ ప్రణాళికలో అనేకావకాశము లున్నవి. ఇకమీదట మన రాజ్యాంగవిధానము ఫెడరల్ విధానము. కేంద్రము బలిష్ఠముగ నుండుటకు కావలసిన ఏర్పాటులన్నియు చేర్పబడినవి. కేంద్రమున కంతకు ఒక అధ్యక్షుడును, ప్రతిరాష్ట్రమునకు ఒక గవర్నరును ఉండును. వయోజను లందరికి—ధనికులు దరిద్రులు, పురుషులు స్త్రీలు అన్న భేదములు లేక—ఎన్నికలలో పాల్గొనుటకును, అభ్యర్థులుగ నిలబడుటకును హక్కు కల్పించబడినది. పరిపాలనాధికారము ప్రముఖులనుండి సామాన్యప్రజల చేతులలోనికి రాగలదు. ఈలాటి లక్షణములతో కూడిన క్రొత్త రాజ్యాంగవిధానమును రాజ్యాంగపరిషత్తువారు మే, జూన్ నెలలలో చక్కగా విమర్శించి ఆమోదించబోవుచున్నారు.

## సంస్థానముల సమస్య

కాశ్మీరు హైదరాబాదులు తప్ప తక్కిన సంస్థానముల సమస్య గతమాసములో పూర్తిగా పరిష్కరింపబడినదని చెప్పవచ్చును. చిన్నచిన్న సంస్థానములను పొరుగున నుండు రాష్ట్రములలో కలిపివేయుట, వాటి నన్నిటిని చేర్చి ఒక గొప్ప సమాఖ్య (Union) ను ఏర్పరచుట—ఈ రెండు మార్గముల మూలమున ప్రత్యేక సంస్థానముల సంఖ్య తగ్గిపోయెను. ఇట్లేర్పడిన సమాఖ్యలలో ప్రజాప్రభుత్వము స్థాపించుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. కాశ్మీరుసమస్యను పరిష్కరించు బాధ్యతను న్యూయార్కులోని భద్రతామండలి ఇప్పటివరకు హృదయపూర్వకముగ వహింపకుండుట మిక్కిలి విచారింపదగినవిషయము. ఇంతకంటె స్వల్పవిషయములను, వివాదములను గురించి వారు ఆలోచించుచున్నారే గాని కాశ్మీరుసమస్యయొక్క ప్రాధాన్యమును వారు గ్రహించరైరి. ఇట్టి సందర్భములో భద్రతామండలికి వెళ్లిన మన ప్రతినిధులు మరలివచ్చుటయే శ్రేయస్కరము.

## హైదరాబాదు

హైదరాబాదుసంస్థానము ఇండియాలో ఇప్పటికూడ చేరకపోవుటయు, యథాతథపు ఒడంబడికలోని షరతులనేకములను ఉల్లంఘించుటయు, సంస్థానములోని హిందువుల ప్రాణములను, మానమును, ధన

ధాన్యములను రక్షించుటకు కావలసిన బందోబస్తు చేయకపోవుటయేగాక వారిని హింసించు రజాకారులను దుండగీడులపై ఎట్టిచర్యలను తీసుకొనకుండుటయు విచారించదగిన విషయములు. మన ప్రభుత్వమువారు హైదరాబాదువిషయమై కఠినచర్యలను తీసికొనుటకింకను సిద్ధముగ లేరు. దీనికి కారణ మేదియో మనము ఊహించుట కష్టముగ నున్నది. యుద్ధముతప్ప మార్గాంతరము లేదనియు, కాశ్మీరములోను, హైదరాబాదులోను ఏక కాలమున యుద్ధము చేయుటకు కావలసిన వసతులు ప్రస్తుతము మన ప్రభుత్వమునకు లేవనియు, అందుచేతనే వారు సంప్రతింపులతోను, ఉత్తరప్రత్యుత్తరములతోను కాలము గడుపుచున్నారనియు అనేకులు అభిప్రాయపడుచున్నారు. ఇందులో సత్యముండవచ్చును. కాని హైదరాబాదు ఎట్టి షరతులకు లోబడినయెడల ఇకమీదట సంప్రతింపులు జరుగునో మన ప్రభుత్వమువారు కొద్దిరోజులక్రిందట స్పష్టపరచిరి. సంస్థానములో ప్రజలకు బాధ్యులుగ నుండు మంత్రివర్గము అధికారములోనికి వచ్చుట; రజాకార్లను పేరుతో ప్రజలను హింసించుచుండు రెండులక్షల మహమ్మదీయ సొంత (Private) సైన్యమును వెంటనే రద్దుచేయుట; యథాతథపు ఒడంబడికకు విరుద్ధముగ పాకీస్థానమునకు ఇచ్చిన ఇరవై కోట్ల ఋణమును ఉపసంహరించుట; ఇండియా చెలామణీవిషయముగ సంస్థానమువారు గావించిన మార్పులను రద్దుచేయుట—ఈ షరతులకు నైజాం అంగీకరించినచోగాని అతనితో ఏలాటి సంప్రతింపులు ఇకమీదట జరగజాలవని ఇండియాప్రభుత్వమువారీమధ్య నైజామునకు ఒక శ్రీముఖమును పంపిరి. దీని ఫలిత మెట్లుండునో చూడవలసియున్నది.

## కమ్యూనిస్టుపక్షము

దేశమందు ఇప్పుడు జరుగు సమ్మెలకు, ఇతర విధములైన అల్లరులకు కమ్యూనిస్టుపక్షమువారు కారకులని ఇండియాప్రభుత్వమువారు, పశ్చిమబెంగాలు, మద్రాసు, బొంబాయి మొదలగు రాష్ట్రప్రభుత్వముల వారు ఇప్పుడు అభిప్రాయపడి, వారి మూలమున దేశమునకు ఉపద్రవము కలుగకుండ ఉండుటకై కొన్ని చర్యలను ఈమాసములో తీసికొనిరి. ఇది మనము ముఖ్యముగ గమనింపదగిన విషయములలో ఒకటి. కమ్యూనిస్టులన్న ఈ పెరాస్తరుగ భయపడుటకు రెండు ప్రధానకారణము లున్నట్లు కనుపించుచున్నది. ప్రపంచమందంతటను కమ్యూనిస్టులు రష్యావారికి దాసానుదాసులై వా రెట్లు చెప్పిన అట్లు నడుచుకొనువారుగా ఉన్నారు. వారికి దేశాభిమానముగాని, దేశభక్తిగాని లేదనియు, వారి భక్తి అంతయు విదేశీయులగు రష్యావారి పట్లనే అనియు ఒక అభిప్రాయ మున్నది. ఇట్టి వారివలన ఎన్నటికిగాని దేశమునకు ప్రమాదమే. కమ్యూనిస్టువిజయ మనిన రష్యావారికి దేశము లోబడిపోవుటయే. ఇదిగాక కమ్యూనిస్టులు దౌర్జన్యము ననుసరించువారు. కారణ మున్నను, లేకపోయినను అల్లరులను లేవదీసి దేశమందు గందరగోళము కలిగించి ప్రభుత్వమువారు ఎదుర్కొనవలసిన చిక్కులను వృద్ధిచేసి, అధికారమునకు రావలయు నని చూచువారు. శాంతముగ ప్రజల అభిప్రాయములను మార్చి ఎన్నికలద్వారా అధికారమును సంపాదించుట వారి ప్రధానసాధనము కాదు ఇది వారి దృష్టిలో అప్రధానమైనది. అల్లరులను లేవదీసి, రక్తపాతముద్వారా కూడ అధికారములోనికి వచ్చుటకు వారు వెనదీయరు. కనుక ప్రజాస్వామ్యమునకు వారు విరోధులు. వీరి ప్రచారమూలముననే కేంద్రప్రభుత్వపు ఉద్యోగస్థులు కలకత్తాలో సమ్మెచేయ సిద్ధపడియున్నారని పండిత నెహ్రూగారు ఈమధ్యనే ప్రకటించిరి. ప్రజలందరికి చట్టవిరుద్ధముగ ఆయుధములను పంచిపెట్టి అల్లరులను లేవదీయుచున్నా రన్న కారణమున పశ్చిమబెంగాలు ప్రభుత్వమువారు కమ్యూనిస్టుసంఘమును అక్రమసంఘముగ ప్రకటించిరి. వీరి దుష్ప్రచారమూలమున ధాన్యసేకరణ వెనుకబడిపోవుచున్న దనియు, వ్యవసాయకూలీలు, ఫ్యాక్టరీలలోని కార్మికులు అనవసరముగ సమ్మెలుచేసి, ఉత్పత్తికి భంగకరముగ ప్రవర్తించుచున్నారనియు మద్రాసుప్రధానమంత్రి ప్రకటించెను. హైదరాబాదుసరిహద్దులలో జరుగు అక్రమచర్యలకు కొంతవరకు వీరే కారణభూతు లని పోలీసు మంత్రి డాక్టరు సుబ్బరాయన్ స్పష్టపరచెను.

హైదరాబాదులో రెండుజిల్లాలయందు కమ్యూనిస్టులే పరిపాలించుచున్నట్లు అనేకులు ప్రకటించుచున్నారు. ఇది కూడ ప్రమాదమగు విషయమే. ఏవో కొన్ని గ్రామములను మొట్టమొదట వశపరచుకొని క్రమక్రమముగ దేశమందంతట వ్యాపించుట వీరు అనుసరించు మార్గములలో ఒకటి. చైనాలో వీరిట్లే చేసిరి. ఈ సందర్భముల నన్నిటిని గమనించి, కమ్యూనిస్టుపక్షము మూలమున దేశమందు రక్తపాతసహితమగు విప్లవము సంభవించకుండునట్లు చేయు ఉద్దేశముతో ప్రభుత్వమువారుండుట గమనించదగిన విషయము.

## సోషలిస్టులు విడిపోవుట

రాజకీయవాతావరణములో గతమాసమున మరియొక మార్పుకూడ కలిగెను. జయప్రకాశనారాయణ్, ఆచార్య నరేంద్రదేవ్ మొదలైనవారి నాయకత్వమున కొన్ని సంవత్సరములనుండి కాంగ్రెసులో ఒక పక్షముగ పనిచేయుచుండిన సోషలిస్టులు కాంగ్రెసునుండి విడిపోయి స్వతంత్రరాజకీయపక్షముగ ఏర్పడిరి. సోషలిస్టువిధానమును ప్రజాస్వామ్యసిద్ధాంతముల ననుసరించి దేశములో ప్రవేశపెట్టుటయే వీరి ఉద్దేశము. దౌర్జన్యవిధానమును, వర్గసంఘర్షణతత్వమును వీరు నిరాకరించువా రగుటచే వీరికిని, కమ్యూనిస్టులకును భేద మున్నది. వీరిది సుకమాందోళన. కాంగ్రెసుపక్షమువారు ధనికవర్గమువారిని రక్షించువా రనియు, సామాన్యప్రజలకు కావలసిన సదుపాయములను చేయుటకు జంకుచున్నా రనియు, వారిని విమర్శించగల సక్రమపక్షము, దేశభక్తిగల పక్షమును ఒకటి ఉండుట అత్యావశ్యమనియు, కమ్యూనిస్టుపక్షమునకు ఇట్టి లక్షణములు లేవనియు ఊహించి సోషలిస్టులు ప్రత్యేకపక్షముగ ఏర్పడిరి. సామాన్యప్రజల భోగభాగ్యములు వృద్ధిగాంచవలెననియు, ధనికులకును, దరిద్రులకును మధ్య నుండు అంతరాళము పూడవలె ననియు కాంగ్రెసువారుకూడ అంగీకరించుచున్నారు. కాని దీనికి తగినట్లుగా కాంగ్రెసు ప్రభుత్వములవారు ప్రవర్తించకున్నారని సోషలిస్టుల ఆక్షేపణ. ఎట్టి ఆచరణయోగ్యమగు కార్యక్రమమును సోషలిస్టులు తలపెట్టియున్నారో చూడవలసియున్నది. వారి నిర్మాణకార్యక్రమము బహిరంగమైనగాని ఎంతవరకు ప్రజల ఆమోదమును వారు పొందగలవా రగుదురో చెప్పజాలము. అట్టి కార్యక్రమమును వారు వెంటనే తయారుచేయవలెను.

## ముస్లింలీగు

గతమాసమున మద్రాసులో జరిగిన సమావేశమునకు ఫలితముగ ముస్లింలీగు రద్దగునని అనేకులు అభిప్రాయపడిరి. కాని అట్టిది జరగలేదు. ముస్లింలీగు అను పేరుతో కొందరు మహమ్మదీయులు ఇకమీదట కూడ పనిచేయుటకు సిద్ధపడియున్నా రనియే దీని అర్థము. ఇట్టి కులమతతత్వమును ఆధారముచేసికొన్న సంఘములు దేశమం దుండుట యుక్తమా? అని అనేకులు శంకించుచున్నారు. రాజ్యాంగపరిషత్తువారు ఆమోదించబోవు రాజ్యాంగమందు సంఘములను స్థాపించి పనిచేయుటకు వ్యక్తులకు సర్వస్వాతంత్ర్యము ఉన్నట్లు చెప్పబడియున్నది. కనుక లీగు అను పేరుతో మహమ్మదీయులు లోక ప్రత్యేకసంఘమును స్థాపించుకొనుట అక్రమము కాదు. కాని ఆ పేరుతో ఒక ప్రత్యేకరాజకీయపక్షము ఏర్పరచుట అనుచితము. రాజకీయముగ మతసంఘములు చేయదగిన పను లేవియు లేవు. మతప్రచారమునకును, వారి సాంతివిజ్ఞానమును అభివృద్ధిచేసికొనుటకును ప్రయత్నించుటయే వా రనుసరించదగిన విధానము. ఈ విచక్షణను మన మహమ్మదీయసోదరులు చేయుదు రని నమ్ముచున్నాము.

## మద్రాసు రాష్ట్రము

మద్రాసురాష్ట్రములో గతమాసపు చర్యలలో గమనించదగిన విశేషము లనేకములు లేవు. ఈమధ్య కాంగ్రెసుపక్షమువారు సమావేశమై శ్రీ ఓమాండూరు రామస్వామిరెడ్డిగారినే తిరిగి నాయకుడుగ ఎన్నుకొనిరి. వారిపై ప్రకాశంపంతులుగారు పోటీచేసిరి గాని వారి పోటీ నెగ్గలేదు. ఈ ఎన్నికల సందర్భములో ముఠాలనేకములు బయలుదేరి, కుట్రలు పన్ని, పార్టీయొక్క ప్రతిష్ఠను భంగపరచిన వని చెప్పకతప్పదు. అట్టి మహానాయకులలో ఒకరగు శ్రీ వైద్యనాథయ్యరు పత్రికలలో ప్రకటించిన ఉత్తరము ఈ సందర్భములో అందరును చదువదగియున్నది. బ్రాహ్మణుల

పైనను, ఆంధ్రులపైనను ద్వేషమును పురికొల్పి, ఎన్నికలలో విజయము సంపాదించుటకు ప్రయత్నించుట కూడ కాంగ్రెసువంటి జాతీయసంస్థ చేయదగినది కాదు. మద్రాసులో ఇప్పుడు ఏర్పడియుండు కాంగ్రెసుపక్షము ఈ విషయములలో సంస్కరింపదగియున్నది.

## ఆంధ్రరాష్ట్రము

కాని ఇంతకంటెను ప్రధానమైన విషయము ఆంధ్రరాష్ట్రనిర్మాణము వెనుకబడిపోవుటయే. ఏప్రెలు నెలలో ఆంధ్రరాష్ట్రనిర్మాణ మగునని మన పెద్దలనేకులు చెప్పుచువచ్చిరి. కాని మార్చి ౧౮ తేదీన పండిత నెహ్రూగారు విశాఖపట్టణములో గావించిన ఉపన్యాసమూలమున ఎప్పటికో గాని ఆంధ్రరాష్ట్రనిర్మాణము కాజాలదని స్పష్టమయ్యెను. అట్టి రాష్ట్రము ప్రస్తుతపరిస్థితులలో అవసరమా అన్న ప్రశ్న మొదట తేలవలసి ఉన్నదనియు, దానిని తేల్చుటకు కేంద్ర ప్రభుత్వమువారొక కమిటీని ఏర్పాటు చేయుదురనియు, వారవసరమని సిఫారసుచేయునెడల సరిహద్దులను నిర్ణయించుటకొక సంఘమును కేంద్రప్రభుత్వము ఏర్పాటుచేయుననియు అందుపై ప్రత్యేక ఆంధ్రరాష్ట్రము నిర్మాణమగుననియు నెహ్రూగారు చెప్పిరి. ఇది చాల ఆశాభంగకరమగు మాటలు. భాషాప్రయుక్తరాష్ట్రసిద్ధాంతమును కాంగ్రెసువారు ఎన్ని సంవత్సరములక్రిందనో అంగీకరించిరి. ఆ సిద్ధాంతము ననుసరించి వారు కాంగ్రెసుకమిటీలను ఏర్పరచి పని చేయుచున్నారు. అట్టి పరిస్థితులలో ఆంధ్రరాష్ట్ర మవసరమా అన్న ప్రశ్న లేనేలేదు. అది ఒకటి ఉన్నట్లు భావించి, దానికి సమాధానమును ఆలోచించుటకొక సంఘమును ఏర్పరపజూచుట నిరసింపదగిన విషయము. ఇట్టి విచారణ అవసరము లేకయే, సరిహద్దుసంఘమును నియామకము చేయవలసినదిగా డాక్టరు అంబేద్కరుకమిటీవారు సూచించియుండిరి. ఆ సూచనకు విరుద్ధముగ పండిత నెహ్రూ ఇప్పుడు ప్రవర్తింపజూచుట ఆంధ్రులకు అన్యాయము చేయుటయే. ఇట్టి అన్యాయము జరుగకుండ, వెంటనే సరిహద్దుసంఘము నిర్ణయమగునట్లు ఆంధ్రులు ఆందోళన చేయవలసి ఉన్నది. (1-4-48)



# కలగూరగంప

## పూర్వచాళుక్య యుగమునందలి బ్రాహ్మణ ప్రముఖులు

ఎన్నియో శతాబ్దములనుండి యాంధ్ర దేశమున బ్రాహ్మణు లుండి రనియు, సర్వతోముఖ పాండిత్య మండితులు, సద్గుణ విరాజితులు నగు విప్రోత్తము లెందరో ఆంధ్రరాష్ట్రమునకు, రాజులకు, ప్రజానీకమునకు ప్రశస్తతిపాత్ర మగు సేవ నొనర్చి రనియు నెల్లరకు దెలిసిన విషయము. చరిత్రప్రసిద్ధములగు కొన్ని నిదర్శనము లాధారము జేసికొని, పూర్వచాళుక్య యుగమున (క్రీ. శ. ౬౨౪-౧౦౭౦) వెలసిన కొందరు మహీసుర ప్రముఖులనుగూర్చి తెలుపుటయే యీ వ్యాసమునకు ముఖ్యోద్దేశము.

పూర్వచాళుక్యసంస్థాపకుడగు కుబ్జవిష్ణువర్ధనుడు భూసురుల కనేకదానము లొసగెను. వేదములు, వేదాంగములు, స్మృతులు, పురాణములు, ఇతిహాసములు జిహ్వాగ్రమున గల విష్ణుశర్మకు, మాధవశర్మకు నమ్మహీకాంతు డనేకసత్కారము లొనర్చెను.

రెండవ చాళుక్యభీముడు (క్రీ.శ. ౯౩౪-౯౪౫) శర్మశర్మ కొమ్మనార్యుని కుటుంబమును సంస్తుతించెను. కొమ్మనార్యుని పుత్రులు, పౌత్రులు సభాపూజ్యులు; పండితాగ్రేసరులు. వారి కనేకాగ్రహారము లీయబడెను.

మూడవ విష్ణువర్ధనుని కాలమున (క్రీ. శ. ౭౦౯-౭౪౬) రాజాంతఃపురకాంతలుగూడ భూదేవులను సత్కరించుచుండిరి.

ఎనిమిదవ శతాబ్దమున భావశర్మ యను గోత్రామరశ్రేష్ఠు డుండె ననియు, నాతడు మూడువేల విద్యలలో ప్రవీణు డనియు, వేదవేదాంతములకు, తర్కశాస్త్రమునకు, యోగశాస్త్రములకు, నుపనిషత్తులకు నతడు వ్యాఖ్యానములు రచించె ననియు నిదర్శనములు లభించినవి. మాధవసోమయాజిపుత్రుడు, విజ్ఞానయ్య, పోతనయ్య, పోతనభట్టు, పాండ్యుడు, పంపన్న, భట్టోపాధ్యాయుడు వేదపారీణులై పౌరోహిత్యవిశారదులై తత్కాలమున విరాజిల్లిరి.

అయ్యుగమున విద్య తండ్రినుండి తనయునకు, నాచార్యునుండి శిష్యునకు సంక్రమించి వ్యాప్తిచెందుటయే కాక, ఘటికల (పాఠశాలలు) లో గూడ బోధింపబడుచుండెడిది. మొదటి జయసింహుడు (క్రీ. శ. ౬౩౩) అసనాపురమున కేగి యచ్చటి విద్యాపీఠమున నుపాధ్యాయులగు రుద్రశర్మ, మండశర్మ, కాంతిశర్మలకు బహుమతు లొసగెను. రెండవ విష్ణువర్ధనుడు (క్రీ. శ. ౬౭౩-౬౮౨) ప్రసాదించిన శాసనమువలన ధ్రువశర్మ యను భూబృందారకుని గూర్చి వినవచ్చును. పదకొండవ శతాబ్దమున పిఠాపురమున, ద్రాక్షారామమున విద్యావ్యాప్తికై మహోపకార మొనర్చిన బ్రాహ్మణులకు రెండు సత్రములు నిర్మించెను—మేడమార్యుడు.

పూర్వచాళుక్యుల యాస్థానకవు లెందరో బ్రాహ్మణులు. రాజు లొసగిన శాసనము లెన్నియో వారు లిఖించినవే. భట్టకేశవుడు (కట్ట గుండుడు), మాధవభట్టు, పోతనభట్టులు తామ్రశాసనములు వ్రాయుటలో నిపుణులు. రెండవ అమ్మరాజను రాజేంద్రుడు (క్రీ. శ. ౯౪౫-౯౭౦) ఇచ్చిన దానశాసనము నయ్యన్న భట్టు రచించెను.

రాజరాజునకు, నతని జ్యేష్ఠసోదరుడు విజయాదిత్యునకు నాస్థానకవి ముత్తయ్యభట్టు. వాని జనకుని యాస్థానకవి భీమనభట్టు. విజయాదిత్యుని సుతుడు శక్తివర్మయాస్థానమున విరాజిల్లిన యష్టదిగ్గజములలో నారాయణార్య డను కవివతంసుడు గలడు. ఇత డాంధ్ర, కర్ణాట, ప్రాకృత, పైశాచ భాషలలో కూలంకష

ప్రజ్ఞ గలవాడు. రాజరాజనరేంద్రుని కాలములో (క్రీ. శ. ౧౦౧౮–౧౦౬౩) నన్నయభట్టునకు భారత రచనాసందర్భమున "పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నారాయణునట్లు" తోడ్పడిన వాఙ్మయధురంధరుడీ నారాయణభట్టు. ఈ కవీంద్రునకు 'కవిరాజశేఖర, కవిభావవజ్రాంకుశ, అష్టదశావధానచక్రవర్తి, సకలేవ్యతీకర్ణావతంస, చక్రవర్తి త్రైలోక్యమల్లదేవప్రధాని, అకలంకానామార్య' అను బిరుదములు కలవు.

ఆంధ్రకావ్యరచనమున మార్గదర్శకులు మహీసురులనుట నిర్వివాదాంశము. బౌద్ధులకైనను, జైనులకైనను వారు ప్రజాసామాన్యము మాటలాడు భాషలో మహోత్కృష్టభావములను నిరూపించి చిరస్మరణీయము లగు గ్రంథము లాంధ్రలోకమునకు ప్రసాదించిరి. సంస్కృతభాషా సారామణీయకతను వారు కావ్యముఖముల నాంధ్రుల కందించిరి. ఆంధ్రభారతరచనమునకు బూర్వ మాంధ్రుల ధీశక్తి చిత్రకళారచనమునందే వ్యక్తమగుచుండెను. నన్నయార్యుని లేఖినీముఖమున నాంధ్రధీశాలిత్వము భారతరూపమున సాక్షాత్కరించినది. ఆంధ్ర మనాగరికులభాష యనియు, నసంపూర్ణమగు భాష యనియు నవ్వుచుండిన సంకుచితాభిప్రాయమును నన్నయార్యుడు రూపుమాపెను. ఆంధ్రచరిత్రమందే గాక, భారతదేశచరిత్రమున గూడ విఖ్యాతి గాంచిన రాజరాజనరేంద్రుని సంకల్పము, బ్రాహ్మణవంశాలంకారమగు నన్నయవిరచితమగు భారతము పంచమవేద మని ప్రశస్తిగాంచి, యాంధ్రభాషను ప్రపంచవాఙ్మయమున మహోన్నతస్థానమున నుంచిన దనుట యతిశయోక్తి కాదు. నన్నయకు బూర్వము తెనుగుబాసలో మాటలాడుకొనుటయు, పురాణగాథలు చూచుటయే గాని గ్రంథములు వెలువడలేదు. నన్నయ భారతరచనమున కుపక్రమించిన నాటినుండియు నాంధ్రులు మాతృభాషామృతమును దనివార గ్రోలు భాగ్యమును బడసిరి.

బ్రాహ్మణు లెందరో గురువులై రాజపుత్రులను దిద్ది తీర్చిరి. మొదటిజయసింహుని సమకాలికుడైన దండి దశకుమారచరిత్రమున రాజనందనులకు బోధింపవలసిన అనేకవిషయములను చేర్కొనెను. ఈ విషయముల సమగ్రముగ బోధించు శక్తిగలవా రా కాలమున బ్రాహ్మణులే. మొదటి జయసింహుడు విద్వాంసుడు. రెండవ విష్ణువర్ధనుడు, నతని సుతుడు మంగియు విద్యావంతులు.

మూడవ విజయాదిత్యుడు, మొదటి చాళుక్యభీముడు కవిశాస్త్రీయులు. దానార్ణవునకు నరువదినాల్గు కళలు సుపరిచితములు.

రాజాస్థానములలోని పంచప్రధానులలో బ్రాహ్మణుండీ యా భూపాలురకు సదా ఆలోచనము లిచ్చుచుండెను. సభాపండితులు, జ్యోతిష్కులు, స్మృతివినిర్ణయకర్తలు సాధారణముగ నాకాలమున భూసురులే.

వేదాదులనే గాక, ధనుర్వేదమున గూడ కృతహస్తులై మేదినీసురులు మేదినీశ్వరులకు రణరంగములగూడ తోడ్పడుచుండిరి: వీరచోడుని పాలనమున పోతనకుమారుడు మేడమార్యుడు మహాయోధుడని పేర్వడెను. రాజరాజు పోతనకు 'రాజరాజబ్రాహ్మమహారాజ' అను బిరుదిచ్చెను.

కొందరు ద్విజులు సచివులై రాజులకు చేదోడువాదోడులై యుండిరి. మూడవ విజయాదిత్యుని మంత్రి వినయాధిశర్మ. అతడు శత్రుభూపాలుడగు మంగినోడించుటకు సులభోపాయమును నిజస్వామికి దెల్పెను. రెండవ అమ్మమంత్రి దుర్గయార్యపౌత్రుడగు కుప్పనామాత్యుడు. రెండవ అమ్మరాజ్యమున గోత్రాధికారి, లేఖకులపై యజమానియు గోరమయ్య. అతని రూపసి యనియు, సత్తము డనియు, వినయవంతు డనియు, ధీశాలి యనియు, వాక్చాతుర్యధుర్యు డనియు, హాస్యరసప్రగల్భు డనియు, న్యాయమార్గానువర్తి యనియు, దైవతత్పరచిత్తు డనియు సమకాలికులు వచించుచుండిరి.

భట్టు, ఆర్యుడు, అయ్య, స్వామి, శర్మ అను గౌరవపదములు గలిగి బ్రాహ్మణులు దివిలవిషయము మొదలు కమ్మనాడువిషయముదనుక (విశాఖజిల్లా మొదలు గుంటూరుజిల్లావరకు) తత్కాలమున విలసిల్లుచుండిరి. విద్యాబోధకులై, సచివులై, యోధులై, కవీంద్రులై వారకాలమున నాంధ్రచరిత్రమందు పేరుప్రతిష్ఠలు గడ్గి విరాజిల్లిరి. వారల్పసంఖ్యాకులే. కాని వారి యోగ్యత, సత్ప్రవర్తనము, విద్యావైభవము, ధీబలము, కార్యతత్పరత, స్వార్థవిముఖత, దేశభక్తి, రాజభక్తి, దైవభక్తి, సంఘసేవాసక్తి చూచి యానాటి విశ్వంభరావల్లభులు భూసురుల నాదరించి గౌరవించి వారికి మహోపకారము లొనర్చుచుండిరి.

కూరెళ్ల రామనరసింగరావు.

# క్లార్కులు

"కోటివిద్యలూ కూటికొరకే" అన్నారు. ఈ కూటికోసమే నరుడు పడరాని పాట్లు పడతాడు. తిరగరాని చోట్ల తిరుగుతాడు; చేయరాని పనులు చేస్తాడు; వెయ్యరాని వేషాలు వేస్తాడు; ఎన్నో వృత్తులు అవలంబిస్తాడు; ఎన్నో విద్యలు నేరుస్తాడు; ఎన్నో చదువులు చదువుతాడు; ఎన్నో యుక్తులు పన్నుతాడు; ఎన్నో యెత్తులు వేస్తాడు. ఈవిషయాన్నే శ్రీ శంకరాచార్యులవారు "ఉదరనిమిత్తం బహుకృతవేషం" అని ఒక మాటలో తేల్చినారు.

ఉద్యోగములుకూడా ఉదరపోషణకు చాలా మందికి శరణ్యమైన వృత్తిగా వస్తూంది. జ్యోతిశ్శాస్త్రంలోని యోగాలు తమంతట తామే వస్తూపోతూవుంటవి. కాని ఉద్యోగము మాత్రం అదిగా రావు. మనం తెచ్చుకోవలసి ఉంటుంది. కాబట్టే "ఉద్యోగం, ఉద్యోగం అంటే ఊరకవస్తుందా!" అని ఒక కవి పాడినాడు. పూర్వం "ఉద్యోగ" పదానికి అర్థం వేరు, ప్రస్తుత అర్థం వేరు. భారతంలోని పద్ధెనిమిదిపర్వాలలో "ఉద్యోగపర్వం" ఒకటి. అందులో ఆకాలపు రాజ్యతంత్రవిచక్షణత, ఉన్నతమైన రాజనీతినిగురించి తెలుసుకోవచ్చు. చాకలినిచూచి "ఉద్యోగానికి పోలేదా?" అని అడిగితే, "ఈదినం బట్టలు వుతకడానికి రేవుకు వెళ్ళలేదా?" అన్న భావం. ఈఅర్థంలోనే నేటికిని కొన్నిపల్లెలలో "ఉద్యోగ" పదాన్ని ఉపయోగిస్తారు. అయితే, తెల్లవారు మన దేశంలో అడుగు పెట్టిందిమొదలుకొని మన దేశచరిత్ర అంతా ఒక పెద్ద ఉద్యోగుల పర్వంగా మారిపోయింది. మొట్టమొదట బ్రిటిషురాజ్యస్థాపనకు పునాది మన దేశంలో వేసిన వాడు ఈస్టిండియాకంపెనీతరఫున వచ్చిన ఒక ఉద్యోగియే-అందులోనూ "క్లార్కు" అనబడే చిన్న ఉద్యోగియే (గుమాస్తా). అందుకని అతనికి వుద్యోగపదవి ఉన్నతమై గవర్నరుజనరలైనాడు.

తర్వాత, క్లార్కుచే స్థాపింపబడిన బ్రిటిషు రాజ్యపరిపాలనాయంత్రం నడిపించడానికి క్లార్కులు చాలామంది కావలసిరాగా, అందుకు బెల్లంలో పొదిగిన చేదుమాత్రలాగా ఇంగ్లీషుచదువును మన కంటించినారు. ఈపడమటిగాలి మన నాగరకతను నడివీధిలోకి తెచ్చి, వ్యక్తిత్వమును మంటలో కలిపి, భావస్వాతంత్ర్యమును బందులుచేసి, మన జాతీయజీవితపు పునాదులను పూర్తిగా కదిలించివేసినది. అది మొదలుకొని మన చదువులు మారింది. మాతృభావలు మరచిపోవడం తటస్థించింది. పంచకావ్యపఠన పోయి, పరీక్షలు ప్రాధాన్యం వచ్చింది. విద్యార్జనం విజ్ఞానానికిగాక, ఉదరపోషణార్థం, వుద్యోగసంపాదనకుగాను కావొచ్చింది. క్రమేణా దేశముయొక్క సిరి సంపదలు విదేశములకు పోగా-దాస్యశృంఖలాలతోపాటు దారిద్ర్యము పీడించడంమూలాన్ని పొట్టపోషణ కష్టమై ఉద్యోగపు ఉబలాటం ఎక్కువైపోయింది.

అందులోనూ సర్కారువుద్యోగం కావలిస్తే 'సర్వీసుకమిషను' అడ్డు వేసే. కష్టపడి అదీ సాధిస్తే 'కన్ఫర్మేషను రొటేషను' అంటూ పానకంలో పుడక. 'అన్నపొంతవాలూ' వుంది, కాని ఆయుర్దాయం తక్కువ అన్నట్లు, ఒక్కొక్కటిగా యీయిక్కట్లు తప్పితే 'ఓవరుయేజి' అని తొలగేయడం! పిల్లనిచ్చే వానికి వయసుతో ప్రమేయంగాని సర్కారువుద్యోగానికి యీసంబంధమేమిటో! పోనీ, అన్నగం దాటూ గడిచి అర్జను వచ్చిందంటే, పోస్టింగులవెంట పోస్టింగులు, పోస్టింగులవెంట పోస్టింగులు-"పునరపి జననం, పునరపి మరణం"అన్నట్లు! ఈపోరంతా పడి 'ప్రొబేషను'దినాలు గడిపి, కన్నగడ్డి తిన్నతర్వాత 'కన్ఫర్మేషను' వస్తే, దినగండం నూర్గాయుష్షుగా కాలం గడిపి, జి. ఓ. లు వల్లెవేస్తూ, జీతాల కొరకు చూస్తూ, ఇంక్రిమెంట్లు రాకపోయినా యింట్లో మనుష్యులు యెక్కువవుతూ, చావలేక బ్రతికి, పెన్షను తీయడానికి పూర్వమే పెద్దలలో కలిసేవారు చాలా మంది. 'పెన్షనబుల్ సర్వీసు'అని పెనుగులాటేగాని, పించనీ పుచ్చుకొంటూ నూరేండ్లు బ్రతికినవారు నూటికి ముగ్గురో, నలుగురో!

ఈఉద్యోగులలో యెంతో కొంతమందితప్ప తక్కినవారంతా చిన్నఉద్యోగులగు క్లార్కులే. కష్టమంతా యీ క్లార్కులది; పేరంతా పెద్దఉద్యోగులది. "Work late-hours, Attend Sundays, What delays"-ఇత్యాది అస్త్రప్రయోగాలు చేస్తూ, అవీ ఫలించకుంటే "చార్జిషీట్లు, సస్పెండ్లు"అని భయపెడుతూవుంటారు. ఇవన్నీ సహించి, నీళ్లునములుతూ వుండకుంటే 'యిన్సబార్డినేషను'అని యింటికి పంపుతారు. లేదా యింక్రిమెంటు కున్న పెడతారు. వీరిమధ్య జాగ్రత్తగా మసులుతూ 'ఎఫిషియెన్సీబార్' దాటేసరికి యముణ్ణి జయించినంత పని అవుతుంది. "Yes Sir, Error Regretted, Noted for Future Guidance"అనే పదాలు క్లార్కులకు రక్ష

మంత్రాలు; చిన్న చిన్న తప్పులనుండి కాపాడే చిట్కా మంత్రాలు.

ఇంత కష్టంతో కూడిన సర్కారునౌకరీకి అందరూ ఎందుకు రావాలి అన్నది ప్రశ్న. రాక తప్పదనే సమాధానం చెప్పవలసివస్తుంది. కారణం మనకు హైస్కూళ్లలో చెప్పిన చదువే అందుకై పాయె. స్కూలుఫైనలు కావడంతోటే మనకు అలవడేది ఉద్యోగమునకు అర్జీలు పెట్టే విధానమే. ఇది చెప్పడానికి యింగ్లీషుమాస్టరు తీసుకొనే శ్రద్ధ యింతా అంతా కాదు. పరీక్షలోనూ యీప్రశ్నే అడుగుతారు పదేపదే. ఈ విద్యాభ్యాసఫలితంగా కులవృత్తులకు దూరమై సర్కారుఉద్యోగములు సంపాదించడమే శరణ్యంగా పరిణమిస్తుంది చిత్తవృత్తి. ఇంతేకాదు; యీవిద్యఫలితంగా సర్కారుఉద్యోగపుసరదా సమాజంలోకి బాగా పాకిపోయింది. "గవర్నమెంటుఉద్యోగం చేయరా నాయనా!" అని అవ్వలు మనసారా దీవించడం, పిల్లనిచ్చే మామగారున్నూ "ఫించనువచ్చే ఉద్యోగం చేస్తున్నాడా" అని ప్రీతితో అడగడం మామూలైపోయింది. మనలో, అన్నిరష్టాలకన్న, యీ కలంపడిపి జీవించే క్లార్కువృత్తిపై ఆధారపడిన అభాగ్యులు ఎక్కువ.

చె. శ్రీ. వెంకటరామయ్య



సుప్రసిద్ధ ఆంధ్రచిత్రకారులైన అంకాల వెంకట సుబ్బారావుగారు చిత్రించి, భీమవరం కళాశాలలో పింగళి లక్ష్మీకాంతంగారు ఆవిష్కరించిన 'కవి తిక్కన' చిత్రము.



# విమర్శనము



### నాగార్జున చరిత్ర

రచయిత : శ్రీ డాలీ లక్ష్మీనారాయణగారు, మోర్జంపాడు, గుంటూరుజిల్లా. వెల రూ. ౨.

నాగార్జునకొండ శిల్పక్షేత్ర ప్రతిష్ఠాపకులైన నాగార్జునాచార్యులవారి సమగ్ర జీవితచరిత్ర ఇది. వట్టి పుక్కిటిపురాణములతో ఉపశమించక, వారి జీవితమును సంబంధించిన అనేకచరిత్రలను, అనేక గ్రంథములను, పెక్కు శాసనములను పరిశీలించి, వీలయినంత ప్రామాణికముగా రచించవలె నన్న దృఢసంకల్పముతో లక్ష్మీనారాయణగారు దీనిని రచించినారు. తమ వాదములకు వలసిన ప్రమాణములను గూడ చూపినారు. వాటి బాగోగులమాటకేమిగాని, ఇంతటి సమగ్రచరిత్ర ఇంతవరకు తెలుగులో లేని లోటును తీర్చినందుకు వీరి కృషి తప్పక మెచ్చదగియున్నది.

*　　*　　*

### తిక్కన

రచయిత : మండలపర్తి ఉపేంద్రశర్మగారు, యం. ఏ. ప్రాప్తిస్థానము : ప్రాచ్యసారస్వత విజ్ఞాన పరిషత్తు, గుంటూరు. వెల రూ. ౧.

తిక్కనకవిబ్రహ్మజీవితములోని కొన్ని పరమార్థములను వస్తువుగా గ్రహించి ఆయా పాత్రలను తగినరీతిగా పోషించి, ప్రదర్శనమున కనువైనరీతిగా రచించిన ఆరురంగముల వచన నాటిక యిది. సంభాషణలు పూర్తిగా గ్రాంథికములోనే ఉన్నను సరళముగానున్నవి. పాత్రపోషణకూడ సహృదయ రంజకముగానున్నది. శివశంకరశాస్త్రిగారు రచించిన 'పీఠిక'యు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు వ్రాసిన 'ప్రస్తావము'ను, వున్నవ లక్ష్మీనారాయణగారి 'పరిచయము'ను ఈ నాటికా విశిష్టతను చక్కగా విశదీకరించినవి.

*　　*　　*

### నేటి మానవుని కృషి

మూలము : యఫ్. జీ. ప్యాస్. అనువాదము : చింతా దీక్షితులుగారు. ప్రకాశకులు : ఆక్సుఫర్డు యూనివర్సిటీ ప్రెస్, మద్రాసు. వెల రూ. ౧-౧౨-౦.

క్రీ. శ. ౧౮౫౦ నుండి నేటివరకు ప్రవృత్తమైన అధునిక ప్రపంచచరిత్ర ఇందులో సచిత్రముగా, ఉన్నతపాఠశాలల విద్యార్థుల కుపయోగముగా, సంగ్రహపద్ధతిని, సరళమైన భాషలో నిరూపింపబడినది. ఇటువంటి చరిత్రజ్ఞానమువల్ల బాలబాలికలకు ప్రాపంచిక జ్ఞానము పెంపొంది వారి మనస్సులు ఉదాత్తములగుటకుగూడ వీలుండుననుటకు సందేహము లేదు.

*　　*　　*

### భారతీయ నాగరకత

సి. ఇ. యం. జోడ్ ఆంగ్లరచనకు తల్లావఝుల కృత్తివాస తీర్థులుగారి అనువాదము. వెల రూపాయన్నర.



భారతీయ నాగరకతనుగురించి సహృదయుడైన ఈ ఆంగ్ల విద్యావంతుడు, పాశ్చాత్యపరిచయము లేక పోయినను, సమ్యగ్దృష్టితో భావనచేసి, ఈ నాగరకతనుగురించి తన అభిప్రాయములేవో ఇందులో అరమరికలు లేకుండ వెల్లడించినాడు. వానిని తెలుగులో పెట్టుటయందు శ్రీరు...లుగారు కూడ చక్కని మార్గమును అవలంబించి కృతార్థులైనారు.

* * *

## ప్రపంచ చరిత్ర

రెండవ భాగము. మూలరచయిత : జవహర్లాలు నెహ్రూ. అనువాదకుడు : చింతా దీక్షితులుగారు. వెల రెండురూపాయలు.

ప్రపంచ చరిత్రనుగురించి, ప్రపంచభూగోళమునుగురించి, నాగరికతా సంస్కృతులనుగురించి, వేయేల ప్రపంచ విజ్ఞానమంతటినిగురించి చేయబడిన సమగ్ర, సమర్థ సమీక్ష నెహ్రూగారి 'ప్రపంచచరిత్ర'. మన బాలబాలికలు అవశ్యము చదివి మననము చేయదగినది. అనువాదము తొలిభాగమువలెనే కంటెను నిర్దుష్టమైయున్నది.

పై రెండును పెరంబూరు (మద్రాసు)లోని సంస్కృతి గ్రంథమండలివారి ప్రచురణలు.

* * *

## విశాలాంధ్ర

పరిశోధనపద్ధతిని, పరిశోధనఆశయాలతో, విశాలాంధ్రనిర్మాణలక్ష్యం పెట్టుకొని బయలుదేరిన క్రొత్త మాసపత్రిక. సంపాదకులు : సెట్టి ఈశ్వర రావు గారు, ౯ సి, పోలయప్పమొదలివీధి, మైలాపూరు, మద్రాసు. సంవత్సర చందా 3 రూ. విడిపత్రిక ౪ అ. ఆంధ్ర జాతీయ వికాసాన్ని తెలిపే ముఖచిత్రంతో, శ్రీ. శ్రీశ్రీ, కుటుంబరావు మొదలైన వారి వ్యాసాలతో క్రిందటి నెల వచ్చిన మొదటి సంచిక స్థాపకుల ఆశయాభిప్రాయాలకు దర్పణప్రాయముగా వెలుగుచూపుతూవున్నది.

---

# గ్రంథ స్వీకారము

మౌలానాఅజాద్ చరిత్రము

ద్వితీయముద్రణము. రచయిత : కొమాండూరి కృష్ణమాచార్యులుగారు, వకీలు, కాకినాడ. వెల ౧ రూ.





Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T. Madras. Editor—S. Sambhu Prasad.